# బంగారు పంజరం

రచన :

మహాదేవశాస్త్రి జోషీ

అనువాదం :

ఎన్. జగన్నాథ్

విశాలాంధ్ర ప్రచురణాలయం
ఏలూరురోడ్డు : : విజయవాడ-2.

3

17 2-95

## ఇందులో కథలు

4

# సువార్త

ఈ పుస్తకంలోని ఆరు కథల్లోనూ నాలుగు కథలు మరాఠీ సినిమాలుగా రూపొందినవి. అంటే, ఈ కథల్లోని ముఖ్యాంశాన్ని మూలాధారంగా చేసుకునీ, కొంచెం విస్తరించీ, పొడిగించీ సినిమా కథలు వ్రాసుకున్నారు. కాని ఎవ్వరూ చోరీ చెయ్యలేదు. రచయితను సన్మానించి, ఆయన అనుమతి పొంది చలన చిత్రాలు తీశారు. "వేసవిగాడ్పు" అనే కథకు రచయిత శ్రీ మహాదేవ జోషీగారే సినిమా అనునయం కూడా వ్రాశారు.

తెలుగు సినిమాలకు కథావస్తువు కరువయిన సంగతి లోక విదితమే కనుకనూ, ఈ కథలలోని పాత్రలూ, సంఘటనలూ తెలుగు సాంఘిక జీవితానికి సన్నిహితంగా వుండటంచేతనూ ఇవి అనువదించి అచ్చు వేయించటానికి సాహసించాను.

మొదటి కథామాల అచ్చువేసిన అనతికాలంలోనే ఈ పుస్తకం కూడా అచ్చు వేయడానికి సమ్మతించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి నా కృతజ్ఞత.

15, పిళయార్ కోయిల్ వీధి
మద్రాసు—5.
10, జూన్ 1964

ఎన్. జగన్నాథ్

# బంగారు పంజరం

గృహప్రవేశం జరిగిన అయిదవరోజున నేను మా పుట్టింటి వారు కాపరంవున్న యింటికి వచ్చాను. సాయంకాలం ఎండ తగ్గిన తర్వాత, అందరూ మామూలుగా షికారు బయలుదేరే వేళకు నేను జట్కా బండిలోంచి దిగాను. మాంచి చమ్కీ పనిచేసిన కొత్తచెప్పులు తొడుక్కున్న పాదాలతో బండిలోంచి దూకాను. ఎడమ బుజంమీంచి వేళ్ళాడుతున్న సరికొత్త తోలుసంచీలోంచి పర్సుతీసి ఒకరూపాయి జట్కాబండి వాడికిచ్చాను. నాకుమల్లేనే కొత్త కాపరం ప్రారంభించిన పెళ్ళికూతురులాంటి తోలు సూట్‌కేస్ సునాయాసంగా చేతబట్టుకుని యింట్లో ప్రవేశించాను. పశ్చిమదిశలో అథాత్తుగా శుక్రుడు వుదయిస్తే వచ్చే వెన్నెల వెదజల్లుకుంటూ ముందుకుసాగాను.

నేను ప్రవేశించగానే అక్కడ ఆడుకుంటూన్న చిన్నపిల్లలందరూ, చేతుల్లో వస్తువులు ఎక్కడివక్కడ వదిలేసి నాకేసి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయారు. ఆ రెండంతస్తుల మేడలోవున్న ప్రతి కిటికీలోనూ విస్తారంగా చూస్తూన్న కళ్ళు, కమలాలలాగా వికసించాయి. ఆడవాళ్ళూ, మగవాళ్ళూ-ఎక్కువమంది ఆడవాళ్ళే నావేపు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

నేనూ చురుకుగా నా చూపులు అన్నివేపులా గిర్రున తిప్పి, చూచేవాళ్ళ వాలకాలు గమనించాను. ఆ చూస్తున్న వాళ్ళల్లో అనురాగమూ, అభిమానమూ కనిపించలేదు. ఆ కళ్ళల్లో వున్న భావాలు అసూయ, ఆశ్చర్యమూ; అంతే."నాలుగురోజుల క్రితం వెలిసిపోయి చిరుగులతోవున్న సాదాచీర కట్టుకుని, బోసిమెడతో ఈవడి కాపరాలమధ్యా తిరుగుతూండే "మంగళ"యేనా యివ్వాళ యిలా మహాలక్ష్మిలా తయారయి వస్తోంది. ఎంత విడ్డూరం నిజంగా !" అనే భావం స్పష్టంగా కనిపించింది వాళ్ళ ముఖాల్లో....

భారీ జరీవున్న పచ్చటి చీర కట్టుకుని, నల్లతాచులా వేళ్ళాడుతున్న జడ మొదట్లో పూలూ, నాగరమూ పెట్టుకుని, రెండు బిళ్ళోరి గాజుల మధ్య మెరుస్తూన్న బంగారపు గాజులు తొడిగిన చేతులు వూపుకుంటూ, మెళ్ళో ముత్యాలహారంతో, అల్లల్లాడే లోలకులతో....వాటన్నిటికంటే కూడా కళ్ళని ఆకర్షించే పెళ్ళికళ ఫెళ్ళుమని వెలిగిపోతున్న కోల ముఖంతో నేను ఠీవిగా వస్తూంటే,ఓర్వలేనివాళ్ళ కడుపుల్లో పోట్లు పుట్టే వుంటాయి. పది కాపరాల వాళ్ళకీ ఉమ్మడిగావున్న కుళాయి దగ్గరవున్న రెండుగదుల వాటాలో కాపరం చేస్తున్న మ్యునిసిపాలిటి ఆఫీసులో వున్న ఒక సామాన్య గుమాస్తా కూతురుకి అకస్మాత్తుగా యింతటి అదృష్టం పట్టటం—నిన్నటి గొంగళిపురుగు యివాళ సీతాకోకచిలక అయిపోవడంలా వుంది. ఆ కాపరాల వాళ్ళందరికీ నమ్మశక్యం కాని సంఘటనలా కనిపించింది. వాళ్ళకేమిటి ? నామట్టుకు నాకే ఇంకా ఆశ్చర్యం వదలలేదు. ఒక్కొక్కప్పుడు ఇదంతా అసలు నిజమేనా అనిపిస్తూంటుంది కూడా నాలో నాకే. నా తలిదండ్రులకి కూడా ఇంకా సంభ్రమం పూర్తిగా వదలనేలేదు. మామూలు పరిస్థితులలో, మా తరగతి వాళ్ళె వళ్ళు కన్నెత్తి చూడడానికి కూడా అతీతమయిన ఐశ్వర్యంగల యింట్లో దక్కన్ జింఖానాలోని ఒక పెద్ద బంగళాలోకి నేను తరలి

వెళ్ళటం ఎంతటి విచిత్రం ! ఆ వెళ్ళడమయినా ఆ బంగళాలో పని మనిషిగానో, పిల్లలని ఆడించేదానిగానో కాదు. ఆ బంగళా అంతకీ యజమానురాలుగా ప్రవేశించడం; ఇది ఊహకి అందని సంఘటనేగా మరి.

ఒక్కొక్క వ్యక్తి అదృష్టచక్రం నిజంగా యింత అకస్మాత్తుగా తిరిగి పోతూంటుందా అని నాకు ఎంతో ఆశ్చర్యం వేస్తుంటుంది. "ఏ క్షణానికి ఏం జరుగుతుందో చెప్పలేం" అనే పామరవాక్యం నమ్మవల సిందేనేమో కూడా అని తోస్తూంటుంది కొన్ని కొన్ని సంఘటనలని చూస్తూంటే. అదృష్టం అనేది ఏ క్షణంలో ఎవరిని పర్వతంమీది కెక్కి స్తుందో, ఎవరిని మురికికాలవలో ముంచేస్తుందో ఒక్క క్షణం ముందుగా తెలియదుగదా. ఆరోజున మేమొకపదిమంది ఆడపిల్లలం కలిసి పురం దర్ ఖిల్లా చూడ్డానికి వెళ్దామనుకోవడమేమిటి — వెళ్ళడమేమిటి — అక్కడ ఆ కోటంతా కిలకిలమంటూ తిరగడమేమిటి ఆ తర్వాత....

అసలు మొదట్లో నేను రాననే చెప్పాను నా స్నేహితురాళ్ళతో. వెళ్ళాలని కోరికలేక కాదు కాని, రెండుమూడు రూపాయలైనా ఖర్చు లకి కావాలిగదా అని. కోరికలెన్నుంటే ఏం లాభం ? రెండు రూపాయ లివ్వమని అడిగితే నాన్న ముఖం ఎంత చిన్నబోతుందో నాకు తెలుసు. అయినా యిలాటి ఖర్చులకు డబ్బేవుంటే, మానాన్న నన్ను కాలేజీకి పంపించి, చదివించనే చదివించేవారు. ఈ పరిస్థితులన్నీ నాకు బాగా తెలుసును గనుకనే "నేను రాను మీరు వెళ్ళండే" అని మొట్టమొదటి క్షణంలోనే చెప్పేశాను, నన్ను పిలవటానికి వచ్చిన స్నేహితురాళ్ళతో. కాని వాళ్ళు నాకళ్ళు గప్పి, మా అమ్మని చుట్టేశారు. "మంగళ రాక పోతే, అసలు మా ట్రిప్పులో సరదాయే వుండదండీ !" అంటూ ఆవిడ దగ్గర నన్ను పొగిడి, ఆవిడ అభిమానాన్ని రెచ్చగొట్టారు. సమయం చూసి, నాన్నగారి దగ్గర ఆ ప్రస్తావన అమ్మే తెచ్చింది. తనుకూడా

సిఫార్సు చేస్తున్న స్వరంతో. అంతగా యిష్టం లేకపోయినా,నాన్నగారు సరే అన్నారు. అప్పుడు నాకు సంతోషంతో చప్పట్లుకొట్టాలనిపించింది. ఆ మర్నాడు ఆ పురందర ఖిల్లా చూడ్డానికి కొండఎక్కుతున్నంతసేపూ, వసపోసిన పిట్టలాగా వాగుతూనే వున్నాను.

ప్రశాంతమయిన వాతావరణం,బంగారపు కాంతితోవున్న ఎండా, క్షణానికోవేపునించి రివ్వున వీస్తూ దేహాన్ని కౌగిలించుకుంటూన్న గాలీ, అక్కడక్కడ ఆకుపచ్చగా కనిపించే కొండా,దట్టమయిన చెట్లతోనల్లగా కనిపించే ఆ ఎత్తయిన శిఖరమూ— మనస్సులో ఉల్లాసాన్ని ఉద్భవింప చేశాయి. అంచేత మాఅందరి ముఖాలూ మంచులో తడిసిన మందారపువ్వుల్లాగా కలకలలాడుతున్నాయి. నేను మరీ పాలుతాగిన లేగదూడలాగా అటూ యిటూ పరుగెడుతున్నాను. కంటికి కనబడిన అడ్డదారుల్లోకి అందర్నీ లాక్కుపోవడం, మళ్ళా వచ్చి ఇంకో యాభైగజాల అవతల నలిగిన దారి పట్టుకుంటూండడం ఒక ఆట అయిపోయింది. ఇలాగే ఆడుతూ పాడుతూ శిఖరం చేరుకున్నాం.

కోట సింహద్వారం దగ్గిరవున్న బురుజుపైకి ఎక్కడానికికూడా నాదే ముందడుగయింది.కాలుకూడా పూర్తిగా మోపడానికి వెడల్పుచాలని ఆ మెట్లు నిటాగ్గా వుంటాయి. పట్టుకోడానికి ఒకే ఒకవేపున ఒక సీసపు గొట్టం వుంటుంది. నిటాగ్గావున్న నిచ్చెన ఎక్కినట్లు ఎంతో ఎత్తుకి ఎక్కడం అంటే చాలామందికి భయంవేసింది. అక్కడి కావలావాడు "వద్దమ్మా వద్దు" అంటున్నా నేను పైకి వెళ్ళిపోయాను. ఎత్తయిన కొండ ఎక్కిన తరువాత ఇంకా ఎత్తుగా ఎక్కడికయినా ఎక్కి వెళ్ళాలనే ఒక కోరిక సహజంగానే అందరికీ పుట్టుకొస్తుందో ఏమిటో మరి, నాకు మాత్రం అలా పైపైకి ఎక్కేస్తూ వుండాలనే వాంఛ కలిగినమాట వాస్తవం. నేను బురుజుమీద చుట్టూతిరిగి మైళ్ళ దూరంవరకూ కనిపిస్తున్న ప్రదేశం అంతా తనివితీరా చూశాను. కాని ఆ ఆనందం నేను

ఒక్కొత్తినీ అనుభవించినంతమాత్రాన్న నాకు తృప్తి కలగలేదు.అంచేత నా స్నేహితురాళ్ళని కూడా పిలిచాను. "ఏమే, పైకి ఎక్కరండే. ఎంత బాగుందో తెలుసా ? వచ్చి చూడండి మీరుకూడా. ఏమిటే మరీ యింత పిరికితనం మీకు ?"

ఆరోజున ఎంచేతో పురందర్ ఖిల్లా అంతా సమ్మర్దంగానేవుంది. మాకంటె ముందే అక్కడ ఒక స్టూడెంట్సు బృందం చేరి కోటంతా తిరుగుతూంది. మావెనక కాస్త దూరంలో యింకో కొంతమంది యువకులుకూడా ఆ ఖిల్లామీదకే వస్తున్నట్టు మాకు దోవలోనే కనిపించింది. వాళ్ళో నలుగురైదుగురుంటారు. వాళ్ళు క్రమక్రమంగా మా పమిటి కొంగులు తగిలేటంత దగ్గిరగా వచ్చేశారు. వాళ్ళందర్లోనూ మునుముందు నడుస్తున్న యువకుడైతే చూడ్డానికి మాంచి నదరుగా వున్నాడు. విశాలమైన నుదురూ, తెల్లటి శరీరం, తెల్లటి, పల్చటి బట్టలు కట్టుకున్నందువల్ల ఉన్నంతకన్నా ఎక్కువ పొడుగ్గా కనిపిస్తూన్న దేహంలో ఆ ఠీవి-నే గమనించక తప్పిందికాదు.

మేం పద్మావతీ తటాకందగ్గిర విశ్రాంతి తీసుకోడానికి వెళ్ళాం. ఆ యువకులకీ ఆ చెరువు నీళ్ళకోసమే దాహం వేసింది. మేం యింకో ప్రక్కనున్న మెట్లు ఎక్కడానికి వెళ్ళాం. తీరా పైకి చేరేటప్పటికి, అవతల ప్రక్కని కెమేరా కంటిదగ్గిర పెట్టుకుని గురిచూస్తూ ఆ పెద్ద మనిషి తయారు ! మేం అక్కడి గ్రామదేవత గుడివేపు మెట్టుదిగితే, అతనికీ ఆ గుడిని గురించే కుతూహలం కలిగింది. తన స్నేహితులందరూ వెనక పడుతూన్నా లెక్కచెయ్యకుండా, లేడివెనక పెద్దపులి పరిగెట్టినట్టు ఒదలకుండా మమ్మల్ని వెంటాడుతునే వున్నాడా రోజంతా.

అతనిలా ఎక్కడికెళితే అక్కడ ప్రత్యక్షమవటం.నా స్నేహితురాళ్ళకంటె నాకే ఎక్కువగా గోచరిస్తూండేది. ఎంచేతంటే అతని

చూపు ఎప్పుడూ నామీదే వుండేది. నేనొక్కత్తెనే ధైర్యంచేసి ఆ బురుజు ఎక్కిన క్షణంనుంచీ కూడా అతనిదృష్టి నన్నే వేటాడుతోంది. అతను వేసుకున్న అమెరికన్ బుష్షర్టు మీదకూడా వేటబొమ్మలే వున్నాయి. ఒక పొదమాటునుంచి పరిగెడుతూన్న లేడీ, దాని వెనకాలే తుపాకి గురిచూస్తూవున్న దొరగారూ-బొమ్మలు కొన్ని దజన్లున్నాయి. ఆ చొక్కాతొండా, అతని ప్రస్తుత ప్రవృత్తికి తగినట్లుగానే వున్నాయి ఆ బొమ్మలుకూడా. నాకు లోలోపల "ఇదెక్కడి శనిగ్రహం నావెంట పడింది!" అనిపించింది.

ఇక అప్పటికి ఒక్క కేదారేశ్వరాలయం తప్ప మేం చూడవల సిన ప్రదేశాలు అన్నీ చుట్టబెట్టేశాం. అన్నిటికంటే ఎత్తయిన శిఖరం మీద వుందా దేవాలయం. ఆ 72 మెట్లూ రెక్కలున్న అప్సరసల్లాగా ఎగురుకుంటూ ఎక్కిపోయాం. దేవాలయంలో ప్రవేశించి, గంటకొట్టి "శంభో హరహర" అని నోరారా ఉచ్ఛరించిన మరుక్షణం ఆ శబ్దం పదింతలుగా మా చెవుల్లో ప్రవేశించింది. గుడి బయటికొచ్చి చుట్టూ పరి కించి చూస్తే మాత్రం ఎవరున్నారు.

ఆగ్నేయపు దిక్కునవున్న పర్వతంమీద సూర్యకాంతి బంగారపు పుప్పొడి చల్లేసింది. ఉత్తరదిక్కున వున్న పర్వతపంక్తిని నీడా, ఎండా పంచుకున్నాయి. క్రింద కనిపిస్తూన్న మైదానంలోవున్న చెట్ల గుంపుల మధ్యనుంచి, నీరానది దారి వెతుక్కుంటూ, అవరోధాలు తప్పించుకుని, సంకేత స్థలానికి వెళ్ళే అభిసారికలాగా ఉరకుతోంది. మేం ఎక్కి వచ్చిన బాట పురందర పర్వతానికి మొలతాడులాగా కనిపిస్తోంది. ఆగుడి చుట్టూ తిరుగుతూ, ఇలా నాలుగువేపులా కనిపించే దృశ్యాలని తనివితీరా చూశాము. నా తృప్తికి మేరలేకపోయింది. నా ఆనంద జ్యోత్స్నకి ఆరోజు పౌర్ణమే ననిపించింది.

కాని, చంద్రుడికి గ్రహణం పట్టేదికూడా పౌర్ణమినాడేగా! ఇంత సేపటినుంచీ వెంటాడుతున్న రాహువు అక్కడా ఉదయించాడు. అమిత తృష్ణలోవున్న ఆ కళ్ళు నన్ను చూడడం మాత్రమేకాదు, తాగేస్తున్నాయా అనిపించేలా కనిపించాయి. ఆ భావం కలిగేటప్పటికి నాకు మనసూ, దేహమూ ముడుచుకుపోతున్నట్టనిపించింది. నా ముఖంలోవి కళ అంతా అంతర్ధాన మయిపోయింది. అతనా పర్వతంమీద ఎత్తయిన చోట నుంచుని ఏవో ఫొటోలు తీస్తున్నాడు. అది చూడగానే నా స్నేహితురాళ్ళలో ఒకావిడకి సరదా పుట్టింది. ఏ కోశాన్నా బిడియంలేకుండా వెళ్ళి అతన్ని అడిగేసింది : "మా అందర్నీ జట్టుగా ఓ ఫొటో తీసి పెడతారాండి ?"

నేను తక్షణం దాని దండమీద ఒక్క గిల్లుగిల్లి మందలించాను. "ఏమిటే ఈ వెర్రి చేష్టలు ? నీకు భయమూ, భక్తీ లేవా ఏమిటి ?"

"భయం భక్తీ సంగతెందుకే ? మనం స్టూడియోలలోకి వెళ్ళి ఫొటోలు తీయించుకోవటం లేదు ఏమిటి ? ఈ పర్వతంమీది కొచ్చిన రోజు జ్ఞాపకం వుండేందుకు ఓ ఫొటో వుంటే బాగుండదూ ?"

అతనికీ మాకు దగ్గిరలోకి రావడానికి ఏదో కారణం కావాలసే వుంది. అది అయాచితంగా లభించింది. అంచేత అతను ఒక్కక్షణం వృథా పోనివ్వకుండా మా యెదుటకి వచ్చి నుంచుని, ఒక్కొక్కత్తె వేపూ నిదానంగా చూస్తూ ఆఖరికి ఆ దృష్టి నామీద నిలిపేశాడు. నన్నే వుద్దేశించి మాట్లాడాడు :

"అటు ఎండగావున్న పక్కకి రండి. ఆ నందీశ్వరుడి విగ్రహం వున్న చోట ఎంతోబాగుంది. అక్కడే ఫొటో తీస్తే చాలా బాగా వస్తుంది."

ఆయన ఎంతో మర్యాదగా మాట్లాడాడు. వర్చస్సులోవున్న

ఆయన వైఖరికి తగినట్టే హుందాగా వున్నాయి మాటలుకూడా. అప్రయత్నంగానే అతని మాటలతీరు నాలో నాటుకుపోయింది. అయినా నా మనస్సులో అతనిమీద ఏర్పడిన వ్యతిరేకభావంతోనే నాయన మాటలని ఆలకించడం హర్షించలేదు. "అసలు అతను నన్నూరికే రోజంతా ఎందుకు వెంటాడాలి? ఉత్తరాలుగాయితనం కాకపోతే ఇంకా ఏమిటి మరి?" అని నా మనస్సు గొణిగింది. అంచేత మిగిలిన ఆడపిల్లలంతా గబగబా లేచి నిలబడినా. నేను అలాగ కూచునే వుండిపోయాను. నా స్నేహితురాళ్ళందరూ నన్ను కదిపారు; కుదిపారు; లేవతీశారు; సర్వవిధాలా తాపత్రియ పడ్డారు తమతో తీసుకెళ్ళడానికి. కాని నే నేమాత్రం లొంగలేదు. ఆఖరికి వాళ్ళకి కోపం వచ్చింది. అప్పుడు ఇంక నన్ను గురించీ. వాళ్ళ ఫొటో తీయించుకోడాన్ని గురించీ కూడా ఆశ వదులుకున్నారు.

ఈ భాగోతం అంతా ఆయన ఒక ప్రక్కగా నుంచుని చూస్తూనే వున్నాడు. తోటివాళ్ళ ఉత్సాహంమీద చన్నీళ్ళు చల్లినందుకు నాకు ఒక వేపు మనసులో బాధగా వున్నమాటా నిజమే. కాని నా మొండితనం వల్ల అతని మొఖంమీది వికాసంకూడా జర్రిన జారిపోయింది గదా అని నాకు మహా తృప్తి కలిగింది. ఫొటో తీయాలనే మిషతో అతను నన్ను అందరికీ నడిమధ్య, కొంచెం ముందుకి నిలబెట్టి వుండేవాడు.నన్నాపాదమస్తకం ఒకటికి నాలుగుసార్లు తేరిపార చూసేవాడు.ఆఖరికి నా ఛాయను తన కెమేరాలో బంధించుకుని, అది బుజంమీద వెళ్ళాడేసుకుని తిరిగేవాడు. నా స్వరూపం అతనికి సొంతమయిపోయేది. ఇంటికి వెళ్ళాక తోచినప్పుడలా కవరులోంచి నా ఫొటో పైకితీసి ఇష్టం వచ్చినంతసేపు చూస్తూ కూచునేవాడు. అంతగా కోరికపుటితే. ఆ ఫొటోని....

కాని....

ఆ రోజున పురందర్ కొండమీద అతన్ని ఊహించేశానే గాని, 15 రోజులు తిరగకుండా నేను ఏమీ మారం చెయ్యకపోగా అతని పక్కనే బాసికం కట్టుకుని పసుపుపీటమీద కూర్చోవలసి వచ్చింది. పచ్చని పెళ్ళి పందిట్లో పూలహారం స్వరూపంలో నేనే అతని కంఠాన్ని కావిలించుకోవలసి వచ్చింది. నా మెళ్ళో పూలదండ వేస్తూవేస్తూ చిరునవ్వు నవ్వుతూ, అతిరహస్యంగా "ఇప్పుడైనా ఫొటో తీయవచ్చునా" అని అడిగారు. నాకు మనస్సులో "పంతానికీ, కసితీర్చుకోడానికీ ఇంత పని చేశాడా ఏమిటి?" అని సందేహం కలిగింది. కాని అతని కళ్ళల్లో ఆ భావం ఏమీలేదు. ఆ చూపులో ఉత్త కొంటెతనమట్టుకే తొణికిసలాడుతోంది.

పెళ్ళికి వచ్చిన వారందరి ముఖాలమీదా ఒక ప్రశ్నార్థకం ముందే కనిపించింది. "అన్నాసాహెబ్ దాతే" లాంటి సంపన్న గృహస్థు, మ్యునిసిపాలిటీలో గుమాస్తా వుద్యోగం చేసుకుంటూ జీవిస్తున్న వాడితో వియ్యానికి వచ్చాడంటే వాళ్ళెవళ్ళకీ నమ్మశక్యం కాకుండా వుంది. కాని అన్నాసాహెబ్‌గారు మట్టుకు ఇది ఏరికోరి పెట్టుకున్నాడు గనుకనా? ఆయనకి గత్యంతరం లేకపోయింది. కొడుకు మొండిపట్టు పట్టుకూర్చున్నాడు....ఇతర సంబంధాలలో ఎన్నిరకాల ఆకర్షణలు చూపించినా అతను చూడనైనాలేదు. ఆఖరికి అన్నాసాహెబ్‌గారు మా తండ్రిగారిని గురించి దరియాప్తుచేసి తెలుసుకోవాలసి వచ్చింది. "మా అమ్మాయిని మీ అబ్బాయికి చేసుకుంటారా?" అని మా నాన్నగారే వెళ్ళి వారిని అడిగినట్లు నాటకం ఆడమని అర్థించవలసి వచ్చింది.

కాని మా నాన్నగారికి మాత్రం ఇదంతా ఇష్టంలేక పోయింది. ఆయనకు వరుడు ఇష్టమయ్యాడు....వారి వంశం ఇష్టమయింది. మిగిలిన అన్నీకూడా తను కలలోకూడా అపేక్షించలేనంత ఉన్నతస్థాయిలో వున్నాయి. అంచేత ఈ సంబంధం తమ తలకు మించిన భారం అవు

తుందేమో అని ఆయనకి అపరిమితమయిన భయం పట్టుకుంది. అంచేత ఊరికే పస్తాయించడమూ, వంకలు వెతకడమూ ఆరంభించారు. చివరికి మా అమ్మ నోరువిప్పి చెప్పాల్సివచ్చింది "దాని అదృష్టవశాత్తూ అమ్మాయికి ముత్యాల పల్లకీలో కూచునే యోగం పడుతూంటే మీరెందుకండీ అడ్డుపడతారు !" ఆ తర్వాత నాన్నగారు వచ్చిన మధ్యవర్తితో బయలుదేరాడు. అంతా మాట్లాడి స్థిరపరుచుకువచ్చారు. అసలు అంత వెతుక్కుంటూ వచ్చిన సంబంధం అయినప్పుడు,ఎంత మగపెళ్ళి వారయితే మాత్రం వాళ్ళ షరతులు ఏముంటాయి గనుక ! "పెళ్ళి ఖర్చులన్నీ మేం భరిస్తాం. మీకు ఏ మర్యాదలు జరపడానికి వీలయితే అవే జరపండి; లేదూ ఏమీ చేయకపోయినా ఫరవాలేదు" అన్నారుట మామగారు.చివరకి ఓ మంచిరోజు చూసి "అయం ముహూర్తం" అని భజంత్రీలు వాయించారు.

ఆ పెళ్ళప్పుడు ఆయన మహా ఉత్సాహంగా వున్నారు. ఎంచేతంటే ఆయన పట్టు నెగ్గింది. మామగారు తటస్థంగా వుండిపోయారు. "అబ్బాయి కోరిక నెరవేరిందిగదా ! మన బాధ్యత వదిలిపోయింది" అనే భావమే ఆయన ముఖంమీద కనిపించింది. అత్తగారు మాత్రం కాస్త చిర్రుబుర్రు మంటూనే కనిపించేవారు. ఎంచేతంటే ఆవిడకి ఈ సంబంధం సుతరామూ ఇష్టంలేదు. ఎక్కెక్కి ఏడుస్తూ గుర్రం ఎక్కినట్లే ఆవిడ పెళ్ళిపందిట్లో కూచుంది. తనతో సరితూగే వియ్యపురాలుండాలని ఆవిడ వాంఛ. తనంతలావుగా, తనకిమల్లే గర్వంగా, తనతో సమానమయిన శ్రీమంతురాలుగా, తనకుమల్లేనే నగలు దిగేసుకుని, తనకుమల్లేనే జరీగుడ్డలతో తళతళలాడే వియ్యపురాలుండాలని మనసులో వూహించుకుంది. తను పెళ్ళికొడుకు తల్లినిగదా అనే గర్వంతో, అటువంటావిడనైతే మాటిమాటికీ ఏదో విధంగా చిన్నచూపు చూసి ఆనందించాలనుకుంది. ఒకొక్కక్కసారి ఆవిణ్ణి కించపరచినపుడు, ఆవిడ ముఖంలో కనిపించే

ఉడుకుబోతుతనం తనకెంతో తృప్తిగా వుండేది. తనతో సాటివున్న దాన్ని వంచిన సంతోషం వుండేది. కాని మా అమ్మ పాపం! ఎప్పుడో నడుం వంగిపోయిన బీదయిల్లాలు. పైగా ఇంతటి శ్రీమంతులతో సంబంధం గదా అని తలకూడా ఎత్తకుండానే మసలుకుంటూన్నదీని. ఇప్పుడు ఆవిణ్ణి ఇంకా వంచటానికి ఆస్కారం ఏముందిగనుక. మా అత్తగారికి అసంతృప్తి అంతా ఈ పరిస్థితివల్లే.

ఇహ నా సంగతి—నాకుమాత్రం ఇంతకంటే వాంఛించగలిగిన దేముంది గనుక? అసలు ఈ పెళ్ళి జరుగుతున్న ఆర్భాటంతో నాకళ్ళు జిగేల్‌మనిపోయాయి. నాకసలు అదోరకమయిన కైపుకూడా ఎక్కినట్టనిపించింది. నే నాయన ప్రక్కన కూచున్నానేగాని, మేమిద్దరం ఆ పురందర పర్వతంమీద నుంచున్నట్టే అనిపించింది. "అయితే మీరు ఫొటో తీస్తారా? ఎక్కడనుంచోను మరి? అటువేపా?"

కాని నా అంతర్గత వుత్సాహానికి వాతపెట్టే సంఘటన ఆ సమయంలోనే ఆపెళ్ళి పందిరిలోనే సంభవించింది. సుముహూర్తం వేళకి రాలేకపోయిన కొందరు పెద్దమనుషులు, మా మామగారి స్నేహితులు, మానెత్తిన అక్షింతలు పడ్డాకవచ్చారు. మామగారు వాళ్ళతో మాట్లాడుతూ కూచున్నారు. ఇక్కడ మాకు సప్తపది నడుస్తోంది. ఇంతట్లో ఎవరో "ఇంతకీ మీ వియ్యంకుకుగారు ఎవరూ?" అన్నారు.

"అదిగో....అక్కడ మూపువంచుకుని నడుస్తున్నాడే....నల్లగా, సన్నగా, వున్నాయనే" అని చెప్పి, అదేదో సమర్థించే ప్రయత్నంగా కాబోలు మా మామగారు తమ పాండిత్యం ప్రదర్శిస్తూ "స్త్రీరత్నం దుష్కులాదపి" అని సంస్కృత శ్లోకి ఒకటి పలికారు.

ఆ వాక్యం నా చెవులలో ప్రవేశింపడమే గాకుండా నా హృదయంలో గుచ్చుకుపోయింది. ఆ సమయంలో నాకది సుభాషితంలా కన్ని

పించలేదు. చురుక్కుమని దిగిన బాణంలా తోచింది. పురోహితుడు నన్ను తిరగలిమీద కాలు పెట్టమన్నాడు. కాని నేనెంత ప్రయత్నించినా వణుకు వదలలేదు. నాలోవున్న శక్తినంతా పోగుచేసుకొని అక్కడ నుంచే ఒక్క అడుగు అరుద్దామా అనిపించింది.

"మామగారూ ! మీ నోటికి వచ్చినట్లు మాత్రం మాట్లాడకండి. నేను దుష్కులంలో పుట్టిన దాన్నేంగాదు. మా వంశమూ మీ వంశమంతటి పవిత్రమయినదీ, ఉజ్వలమయినదీ కూడాను. నా తల్లిదండ్రులు పేదవాళ్ళే కావచ్చు; చిరిగిన గుడ్డలు కట్టినవాళ్ళు కావచ్చు. కాని వారి చరిత్రలో ఎన్నడూ కళంకం కలగలేదు. నేను ముమ్మాటికీసత్కులంలో పుట్టినదాన్నే !"

నిజానికి ఈ విషయాలన్నీ వీరికీ తోచేవుండాల్సింది. అంచేత ఆయన ముఖంవేపు ఒక్కసారి చూశాను. కాని నాకు గుచ్చుకొన్న బాణం యొక్క గాలికూడా ఆయనకు సోకినట్టు కనిపించలేదు. ఆయన చిరునవ్వుతో ప్రసన్నంగా వున్నారు. నా కళ్ళల్లో నీళ్ళు తిరగడం చూసి "ఏం కళ్ళల్లోకి పొగవచ్చిందా ?" అన్నారు.

మామగారి పద్ధతిదీ, మా అత్తగారి పద్ధతదీని. ఆ రోజున ఆవిడకి చేసిన మర్యాదలలో ఏ ఒక్కటీకూడా మనస్ఫూర్తిగా స్వీకరించలేదు. ఎంతలేదన్నా కనీసం రెండువందల రూపాయలయినా వుండే రొఖ్ఖం ఆవిడ చేతపెట్టారు మా నాన్నగారు. కాని ఆవిడకి అది మూలపారేసిన చెత్తకంటే హీనంగా కనిపించింది. సాయంకాలం ఊరేగింపు ప్రారంభమయ్యే ముందర చీర, రవికలగుడ్డా ఆవిడ కందించింది మాఅమ్మ.ఆవిడ తీసుకుంది....చచ్చిపోయిన చేతులతో తీసుకుంది. ఆవిడ స్నేహితురాళ్ళల్లో ఎవరో ఒకావిడ "ఈవిడ యెందుచేతో చాలా నీరసంగా వున్నట్టుందేంఇవ్వాళ" అని వ్యాఖ్యానం కూడా చేసింది ఊరుకోకుండా.

దానికి మా అత్తగారు సమాధానమూ పలికింది: "ఏముందమ్మా! ఎడంచేత్తో ఇచ్చి, కుడిచేత్తో పుచ్చుకోవడమేగా! మర్యాద, గౌరవమేముంది? లాంఛనాల ముచ్చటేముంది? గూట్లోవున్న దీపం వెలిగించి, దానిచుట్టూ ముఖం తిప్పుకొని, హారతిచ్చారనుకోవడంలా వుంది ఈ వ్యవహారం అంతా"

ఆవిడ అన్నమాటా నిజమే కూడాను. ఆవిడకి ఈ వివాహంలో వుత్సాహం ఏమీలేదు. కడుపున పుట్టిన కొడుకు పెళ్ళిగదా అని విధిలేక వచ్చి కూచుంది. నిరుత్సాహంగా కొయ్యబొమ్మలాగా కూచుంది. ఆవిడ మాటల్లో చెప్పాల్సివస్తే నేనొక "గుమాస్తా కూతుర్ని" తన వంటవాడి పెళ్ళాంగానో, తన గుమాస్తా భార్యగానో తనింట్లో నే నడుగుపెడితే ఆవిడకంత అభ్యంతరం వుండేదిగాదు. నాకు తగిన స్థానంలోనే వచ్చినట్టు పరిగణించి వుండేది. ఎంచేతంటే, ఆవిడ నాకు కట్టిన విలువ అంతే. కాని ఇప్పుడు నేను ఆవిడ కొడుక్కి అర్ధాంగినయ్యాను. తన కన్నకొడుక్కి కట్టుకున్న పెళ్ళాన్ని అయాను. నేను ఇంట్లో అడుగుపెట్టి పెట్టగానే, ఆ ఇంట్లోవుండే సర్వమయిన స్థిరచరాస్తులకే సగం యజమానిని అయ్యాను - తనతో సమానంగా. అసలు ఈ ఆలోచనే ఆవిడకి అసహ్యంగా తోచింది. కాని అది ఇప్పుడు ఆచరణలోకి వస్తూండడం ప్రత్యక్షంగా చూస్తూ, అనుభవిస్తూ సహించవలసి వచ్చింది. ఇదంతా తన కొడుకు మొండిపట్టు పట్టినందువల్ల తను ఈ అనుచితం భరించవలసి వస్తోంది. అంచేత నే నావిడ నీడలోకి వచ్చినా అపాత్రురాలిగానే కనిపించాను.

నా చుట్టూ ఏర్పడిన ఈ గొడవలవల్ల, సూర్యుడు నా దగ్గిరలోనే వున్నా, నా ముఖ కమలం వికసించలేదు. ఊరేగింపులో నా ముందూ వెనకా అపరిమిత మయిన వెలుగు ఆక్రమించుకున్నా, నా మనస్సులో మాత్రం అంధకారమే ఆవరించుకొని పోయింది తల్లీ,

తండ్రి. తోబుట్టినవాళ్ళూ ఎన్నడూ ఎక్కలేని ఏదో శిఖరంమీదికి నన్నె వరో ఎక్కించేసినట్లనిపించి. ఆ అత్తగారంటేనే ఒక భయం పట్టు కుంది. యికముందు ప్రతిరోజూ నన్ను రాపాడిస్తూ వుంటుందనటంలో సందేహం లేదు. ఆ కుటుంబంలో ఆవిడే నా కమితమయిన భారమయి పోతుంది. ఆవిడ నా మేడమీది కాడిమీద ఎంత బరువుపెట్టినా మోస్తాను కాని, ఆవిడ నన్ను నీచంగా చూడకుండావుంటే చాలు. నా తలిదండ్రుల పేదరికం సంగతి ఎత్తకుండా వుంటే చాలు. ఈ విషయాలే అను కుంటూ, ఆలోచించుకుంటూ కూచున్నాను నే నా ఊరేగింపులో.

కాని ఆ సందడిలో, ఆ అలంకరించిన మోటారులో నాకు కొంచెం దగ్గిరగా జరిగారాయన. అంచేత విధిలేక ఆయనవేపు చూడవలసి వచ్చింది నేను.

"బాండుమేళం వాళ్ళు ఏం పాట వాయిస్తున్నారో చూశావా? 'నా ప్రియుని కుటీరమే' అని వాయిస్తున్నారు. కాని యిప్పుడు నా ప్రియురాలు కుటీరంలోంచి గొప్ప భవంతిలోకి వెళుతోందని చెప్పాలి వాళ్ళతో. యిహముందు కుటీరం గొడవే అక్కర్లేదు ఆవిడకి."

ఆయన ఏదో మామూలుగానే మాట్లాడుకుపోయారు. కాని నాకు మాత్రం ప్రతిమాటకి అనేక రకాల అర్థాలు స్ఫురించాయి. ఆయన నా మనసులోఉన్న విషాదానికి విరుగుడు వేశారా అనిపించింది ఒక్క క్షణం. "ఈయన ఈతరంవారు. ఆధునిక సంస్కారం కలవారు. అయినా ఈయన ప్రవృత్తికూడా, అత్తగారు మామగారికి మల్లేనే వుం టుందా ఏమిటి ఒక వేళ? ఈయనక్కూడా పూరిల్లు అంటే హీనభావం, బంగళా అంటే గౌరవం వుంటాయా ఏమిటి?....

గృహప్రవేశం తతంగం ముగిసి సందడి కొంచెం తగ్గింది తర్వాత సైగచేసి నన్ను మేడమీదికి తీసుకు వెళ్ళారు. నన్ను వెంట బెట్టుకుని ఒకగదిలో ప్రవేశించారు.

"ఇదీ రాణీగారి అంతఃపురం. ఈ గది ఆవిడకి సొంతం. నచ్చిందా?—ఈ గదిలోకి రావాలంటే మేంకూడా తలుపుమీద టకీ టకీ మని కొట్టి 'మే ఐ కమిన్?' అని అడగాలి. ఆ తర్వాత రాణీగారికి అనుమతి యివ్వడం యిష్టమయితే, తలుపు తెరిచి 'యస్,కమిన్' అంటారు"

అప్రయత్నంగానే నాకు నవ్వు వచ్చింది. "అలాగే అనటం ఎందుకు – 'ఇత ఇతో దేవః' అనికూడా అంటానేమో మరి?" అన్నాను. ఆ గది నిజంగానే ఎంతో అందంగా వుంది. నేను లోపలికి అడుగు వేసీ వేయగానే 'రావమ్మా చెలీ - నీ సేవకి నేను సదా సర్వకాలమూ సిద్ధంగానే వుంటాను' అంటూ పడమటిగాలి నన్ను స్వాగత తరంగాలతో ఆహ్వానించింది. అక్కడొక చక్కటి మంచం వుంది. దానిమీద ఎంతో మెత్తటి పరుపూ, స్వచ్ఛంగా తెల్లగా వున్న దోమతెరా వున్నాయి. కిటికీలకి తెరలున్నాయి. పెద్ద అద్దం బిగించిన బీరువాఉంది. కుర్చీ, బల్లా, ఇంకా ఏమేవిటో అందమయిన అవసరమయిన సామాను యావత్తూ వుంది. ఆయన వాడుకుంటున్న గది నాకిచ్చేశారు.

"ఇక అత్తగారూ, మామగారు నన్ను ఎట్లా చూసినా ఫరవాలేదు. ఈయనది మాత్రం వాళ్ళ గుణం లాటిది కాదు. ఈ లత పెనవేసుకుని పైకిపాకి వృద్ధిలోకి రావడానికి మూలాధారమయిన గుంజ దృఢమయినదే. ఈయన నన్నెప్పుడూ వెటకారం చెయ్యరు. 'స్త్రీ రత్నం దుష్కులాదపి' అనే మాట ఈయన నోటివెంట ఎన్నటికీ రాదు" నా కాయనతో ఏర్పడినది కొద్దిపాటి పరిచయమే అయినా, నాకు ఈ నమ్మకం కలిగింది. అంచేత నాలో అక్కడక్కడ మిగిలివున్న భయమూ, అనుమానమూ అంతరించి పోయాయి. యిక అప్పుడు ఆ గది అంతటా, నా రూపంలో పౌర్ణమి వెన్నెలే ప్రవేశించి వ్యాపించింది. అంతలో ఆయనకి నాతో సరసమాడే బుద్ధి పుట్టింది.

"ఉదయంనుంచీ అనేకమంది నీకు కానుకలిచ్చారు. కాని ఈ

యింటికానుక యింకా నీకు ముట్టనేలేదు. ఇహ అది ఇప్పుడు నేనే ఇవ్వాలి!"

"ఈ 'ఇంటి కానుక' అన్న మాటకి ఇంకో అర్థంకూడా ఉన్నదని గమనించే అన్నారా?"

"వున్నదన్న అర్థం తీసుకున్నా, వ్యుత్పత్తి అర్థం తీసుకున్నా-నాకు సమ్మతమే" అంటూ, ఆయన బీరువా తెరిచి, ఉల్లిపొర కాగితంలో కట్టివున్న ఒక అట్ట తీసుకొచ్చి యిచ్చారు. విప్పేటప్పటికి, అది నా ఫొటో! బాగా పెద్దదిగా చేయించి సెపియా రంగు వేయించిన ఫొటో పురందర కోటలో రాజ్‌గద్దీ దగ్గిరనే చూపించిన పరాక్రమాన్ని చూపిస్తున్న ఫొటో అది.

"ఆ రోజున నాచేత ఫొటో తీయించు కోడానికి ఒప్పుకోనే లేదు కదూ నువ్వు? ఊఁ! పట్టుదల పుట్టుకొచ్చింది కదూ నీకు? కాని నేను నిన్ను వెంటాడ్డం విడిచిపెట్టలేదు. మీ ఆడపిల్లలందరూ జట్టుగా ఆ రాజ్‌గద్దీ వున్న శిబిరం క్రిందికి చేరారు. పైకెక్కడానికి సులువుగా వుండే దారి ఆ రెండోవేపు వుంది. నువ్వు నుంచున్న వేపు చాలా నిటాగ్గాఉంది కొండ. అటువేపునుంచి ఎక్కడం చాలా దుస్సాధ్యం. "ఈ వేపునుంచి ఎవరు యెక్కగలరు బాబూ" అంది మీ స్నేహితుల్లో ఒకమ్మాయి. పుష్పో ఎవరో. 'ఎందు కెక్కలేం నే నెక్కగలన'న్నావు నువ్వు. 'ఎక్కావులే మహా, నోటితో అనగానే సరా ఏమిటి' అంది. 'అట్లాగేం? ఎక్కి చూపిస్తాను చూడు' అన్నావు. పవిట బిగించి నడుం కట్టావు. ఆ కొండ పక్కని కొంచెం కొంచెం పైకి ఉబికివున్న బండలు చేతోపట్టుకొంటూ, వాటిమీదే పాదాలు మోపుతూ, బల్లిలాగా కొండకి అతుక్కుపోయి, ఆ నల్లటి బండలమీద ఎగబాకి ఎక్కిపోయావు. నీ స్నేహితురాళ్ళందరూ గాభరా పడ్డారు. 'మంగళీ! వద్దులే క్రిందికి

దిగిరా' అని గోరింకల్లాగ గోలచేశారు. నేనూ మనసులో కంగారు వడ్డాను సుమా. 'జారిపడిందంటే జన్మంతా కుంటిదయి కూచుంటుందీ పిల్ల' అనుకున్నాను. కాని నువ్వు ఆఖరికి సాధించావు — కొండ శిఖరం మీదకు పాదం మోపీ మోపగానే ఎడంచేత్తో యింకా బండ పట్టుకునే వున్నా ముఖం వాళ్ళందరివేపు తిప్పి, కుడిచేయి పైకెత్తి 'ఏమే — ఎక్కానాలేదా చూడండి' అని విజయ దుందుభి మోగించావు - సరిగ్గా ఆ క్షణంలో తీశాను ఫొటో. ఆ క్షణంలోనే ఒక నిర్ధారణకూడా చేసుకున్నాను. "పెళ్ళి చేసుకుంటే ఈ ఆధునిక ఝాన్సీనే చేసుకోవాలి గాని, మిగిలిన బూచి బొమ్మలు మనకేం అక్కరలేదు." నా ముఖంలో తాండవిస్తూన్న ఆ విజయోత్సాహమూ, నా నుదుటిమీద వాలిన రేగినజుట్టు వంకీలూ, నా చెంపలమీది చెమట బిందువులూ వగైరా సర్వమయిన నా వివరాలూ ఆ ఫొటోలో కనిపిస్తున్నాయి.

ఇవాళ పుట్టింటికి వచ్చేటప్పుడు అమ్మకి చూపించాలని ఆ ఫొటో నాతో పట్టుకొచ్చాను కూడాను. ఈరాత్రి అంతా మా అమ్మా, నేనూ మాట్లాడుకుంటూ గడపవచ్చు. రేపు మధ్యాహ్నం ఆయన మా ఇంటికి భోజనానికి వస్తారు. ఆవారపత్రికారం నాన్నగారు వెళ్ళి పిల్చికూడా వచ్చారు. నేను బలవంతంచేసి ఒప్పించాను. ఆ పెళ్ళి కాస్తా ఏదో హడావిడిగా జరిగిపోయింది. ఆ మాత్రంచేత మా అమ్మకి ఏమీ తృప్తి కలగలేదు. ఒక్కపూటయినా అల్లుడువచ్చి చేయి కడిగితేనేగాని ఆవిడకి సంతోషంలేదు. అంచేత ఈపూట ఆవిడకి వంటలో సహాయం చేయడం కోసం నేను పొద్దున్నే వచ్చేశాను.

నేను రావడంఅంటే, గూట్లోంచి ఎగిరిపోయిన పిచికపిల్ల మళ్ళీ వచ్చేసినట్లే వుంది తల్లి ప్రాణానికి. "శ్రీఖండ్" చెయ్యడమా, "బాసంది" చెయ్యడమా అనీ, "పులిహోర" చేద్దామా, "వాంగీబాత్"

చేద్దామా అనీ, పచ్చడినిగురించీ, పప్పుకూరనిగురించీ తర్జన భర్జనలు చేసుకొన్నాం.

తెల్లారి లేవగానే నేను అమ్మకి సహాయం చెయ్యడం మొదలు పెట్టాను. బంగాళా దుంపలు వుడకవేద్దామని కూరలబుట్ట తీసుకొచ్చాను. "చిన్నా పెద్దా కలిపివేసి గుండ్రంగా ఒక్కసైజులో వున్నవి చూసి వుడకబెట్టు" అంది అమ్మ.

"ఆఁ ఎందుకే అమ్మా? ఉడికిన తరవాత వలిసేసి ఉప్మాలా చేసేదానికి ఏరటం ఎందుకే?" అన్నాను నేను. మా అమ్మ వూరికే ఓ నవ్వునవ్వి ఊరుకుంది - నా ప్రశ్నకి ఏ సమాధానము చెబుతుంది గనుక. లేతకంకిలో విత్తనాలుండనట్లే, చిన్నపిల్లల మాటలకి అర్థం వుండదని ఆవిడ అభిప్రాయం.

తులసిచెట్టు మొదట్లో నీళ్ళుపోసినట్లే అయింది ఆవిడ నాకు చేసిన ఉపదేశం. ఆరోజు నేను నాలుగు చేతులతో పనిచేశాను. ఒకప్రక్క వంటింట్లో పనిచూస్తూనే క్షణం వ్యవధి దొరికితే వీధి గదంతా శుభ్రపరచి అలంకరించేశాను.

ఇవాళ నా ఉత్సాహానికి మేరలేదు. నా ముఖంమీద సముద్ర తరంగాలమీద నురుగులాగా ఉల్లాసం ఉప్పొంగిపోయింది. ఇవాళ ఆయన వస్తున్నారు. అత్తవారింట్లో ఆయన్ని దర్శనం చేసుకోవడానికి, పుట్టింట ఆయన్ని దర్శించడానికీ ఎంతో తేడావుంటుంది. భక్తుడి ఇంటికి భగవంతుడు వచ్చినప్పుడు వుండే మాధుర్యమే వేరు....

పదకొండు గంటలు కొట్టీకొట్టటమే నేను పీటలూ, కంచాలూ సిద్ధంచేసి ముగ్గువేయడం మొదలుపెట్టాను. ఒకగీత వెయ్యడం, అది తిన్నగా సూటిగా వుందో లేదో అని, తల ఈ ప్రక్కకివంచి ఓసారీ, ఆ ప్రక్కకి వంచి ఓసారీ చూడడం, ఏమాత్రం వంకరున్నట్టు తోచినా

చెరిపేసి మళ్ళీ వేస్తూండడమూ-ఇలావుంది నాపని. మాది పేదయిల్లన్న మాట నిజమే. అయినా ఇక్కడకూడా శుచీ, శుభ్రమూ, శృంగారమూ వున్నాయని ఆయనకి ఋజువుచెయ్యాలని నా సంకల్పం. నా హృదయం లోని కోమల భావాలు ఆ ముగ్గులో ఆకులూ, పువ్వులూ అయి వ్యాపిస్తు న్నాయనుకుంటున్నాను. ఈ తెల్లటి ముగ్గుమధ్య అక్కడక్కడ ఎర్రటి బుక్కాపొడితో బొట్లుపెడితే, అందంగా భక్తి లతమీద అనురాగపు పుష్పాలున్నట్టుంటుందని ఊహించుకొంటున్నాను

11-30 ఆ ప్రాంతం, మా యింటిముందు మోటారు హారను మోగింది. ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు మోగింది. పిల్లలంతా పరుగెత్తుకు వెళ్ళారు. పరుగెత్తుకుంటూనే మళ్ళీ వచ్చారు.ఆయన వచ్చిన వర్తమానం తెచ్చారు. నేనూ ఉరుక్కుంటూ ముందు వెళ్ళాను.

"ఇదేమిటీ ? కారు దిగరాఏమిటి ?"

"ఒక్క నిమిషం ఆగు. ముందర నిన్ను పరిచయం చెయ్యనీ. ఇతడు నా స్నేహితుడు మిస్టర్ ప్రఫుల్లకుమార్. బొంబాయిలో వుంటు న్నాడు. మన పెళ్ళపుడు ఒక టెలిగ్రాం పంపించి వూరుకొని, ఇహ ఇప్పుడొచ్చాడు బండివెనక గుర్రం వచ్చినట్టు. ఈవిడే నా అర్ధాంగి"

ఆ సుందరిటి, సున్నటి బుగ్గలున్న తెల్లటి, లావుపాటి యువకుడికి ఒక్క నమస్కారంచేసి, ఈయనతో మాట్లాడను : "మీరు ఆయన్ని వెంట తీసుకురావడం మంచిదే అయింది. పంక్తి భోజనంలో కొంత అందం వుంటుంది"

"ఆయన్ని నే తీసుకురాలేదు. నన్నే ఆయన తీసుకువచ్చాడు. అతనివ్వాళ మనకి విందు చేస్తాట్ట. కాన్‌టన్‌మెంట్‌లోవున్న పెద్ద హోటలు "మ్యురేటోర్" లేదు అందులో – నువ్వుకూడా ఇప్పుడు మాతో రావాలి. తొందరగా సింగారించుకురా మరి."

"అంటే ?"—

"అంటే గింటే ఏమీలేదు. వెళ్ళి తొందరగా ఐదునిమిషాల్లో రావాలి, ఏం ?"

నేను నిర్ఘాంతపోయాను. కొయ్యబొమ్మ నయిపోయాను. నా రెండు చేతులూ ఆ టాక్సీమీదనే బిగుసుకుపోయాయి. ఈ విందు వ్యవహారం ఇల్లా ఎందుకు అయిపోయిందో నాకర్థంకాలేదు. మొదట్లో ఒప్పుకున్న ఏర్పాటుని రద్దుచేసి, మా ఉత్సాహాన్ని ఊద్చిపారేసినందుకు నాకు బాధ వేసింది. అంచేత అమ్మమ్మలు మాట్లాడే స్వరంతో "మరి మా నాన్నా, అమ్మా ఏమనుకుంటారు ?" అన్నాను.

"వాళ్ళేమనుకుంటే ఏం పోనిద్దూ, నువ్వారికే అవన్నీ ఆలోచించకు. మా కాలస్యం అవుతుంది అసలే"—

ఈ మాటలు వీపుమీద చరిచినట్టు నన్ను ఇంట్లోకి పంపించాయి. అమ్మ బంగాళాదుంప కూరలోకి తాళింపు తయారుచేస్తోంది. ఆవిడ ఎంతో ఆదుర్దాగావున్న, స్వరంతో "వచ్చారా ఏమిటే ?" అని అడిగింది.

"వచ్చారూ, రారూ రెండూకూడాను."

"నువ్వివ్వాళసలు మరీ విచిత్రంగా వున్నావులే."

"అమ్మా ! నువ్వు శ్రీమంతురాలుగా ఎందుకు పుట్టలేదే !"

"ఏఁవిటే పిచ్చిప్రశ్నలు ? శ్రీమంతులవటం దైవాధీనంకాని మన చేతుల్లో వుందా ఏమిటి ? మనకున్న పిచికగూడునైనా శుభ్రంగా అందంగా వుంచుకోవటమూ, వున్నదానిలోనే శ్రద్ధగా రుచిగా వార్చి వడ్డించడమూ మట్టుకే మనుషుల చేతుల్లో వుంటుంది"

"కాని, అది అందరికీ రుచించదే అమ్మా !"

నేను చీర మార్చుకుంటూనే ఆవిడకి సంగతంతా చెప్పాను. కాని

ఆవిడకి నా సమాధానంతో ఊరటకలగలేదు. "ఒసేవ్, నువెళ్ళి ఊరికే రెండు మెతుకులు కొరికి వెళ్ళమనవే....అన్నీ సిద్ధంగానే వున్నాయని చెప్పు" అని బతిమాలింది నన్ను.

"అది జరిగేపని కాదే అమ్మా! ఆయనకి ఆపేక్షతో వడ్డించిన భోజనం అక్కర్లేదే. ఆయనకు కావలసినదంతా ఖరీదయిన తిండి. అది మెయ్యడానికి బయలుదేరారు.... నేనూ వెడుతున్నాను ఆయనతోటే."

మిరపకాయలు తుంపుతున్న చేతులు అలాగే స్తంభించిపోయాయి. ఆవిడ నా హడావిడికేసి వెర్రిచూపు చూస్తూ అలాగే కూచుండిపోయింది. నా కావిడని చూస్తే జాలివేసింది. కాని నాకేం అధికారం వుంది? పౌడరు రాసుకొని,బొట్టు పెట్టుకోవడానికి బొట్టుపెట్టి తెరిచి, అద్దంలో నా ముఖం చూసుకుని నేనే ఆశ్చర్యపోయాను. ఆ ముఖంలో ఏ విధమయిన ప్రసన్నతా లేదు. కళ్ళల్లోనూ వెలుగులేదు. కనుబొమ్మల్లో ఒక ముడిపడింది. ఒక ఆలోచన చటుక్కున మెరుపులా తలలో ప్రయాణం చేసింది. ఈయన నన్ను ఆధునిక ఝాన్సీబాయి అన్నారుగదూ. చూపించనాఏమిటి ఆ అవతారం ఒక్కసారి? చర చరా వెళ్ళి రెండుముక్కలు చెప్పెయ్యనా ఏమిటి? పేదవాళ్ళే అవచ్చు-దరిద్రులే అవచ్చు—కాని వీళ్ళు నా కన్నా పెద్దవాళ్ళు—మీరు వాళ్ళని అవమానం చేయడం నేను సహించను. అంచేత ముందు కారు దిగండి. ఎంగిలిపడండి ఆ తర్వాత నన్ను కూడా వెంటబెట్టుకుని ఊరంతా తిరగండి. నే యింతచెప్పినా మీరు వినకపోతే. మీ ఇష్టంవచ్చిన చోటికి మీరు వెళ్ళండి. నేను మాత్రం రాను."

కాని ఈ ఉద్రేకపు ఉపన్యాసమంతా నా మనసులోనే అనుకున్నాను. కాని బయటికి పలకలేకపోయాను. నా ఊహాలోకంలో ఆ పెద్ద బంగళా, నా కోసం అలంకరించిన గదీ, ఆ వైభవాలు, ఆ

దర్పం, ఆ సౌకర్యాలూ - అన్నీ ఒక్కసారి జిగేలుమని సాక్షాత్కరించాయి. నాకు వాటన్నిటిమీదా వ్యామోహం లేదూ?—స్వార్థం వున్న మనిషి ఎపుడయినా మనసులో వున్నదంతా పైకి చెప్పడం సాధ్యమవుతుంది గనుకనా? అతను శ్రీమంతుడు గనుక, బీదవాళ్ళ పిల్లనైనా పెళ్ళి చేసుకోవడం సాధించగలడు. అలాగే అతని మనసుకి నచ్చిన ఏ పనైనా సరే చేయగలడు శ్రీమంతుడు గనుక. అంచేత....

"నేను నోరుమూసుని వెళ్ళి కారులో కూచున్నాను. మా టాక్సీ—తిన్నగా హోటలుముందర ఆగింది. మేం అంతా లోపలికి వెళ్ళాం. హోటలు నౌకర్ల సలాములు అందుకుంటూ వెళ్ళి ఒక టేబిలు దగ్గిర కూచున్నాం—ఆ రోజు చేసిన భోజన పదార్థాల పేర్లు అచ్చువేసిన కార్డు తీసుకొచ్చి మాముందు పెట్టాడు నౌకరు. ఆ తర్వాత కావలసిన పదార్థాలు ఆర్డరివ్వడం జరిగింది. ఇంకొంచెం సేపటికి పదార్థాలన్నీ తెల్లటి పోర్సలైన్ ప్లేటుల్లో వడ్డించి మా ముందు అమర్చడం జరిగింది. కత్తులూ, ఫోర్కులూ, స్పూనులూ పేర్చడం ముగిసింది. వాటిని తక్షణం చేతపట్టారు వాళ్ళు- నా కవి వుపయోగించటం అలవాటులేదు. అంచేత నేను స్తబ్దుగా కూచున్నాను.పైగా ఆ తిండీ, ఆ వడ్డింపు ఎంత శుభ్రంగా వున్నట్టు కనిపించినా, వాటిమీద ఎంచేతో నాకు మనసుపోలేదు. అదీ ప్రేమతో పెట్టిన అన్నం కాదు అనిపించింది.ఆయన నే నూరికే కూచుని వుండిపోవటం గమనించారు. అప్పుడు నాకు కత్తి, ఫోర్కు పట్టుకోడం ఎలాగో నేర్పడం మొదలెట్టారు. గోరుముద్దలు పెట్టి, చిన్నపిల్లకి తల్లి అన్నం తినడంమప్పినట్లు.నాకు ఆ పేట్లలోంచి కత్తి,కటార్లతో వ్యవహరించడం ఎలాగో నేర్పుతున్నారు — నా చేతిలోవున్న ఫోర్కుతో, కట్‌లెట్‌లోకి పొడిపించారు. అది సాక్షాత్తు నా హృదయంలో దిగినట్లే అనిపించింది నాకు. ఆ కట్‌లెట్ ఏ పదార్థంతో చేశారో దేవుడికే తెలియాలి. నేను నోట్లో పెట్టుకునేటప్పటికి కడుపులో వికారం పెట్టింది.

ఆ భోజనం చేస్తున్న సమయంలో, మా పెళ్ళి వివరాలన్నీ తన స్నేహితుడికి వర్ణించి చెప్పుకొచ్చారు. "ఇహ ఇప్పుడు నాకేం భయం లేదు. ఏమంటావు? నేనీ కామర్సు పరీక్ష ఎలాగో అట్లాగా పాసయానంటే మా మామగారు మ్యునిసిపాలిటీలో ఏదయినా ఉద్యోగం తప్పకుండా వేయించి పెడతారు. కాదూ?" అని కాస్త చమత్కారంగా కూడా చూశారు. ఆ చమత్కార సంభాషణను మెచ్చుకుంటూ, ఆయనతోపాటు నేనుకూడా కాస్త నవ్వాలని ఆయనగారి అభిప్రాయం కాబోలు! కాని అది నావల్లకాలేదు. "అంటే, క్లుప్తంగా చెప్పాలిసివస్తే నేను పురందర కోటమీదకి వేటకు వెళ్ళినప్పుడు ప్రాప్తించిన లాభమే ఈవిడగారు!" నన్నుగురించి ఇలాటి వర్ణన చేసినప్పుడు కూడా అంతా వింటూ నేనలా దీపస్తంభంలాగే వుండిపోయాను. ఆ క్షణంలో, నా కర్థమయిపోయింది—"ఈయనకూడా తన తలిదండ్రులవంటి వారేనని". 'నాభార్య' అని చెప్పుకుంటూ వెంటవేసుకుని తిరుగుతున్నా, ఆయనగారు ఇది ఒక పేదవాళ్ళ పిల్ల అనే విషయాన్ని మరిచిపోవటమే లేదు-మరిచిపోలేకుండా వున్నారు.

ఆయన ఇలాటి సంభాషణ సాగిస్తూ, ఆ హోటలు పదార్థాలు తింటూ పొట్టనింపుకోవడం చూస్తూ వుండిపోయాను నేను. ఆయన మట్టుకు ఆ తిండియొక్క రుచిని అనుభవిస్తూ - ఆ కత్తి, కటారులను నాజూకుగా తిప్పుకుంటూ ఆనందిస్తున్నారు. ఈయనకోసమా, మా అమ్మ ఇవాళ వేకువజామునుంచీ రెక్కలు ముక్కలు చేసుకుని అతి అపురూపపు పలహారాలూ, పిండివంటలు తయారు చేసింది? మా అమ్మ ఇవ్వాళ కుంకుమపువ్వు వేసిన బాసందీ చేసింది. ప్రతి వస్తువు బహు జాగ్రత్తగా వండింది. ఒక్కొక్కటే ఆయనను బలవంతపెట్టి మారు వడ్డించాలనుకుంది. ఈయన కడుపునిండా తింటే, చూసి తృప్తిపడాలను

కుంది. ఆయన తృప్తిగాతింటే తనకే కడుపునిండినట్టు ఆనందపడి వుండేది.

ఈ ఆలోచనతో నాకు ఇంటిదగ్గిర ఏం జరుగుతుంటుందో సిని మాలా కనిపించటం మొదలుపెట్టింది. 12 గంటలు కొడుతూండగానే నాన్నగారు ఆదరా బాదరా ఇంటికి చేరుకుని వుంటారు. జరిగినదంతావిని, ఆయన మనసులో చాలా క్రుంగిపోయి వుంటారు. నా అన్నదమ్ములు ఒక మూలచేరి గుస గుస లాడుతూ వుంటారు. అమ్మ మాటి మాటికీ పమిటచెంగుతో కళ్ళు ఒత్తుకుంటూ వుంటుంది. ఆవిడ ఆ షడ్రసోపేత మయిన పదార్థాలవేపు జాలిగా చూస్తూవుంటుంది. ఆవిడ అసలు ఎంగిలి పడి వుంటుందో లేదోకూడా దేవునికే తెలియాలి. కాని ఎలా ఎంగిలి పడుతుంది? తన అల్లుడు గుమ్మంవరకూ వచ్చాడు. కాని గడపదాటి లోనికి రాలేదు. తన కూతురుకూడా అతనివెంట వెళ్ళిపోయింది. తను ఎవరికోసం యింత శ్రమపడ్డదో, వాళ్ళు తన మనసు విరిచేసి తన అను రాగాన్ని లెక్క-చెయ్యకుండా వెళ్ళిపోయారు. ఈ క్షణంలోకూడా ఆయన వాలకం చూడండి ఎంత ఆనంద భరితంగావుందో! తను ఏవో తప్పుచేసి నట్టుగానీ, ఎవరినో కాలిక్రింద చీమలాగ తొక్కి-పారేసినట్టుగానీ, ఆయ నకి స్ఫురించటంలేదు. అణుమాత్రం కూడ, ఆ ఆలోచనా, విచారమూ, పశ్చాత్తాపము—ఆయన ముఖంలో కనిపించటమే లేదు!

భోజనాలయాక నన్ను - ఏవేవో పెద్ద పెద్ద షాపుల్లోకి తీసు కెళ్ళారు. నా కోసం అనేక రకాల బట్టలు;యితర వస్తువులూ ఎన్నెన్నో కొన్నారు. "యిది నీకు నచ్చిందా?" అని ఏదో చూపించి అడుగుతూ వచ్చారు. నేను చూసీ చూడకుండానే 'ఊఁ' అనేదాన్ని - ఆయన తనకు వేటలో దొరికిన మృగాన్ని అలంకరించటం కోసం ప్రయత్నిస్తు న్నారు. నా ముఖమూ, నా మనస్సూ, ఆయనకొన్న ఫేసు పౌడర్ల లోనూ, స్నోలలోనూ, మరుగుపర్చాలని చూస్తున్నారు. నన్ను అన్ని

విధాలా కేవలం ఒక అలంకరణ క్రిందే మార్చివేయాలని ప్రయత్ని స్తున్నారు.

తిరిగి తిరిగి చివరకి మళ్ళా మా ఇంటిముందుకు వచ్చి ఆగింది కారు. అప్పటికి సుమారు 4 గంటలయి వుంటుంది. నా కయితే ముల్లో కాలూ తిరిగి మనసు ఎక్కడో పారేసుకుని వచ్చినట్టనిపించింది. అయినా మోటారు లోంచి దిగుతూ దిగుతూ, ఇంకా వెర్రిఆశ పెట్టుకుని ఒక ప్రశ్న వేశాను. "ఒక్క అయిదునిమిషాలసేపు లోపలికి వస్తారా? కాస్త టీ అయినా తీసుకుందురుగాని."

"ఇప్పుడు తీరికలేదు. మన ప్రపుల్లకుమార్‌ని ఇంకో చోటికి తీసుకువెళ్ళాలి. సారీ. ఆ(. ఎక్స్ట్రీమ్‌లీ సారీ. ఏమనుకోకేం! ఎక్స్‌క్యూజ్ మి!"

"ఈ మాత్రానికి ఎక్స్క్యూజ్ చేయడాని కే ముందిలెండి?" అన్నాను పుల్లవిరుపుగా.

"నువ్వు తిరిగి వచ్చేట్టయితే పోనీ ఓ ఐదు నిమిషాలు ఆగుతా."

"నే తర్వాత వస్తాలెండి"

"అచ్ఛా. బండివేసుకు వచ్చెయ్.నేను ఎదురుచూస్తూ...."

కాని అంతట్లోనే మోటారు ఇంజను ఆడింది. ఆ వెళ్ళిపోతున్న కారువేపు చూస్తుంటే అప్రయత్నంగానే ఆయన పలికిన మాటలు నా నోట మళ్ళీ వుచ్చరించాను. "సారీ, ఎక్స్ట్రీమ్‌లీ సారీ...." కేవలం మాటలు! ఉత్తుత్తి నాలిక చివరిమాటలు. అవి హృదయంలోంచి వచ్చిన వెన్నటికీ కావు. అలవాటు కొద్దీ పలికే వ్యర్థ శబ్దాలు. పైకి సంస్కారంవున్నట్టు కనిపించే నటనలు. లక్కతో నేర్పుగా చేసి, చక్కగా రంగువేసిన మామిడి పళ్ళలాటి మాటలు - వాటిలో వాసనాలేదు,రసమూ లేదు. 'థాంక్యూ' అనగానే ఋణం తీరిపోయిందన్నమాట. 'సారీ' అన

గానే పశ్చాత్తాప పడ్డట్టన్నమాట! 'ఎక్స్క్యూజ్‌మీ' అనగలిగితే ఎంతటి తప్పయినా చెరిపేసుకున్నట్టే అన్నమాట. పదిమందిలోనూ ఎంతో, భార్యదగ్గిరా అంతే! కేవలం బూటకపు ప్రవర్తన!

నేను ఇంటో అడుగు పెట్టేటప్పటికి, మా అమ్మ బయటికి వస్తోంది. పమిటకొంగు క్రింద రెండు బరిణలుపెట్టి కట్టినమూట దాచుకుంటూ.

"ఎక్కడికే అమ్మా బయలుదేరావు?"

"నేనా? మీ యింటికే వద్దామనుకుంటున్నాను. ఒకవేళ మీ ఇద్దరూ కలిసి మీ యింటికి అలా తిన్నగా వెళ్ళిపోయారేమో అనుకున్నాను. ఏదో ఆ చేసినది కాస్తో కూస్తో అక్కడికన్నా పట్టుకెళ్ళి ఇచ్చి వద్దామనుకుని బయలు దేరాను. పోనీ ఆ తర్వాత అయినా ఆయన కాస్త రుచి చూస్తాడేమో అని...."

నేనావిడి పవిట కొంగుచాటున వున్న మూట లాగి విసిరి ఓ మూల పారేశాను. నేనంతవరకూ అణుచుకుంటున్న రోషం అంతా ఒక్కసారి ప్రదర్శించాను ఆ బరిణలమీద, అమ్మ మీదాను.

"నువ్వు చేసిన బ్రహ్మసుందే అంటే ఆయనగారికేమీ విలువ లేదే అమ్మా! వాళ్ళంతా ముత్యాల రాసులు అన్నంగా తినాలనుకునే జాతి. నువ్వు ఇంకెప్పుడూ ఇలాంటి ఆశ పెట్టుకోకు. ఇంతవరకు జరిగిన మర్యాద చాలలేదటే నీకు?"

నిజానికి ఆ జరిగిన మర్యాద ఏదో అమ్మకంటె ఎక్కువగా నాకే జరిగింది. తడవ తడవకూ అవమానపడింది నేను. శ్రీమంతుల ఇంట్లో తిరుగాడుతూండే అధికారమూ, గర్వమూ నన్ను పూర్తిగా అణిచి వేశాయి. ఈ నాలుగురోజులూ నా అత్తగారు అణిచేసింది. ఇవాళ ఈయనగారు. అంతటతో నా ఓర్పు అడుగంటిపోయింది. నే వెళ్ళి పరుపు

చుట్టమీద ఒరిగిపోయాను. ఆ తర్వాత ఈ ఆధునిక జాన్సీరాణి గొంతుక లోంచి వెక్కి వెక్కి ఏడుపు మాత్రం వెలువడింది.

అమ్మ పరుగెత్తుకుంటూ వచ్చింది. దగ్గిరకూచుని నా బుజంమీద నిమురుతూ, "ఏమయిందే తల్లీ?" అంది. అవతల శ్రీమంతుల కోడలికి తనయింట ఏవిధమయిన దుఃఖమూ కలగకుండా వుండాలనే ఆవిడ సంక్షోభం అంతా.

"ఇంకా ఏమి కావాలమ్మా? నే నొక వేటగానిపై మోజుకి పరవశమయి చిక్కిపోయాను. చివరకి బంగారు పంజరంలో బందీనయ్యాను."

# సంకల్ప సిద్ధి

ఎంత శ్రీమంతులైతే మాత్రం. ఏం చేస్తారేమిటి? నమిలి మింగి వెయ్యరుకదా! చూస్తూ చూస్తూ కుక్కల్ని ఉసికొల్పరుకదా? మహాఅంటే 'మీ సంబంధం మా కక్కరలే'దంటారు. సరే పోనివ్వండి. సెలవిప్పించండి అంటాం. వచ్చేస్తాం—

తనలో తా నిలా తర్కించుకుంటూనే బెల్గాంనుంచి తలక్‌వాడి వరకూ పాదయాత్ర సాగిస్తున్నాడు సోనూమామ.వాళ్ళ తారది బంగారం లాంటి ఛాయ; కళ్ళ పండువుగా వుండే కనుముక్కు తీరు, ఏదో నాలుగు అక్షరాలు చదువుకుంది. పనిపాటల్లో బాగా చేయి తిరిగిన పిల్ల. అంచేతే, యీ కొండ ప్రదేశంలో అయినాసరే మంచి సిరిగల సంబంధం చూడాలని సోనూమామకి మనసులో వాంఛ. తన కూతుర్ని ఎంత గొప్ప కుటుంబంలో వరుడైనాసరే కళ్ళనద్దుకుని చేపడతాడని ఆయన ధైర్యం. కాస్త కలిగిన సంబంధాలు వెతకటం కోసమే నాలుగురోజుల క్రితం తను బెల్గాం వచ్చాడు. పరిచయస్తులతో మాటామంతీ ఆడుతున్నప్పుడు నాలుగయిదు 'నచ్చువచ్చు' ననిపించే సంబంధాల వాకబు దొరికింది. ప్రత్యక్షంగా వెళ్ళి పలకరించిన తరవాత, చివరకి ఒకటీ సానుకూల పడలేదు. కొందరు యీ సంవత్సరం చేయాలనుకోవటం లేదన్నారు. కొన్ని సంబంధాలు తనకే నచ్చలేదు. ఆ తర్వాత ఒక స్నేహితుడు మాటల ధోరణిలో యీ తలక్‌వాడిలోవున్న సాఠే సంబంధాన్ని గురించి చెప్పాడు. చాలా మంచి సంబంధమూ,బాగావున్న కుటుంబమూ మరి. ఏవో కొన్ని సంచులు చేతనుంటేగాని వాళ్ళ గుమ్మం ఎక్కడానికి

వీల్లేదనికూడా హెచ్చరించా డా మిత్రుడు. కాని సోనూమామాకి యీ హెచ్చరిక ఏమీ నిరుత్సాహం కలిగించలేదు. అంచేతే, భగవంతుడిమీద భారంవేసి సాతేగారి బంగళా వెతుక్కుంటూ నడక సాగించాడు ఆ కొండవేపుకి.

వాడ అంతటికీ చిట్టచివర, కొంతదూరంగా కొండ చాలుమీద కనుపించింది ఒక పెద్దబంగళా. అతను విన్న ఆనవాళ్ళని బట్టి చూస్తే, ఆ బంగళాయే సాతేగారిదని నమ్మకం కలిగింది. అంచేత తోటగేటు మెల్లిగా తెరిచాడు సోనూమామ. శ్రీమంతులు సాయంకాలపు టీ తీసుకునే వేళఅది. ఒక సంపన్న గృహస్థు అపరాహ్ణపు టరగన్ను చాలించి. బంగళా ముందున్న వసారాలోవున్న ఉయ్యాలలో వచ్చి కూచుంటున్నాడు. ఆయన చేతిలో ఒక లావుపాటి హోమియోపతి గ్రంథమూ, ఎదురుగావున్న పెట్టెలో ఒక్కపోలికనేవున్న సీసాలూ వున్నాయి. ఆయన ఠీవీ, దర్పమూ చూడగానే, ఈయనగారే వరుడి తండ్రి అని సోనూమామకి స్ఫురించింది.

"ఏవూరునుంచి వచ్చారు ?" అని అడిగారు సాతేగారు. సోనూమామ కులగోత్రాలతో సహా ఊరూ పేరూ చెప్పుకుని, ఆ వూపులోనే వచ్చిన పనికూడా చెప్పేశాడు.

సాతేగారు తమ పిల్లికళ్ళతో సోనూమామని ఒక్కసారి ఆపాద మస్తకం పరీక్షించారు. "అట్లాగా ?" అంటూ, పేజీలమధ్య గుర్తుపెట్టి, పుస్తకం మూసేసి పక్కన పెట్టారు. వచ్చిన పెద్దమనిషికి యేమని జవాబు చెప్పాలో తన మనసులో ఒక నిశ్చయం కుదిరేవరకూ పెట్టెలో సీసాలు ఒక్కొక్కటే బయటకుతీసి, 'కాలీఫాస్' 'ఆర్సెనికం' 'పల్సటిల్లా' అని గొణుక్కుంటూ; ఆ సీసాలను మళ్ళీ వాటివాటి అరలలో పెట్టేస్తూ కొంత నాటకం ఆడారు,

సోనూమామా కూడా సాతేగారికి తగిన వృజ్జీయే। అలా ఏర్పడిన వ్యవధిలో తనువున్న చోటునుంచి తనకు కనుపించినంతవరకూ ఆ బంగళానీ, వస్తువులనీ పరకాయించి, పరిస్థితులు అవగాహన చేసుకుంటున్నాడు.

పశువుల పాకలో పాడిగేదెల పిలుపులు వినిపిస్తున్నాయి. సొంతంగా ఒకయిల్లూ, పెరట్లో కొన్ని పాడిపశువులూ వుంటే ఇంకేమీ కొరత లేదనిపిస్తుంది కొంకణదేశపు మనుషులకి. సోనూమామాకీ అలాగే అనిపించింది. తనకూతురు తారూ ('తార' ముద్దుపేరు)కు ఈ సంబంధం కుదిరితే చాలా బాగుంటుందని నిశ్చయించుకున్నాడు. ఇంతకీ ఈ సాతేగారు ఏం సమాధానం చెప్తారో వినాలని తహతహ లాడుతున్నాడు.

"మీరు పనికట్టుకు వచ్చారు, నిజమే; కానీ, మా అబ్బాయికి సంబంధం చాలావరకూ నిశ్చయమయినట్లే. వచ్చే శనివారం సాంగ్లి నుంచి ఒక పెద్దమనిషి వా రమ్మాయిని చూపించటానికి తీసుకు వస్తానన్నారు" *

"ఆ అమ్మాయి ఫొటో మాకు నచ్చింది. మెట్రిక్ పాసయింది. వాళ్ళు బాగా వున్నవాళ్ళు. చెయ్యి బాగా సడలించటానికి సిద్ధంగానే వున్నారు కూడా. అంతకంటే ఏం కావాలింక ?"

"వాస్తవమే అనుకోండి. కాని మీరింకా మాట ఇవ్వలేదుగా?"

"మాట యివ్వకపోయినా, దృష్టి అటే వుంది"

"మా అమ్మాయిని కనుక మీరొకసారి చూస్తే, దృష్టి మళ్ళించుకుంటారనిపిస్తోంది నాకు" అన్నాడు సోనూమామ ఎంతో చొరవగా.

---

* మహారాష్ట్ర ప్రాంతంలో వరుని ఇంటికి కాబోయే పెళ్ళికూతురిని తండ్రి వెంటబెట్టుకు తీసుకువెళ్ళి, పెళ్ళిచూపులు జరిపించటం సంప్రదాయం.

ఆ మాట విన్న సాతేగారు మళ్ళీ ఒకసారి ఆయనమీద దృష్టి నిలిపి పరకాయించారు.

"ఇదిగో ! ఆ ఫొటో తీసుకురా ఒకసారి" అని గృహిణిని కేకేశారు. ఆ ఆజ్ఞానుసారం ఒక ఫొటో వచ్చి ఉయ్యాలబల్లమీద పడింది.

"ఈ ఫొటో చూడండి ఓసారి. ఈ అమ్మాయితో సరితూగుతుందా మీ అమ్మాయి?"

చూడకపోతే అవమానం చేసినట్లుంటుందేమో ననే ఆలోచన వచ్చి, ఆ కాబోయే పెళ్ళికూతురి ఫొటోవేపు ఒక్క క్షణం చూశాడు సోనూమామ. మరుక్షణం అది ఉయ్యాల బల్లమీద పెట్టేశాడు.

"ఈ అమ్మాయి బాగులేదని నే ననటంలేదు కాని, మీరు మా అమ్మాయిని చూడకుండా వారికి మాటయిస్తే, ఒక మంచి రత్నాన్ని చేతిలోంచి జారవిడిచిన వారవుతారని మాత్రం నిశ్చయంగా చెప్పగలను. రావు సాహెబుగారూ ! పది నిముషాల వ్యవధిలో యెంతవరకు సాధ్యమో అంతవరకూ నేనూ, మీ ఇల్లూ, వాకిలీ చూసి చాలా సంగతులు గ్రహించాను. క్రొత్తమనుషుల వైఖరులూ, ముఖాలూ ఒక్కసారి చూసి, వారి స్వభావాలు ఎంతవరకు అర్థం చేసుకోటానికి వీలవుతుందో అంతవరకూ మీ ఇద్దరినీ అర్థం చేసుకున్నాను. ఈ ఇంట్లో వున్నవాళ్ళు చాలా చురుకుగా, శ్రద్ధగా పని పాటలు చేసుకోవడంలో తృప్తి పడేవాళ్ళు. ఇక్కడికి వచ్చే కోడలుకూడా చురుకయినదీ, తెలివయినదీ అవాలి. కొంచెం యించుమించు అష్టావధాని అయి వుండాలి. కూచుంటే లేవలేని పిల్లలకు యీ ఇల్లు నప్పదు. పొద్దస్తమానమూ కాళ్ళూ చేతులూ కదుపుతూ, మంచిగంధంలా పరిమళించే చిరునవ్వుతో తిరుగాడే పిల్ల కావాలి యీ ఇంట దీపం పెట్టడానికి. ఇంట్లోవున్న పెద్దవాళ్ళని తుచ్ఛంగా చూడకుండా, వాళ్ళ మనస్సుల్లోవున్న కోరికలు కనిపెట్టి

నడుచుకుంటూ. కులగౌరవాన్ని పరంపరగా నిలబెట్టే అమ్మాయికావాలి. మీకు వృద్ధాప్యం వచ్చాక, వళ్ళువంచి చాకిరీచేసి మీకు కన్నూ చేయీ కాగలిగిన అమ్మాయి కావాలి. కోడలుగావచ్చి కూతురుగా మారగలిగిన పిల్ల కావాలి ఈ యింటికి. యీ గీటురాయిమీద నాణ్యంకడితే, మా అమ్మాయి వన్నెకి నిలబడుతుందని నా నమ్మకం. మా అమ్మాయిని మీ ఇంటికి తెచ్చుకుంటే, యెన్నటికీ పశ్చాత్తాపపడరని నా విశ్వాసం. అంత వరకూ నేను వ్రాసి ఇవ్వగలను"

సోనూమామ వాగ్ధాటి చూసి సాతేగారు ఆశ్చర్యపడిపోయారు. కన్నకూతురికి సంబంధం కుదుర్చుకోవడానికి వచ్చిన పెద్దమనిషి ఇంత ధీమాగా, ధైర్యంగా మాట్లాడ్డం ఆయన ఎప్పుడూ చూడలేదు. సోనూమామ తనను గురించీ, తన ఇంటిని గురించీ మెచ్చుకుని మాట్లాడినందుకు సాతే గారు కొంత మెత్తబడిన మాట నిజమే. అంతటి అందమయినదీ, గుణ వంతురాలూ గనక అయినట్టయితే, ఆ అమ్మాయిని ఒకసారి చూడకుండా మరొకరికి మాట ఇవ్వడం పొరపాటేమో అనికూడా తోచింది. 30 ఏళ్ళ ఉద్యోగం నిర్వహించి, మంచి వ్యవహర్తగా అనుభవం సంపాయించి, 55 వ ఏట పించను తీసుకున్న సాతేగారికి సాంగ్లీవారి సంబంధం నచ్చ టానికి అసలు కారణం, ఆ అమ్మాయి ఫొటో పెద్దగా నచ్చటంకాదు. ఆ సాంగ్లీ శ్రీమంతుడు,లాంఛనాలూ, కట్నాలూ విషయంలో అన్నిటికీ తల వూపడమే ముఖ్యంగా నచ్చిన విషయం. ఇప్పుడు యీ కొంకణ దేశపు మోతుబరి ఇంత మంచి రత్నంవంటి అమ్మాయిని ఇస్తూ, మిగిలిన విష యాల్లోకూడా అవతల వారికి తీసిపోకపోతే ఈ అమ్మాయిని కూడా ఒక సారి చూడడమే మంచిదన్న అభిప్రాయానికి తొందర్లోనే వచ్చేశారు సాతేగారు.

"చూడండి, నే ఒక్క సంగతి చెబుతాను మీతో. వచ్చే శని వారం మధ్యాహ్నం లోపుగా మీరు మీ అమ్మాయిని తీసుకొచ్చి

చూపించండి. సాంగ్లీవారు ఆరోజు సాయంకాలం వస్తామన్నారు. అంచేత శనివారం మధ్యాహ్నం 12 గంటలలోగా మీరు మా ఇంటికి యెప్పుడు వచ్చినాసరే. ఆగడువు దాటితేమాత్రం ఇక మీకూ మాకూ యే ప్రమేయమూ లేదన్నమాట"

"మంచిదే. తప్పకుండా" అని ఒప్పుకుని సోనూమామా అక్కణ్ణించి కదలాడు. ఒక్కనిముషం వృథా చెయ్యకుండా రైలెక్కి ఇంటికి చేరుకున్నాడు.

మంచి ముహూర్తం చూసుకుని "తారూ"ని వెంటబెట్టుకుని కళ్యా వచ్చాడుగాని. ఆ రైలుకి రద్దీ ఎక్కువగా వుండడంవల్ల టిక్కెట్టే దొరకలేదు. అంచేత, ఆ వూరునుంచి మర్నాడుగాని బయలుదేరలేక పోయాడు. ఆ రోజునకూడా బండి బాగా లేటయి. బండి మారవలసిన చోట రెండోబండి తప్పిపోయింది. శనివారం ఉదయమే బెల్గాం చేర వలసిన సోనూమామా ఆదివారం ఉదయం ఆ స్టేషనులో దిగాడు. అప్పటికి సాఠేగారి సంబంధంమీద ఆశ వదులుకున్నాడు. అయినా, జరిగిన ఆలస్యాలు చెప్పి, తను ఉద్దేశ్యపూర్వకముగా యెగవెయ్యలేదని ఆయన్ని నమ్మించి తిరిగి వచ్చేయవచ్చుననే ఊహతో సాఠేగారి బంగళాకు దారి తీశాడు.

ఆ ఇంటికి చేరేటప్పటికి పొద్దున్న 9 గంటల సుమారయింది. గుమ్మంలో అడుగు పెట్టేటప్పటికి సాఠేగారి సతీమణి యెదురువచ్చి స్వాగతమిచ్చింది. సోనూమామా ఉయ్యాల బల్లమీద కూర్చున్నాడు. తారూ ఇంట్లోకి వెళ్ళింది.

"రావుసాహెబ్‌గారు ఇంట్లో లేనట్లున్నారు" అన్నాడు సోనూమామ.

"సాంగ్లీవారితో కలిసి ఊళ్ళోకి వెళ్ళారు"

"అట్లాగా ! వారు నిన్ననే వచ్చారనుకుంటాను. అయితే నిశ్చయం చేసుకున్నట్టేగా ?"

"ఆఁ, నిన్నరాత్రి నిశ్చయం చేశారు"

సోనూమామ ముఖం నిరాశతో వాడిపోయింది. తన ప్రయాణంలో వచ్చిన అవాంతరాలన్నీ ఆవిడకి వినిపించాడు. కాని ఆవిడ ఆటే మాట్లాడకుండా లోపలికివెళ్ళి, అమ్మాయిని కుశల ప్రశ్నలు వేయడం ఆరంభించింది. కొంచెం సేపయాక ఆయన మధ్య వాకిలి దగ్గిరకు వచ్చి నిలబడి "అయితే మేం ఇక వెళ్ళొస్తాం" అన్నాడు.

సాఠే సతీమణి ముఖంలో ఏదో సంభ్రమం కనిపించింది. సోనూమామతో "సరే బాబూ ! వెళ్ళిరండి" అనలేదావిడ. ఒకసారి తారాకేసి, ఒకసారి సోనూమామకేసి యేదో ఆలోచిస్తూ చూసింది. ఆవిడకి ఏదో సంకోచం వున్నట్టు కనుపించింది. చెబుదామా వద్దా అని కాస్సేపు ఆలోచించి, సందేహించి ఆఖరికి చెప్పక తప్పదనే నిశ్చయానికి వచ్చింది.

"మీరు రాత్రింతా ప్రయాణంచేసి అలసిపోయి వచ్చారు. న్యాయంగా చూస్తే మిమ్మల్ని భోంచేసి వెళ్ళమనాలి నేను. కాని ఇప్పుడేం చెయ్యను ? ఈవేళ నేను ఇంట్లోకి రాకూడదు. కనీసం టీ అయినా తీసుకోవాలి మీరు మా ఇంట్లో. మీరు అనుజ్ఞఇస్తే మీ అమ్మాయిచేత కొంచెం టీచేసి పెట్టమందామని వుంది నాకు"

"సరి సరి ! ఈ మాత్రానికి నా అనుజ్ఞేమిటండీ ? కాని మాకు ఇప్పుడు టీ ఎందుకండీ?...."

"మీ కక్కర్లేకపోయినా, మా గృహస్థ ధర్మాన్ననుసరించయినా మీరు టీ తాగితే మాకు కొంత తృప్తి."

"సరే మీ ఇష్టం ! అమ్మాయి, తారా ! లేమ్మా, కానీ—"

కొంచెం సేపటిలో టీ యే గాకుండా, ఒక లడ్డుండకూడా సోనూ మామముందర ప్రత్యక్షమయింది. ఆయన కా క్షణంలో లడ్డు అంత తియ్యగా లేకున్నా, ఆవిడ ఆతిథ్యం మాత్రం తియ్యగానే కనిపించింది. ఆయన టీ తాగుతుండగా ఆవిడ తారూతో ఏదో మాట్లాడుతూ కూచుంది. ఆ మాటలు వినిపిస్తుంటే ఆలకించాడు.

"మంచి ఇరుకున పడిపోయాను. ఈ వేళ ఎలా గడుస్తుందో అర్థం కావటంలేదు. ఇంటినిండా అతిథులు-నేను ఇంట్లోకి రాకూడదు. ఈ మధ్యాహ్నం వాళ్ళకి విస్తళ్ళలోకి అన్నం యెలా వస్తుందా అని ఆందోళనగా వుంది. మా ఇల్లు ఊరికి బాగా దూరంగా వున్నందువల్ల ఒక్క వంటావిడయినా రావడానికి ఇష్టపడటంలేదు. ఎవర్నయినా నౌక రిని పంపించి ఎవర్నో ఒకర్ని వెంటబెట్టుకు తీసుకు రమ్మనకపోతే మాట దక్కేట్టు లేదు."

ఇంతవరకూ వినిపించగానే, సోనుమామ లేచి వెళ్ళి, మళ్ళీమధ్య వాకిలి దగ్గిర నిలబడ్డాడు. "ఏమండోయ్, మేమయినా తక్షణం మావూరు వెళ్ళవలసినంత పెద్ద పనేం లేదు. మేంకూడా ఎక్కడో రెండు మెతు కులు తినాలిగదా. అంచేత ఎక్కడికో వెళ్ళడం ఎందుకు ? మా తార శుభ్రంగా వంటవేసి, అందరికీ వడ్డించి, నాలుగు మెతుకులు తింటుంది లెండి."

ఈ సలహా విచిత్రంగానే కనిపించింది సాఠే సతీమణికి. కాని పరిస్థితీ విచిత్రంగానే వుంది మరి. అయినా ఆవిడ చటుక్కున అంగీక రించలేక పోయింది. "పాపం ఈ పసిదానికి శ్రమెందుకులెండి బాబూ."

"ఓహోహో ! ఒకపూట ఉడకెయ్యడమే శ్రమనుకుంటే, ఇంక ఆడపుటక పుట్టడమెందుకండీ? మీ రనవసరంగా సంకోచాలేమీ పెట్టుకో వద్దు. పోనీ ఈ పూట అమ్మాయికి వంటఏమాత్రం తెలుసునో చూద్దురు

గాని. ఆ తర్వాత మీకు నచ్చితే, మీకు తెలిసినచోట ఎక్కడయినా సంబంధం చూసిపెట్టవచ్చు. సరేనా?" అన్నాడు సోనూమామ, నవ్వుతూ.

ఆవిడ నవ్వింది. పరిస్థితులెంత అడ్డ దిడ్డంగా తిరిగినా, వాటి మధ్యనే ఒక మార్గం చేసుకుని, తన కార్యం నెరవేర్చుకోవడంలో ఊహం గడసరి సోనూమామ. ఈ పూట ఏదో దేముడే రక్షించాడనుకుని ఒప్పుకుంది ఆ గృహిణి. తార ఆవిడ పర్యవేక్షణ క్రింద పనులు మొద లెట్టింది. స్నానాలగదిలో వేణ్ణీళ్ళు కాగేవున్నాయి.

ఈ లోపుగా సాఠేగారూ, ఆయన కాబోయే వియ్యంకుడూ గారూ ఇంటికి చేరుకున్నారు. సాంగ్లీ శ్రీమంతుని చేతిలో వెండి పిడి వేసిన చేతికర్ర ఒకటి వుంది. ఆ కర్రమీద ఆనుకుంటూ ప్రవేశించా రాయన. ఆ కర్ర అసలు బరువయినది. దానికితోడు తన యజమాని ధనవంతుడైనందువల్ల ఏర్పడిన బలమూ,బరువూకూడా తనే మోస్తోంది. ఈ ఘనత సాఠేగారి మనస్తత్వాన్ని కూడా కొంచెం వంచించిందనే చెప్పాలి. ఎంచేతంటే, ఆ సాంగ్లీ వియ్యంకుడి ఎదుట తన మగపెళ్ళి వారి గాంభీర్యం కొంత తగ్గుముఖంలోనే వుంచాడు. ఆయన లోకహితా ర్థం హోమియోపతీ వైద్యం పెట్టుకున్నాడు. కాని ఇప్పుడు తనకు కలి గిన రుగ్మతకు మందేమిటా అని ఆలోచించే వ్యవధీ దొరకలేదు, వుద్దే శ్యమూ కలుగలేదు. వారిద్దరూ ఇంటికి వచ్చేటప్పటికి సోనూమామ వుయ్యాలబల్లమీద కూచుని వున్నాడు. ఆయన కనుపించగానే, సాఠేగారి కనుబొమలు ముడివేసుకున్నాయి. ఈ పూట సోనూమామ అంటే సాఠేగారికి యేమీ గౌరవం వుండే అవకాశం లేదు. అందుకు మొదటి కారణం సోనూమామ నిర్ణయించిన గడువు తప్పటం. రెండో కారణం ఆ సాంగ్లీ జమీందారుగారు సాఠేగారి వూహలకు కూడా మించి ప్రఫు ల్లంగా చేపగలరని నమ్మకం కలగడం. అంచేత, ఎంత పిలికినా తన

గని కామధేను వల్లే కనుపించింది సాంగ్లీ సంబంధం. ఇంతలో సోనూ మామ లేచి నుంచుని నమస్కారం చేశాడు. సాహెబుగారు లాంఛన ప్రాయంగా చేతులు ఒక్క-క్షణం ముందుకి ఊగించారు.

"మీరు ఇచ్చిన గడువు తప్పింది."

"నిజమే రావుసాహెబుగారూ!"

"మరి?"

"మరేంలేదు. సముద్రంలో వదిలిన నావ యెక్కడో అక్కడ దరికి చేరుతుంది లెండి!"

ఇంటిలోపలికి వెళ్ళగానే, రావుసాహెబుగారికి ఇంట్లో కలిగిన ఇబ్బంది అర్థమయింది. ఇల్లాలుచేసిన ఏర్పాటు కూడా తెలుసుకున్నాడు. ఈ సాంగ్లీ వియ్యంకుడుగారు సాయంకాలం మెయిలుకే వూరికి వెళు తున్నారు. అంచేత ప్రస్తుతం ఈ మధ్యాహ్నం సదుపాయాలు సవ్యంగా గడుస్తాయకదా అని తృప్తిపడి, భార్యతో మంచిపనే చేశావన్నాడు.

వధూవరులుకూడా వారి వెనుకనే ఇల్లు చేరుకున్నారు. ఆదివారం గనుక అబ్బాయిగారికి తిరగడానికి ఖాళీ దొరికింది. ఆ అమ్మాయికి ఎప్పుడూ ఖాళీయే! జయంత్‌కి లీల బాగానే నచ్చింది. వీలకి జయం తంటే ఇష్టం కలిగింది. తమ తలిదండ్రులు ఎలాగా తాంబూలాలు పుచ్చుకుని, శుభం అంటే శుభం అనుకున్నారు. అంచేత, రేపు పెళ్ళి పందిరిలో ఖాయం కాబోయే పరస్పర సంబంధం ఈ రోజునుంచీ అల వాటులో పెట్టుకోవటంలో ఆక్షేపణ కనుపించలేదు. ముఖ్యంగా ఆ అమ్మాయికి. ఒక్క-రోజు చనువుతోనే జయంత్‌ని పూర్తిగా వశం చేసు కుని "మళ్ళీ ఎప్పుడు కలుసుకోవటం?" అని ఆదుర్దా పడేవాణ్ణిగా చేసేసింది. తను కోరుకున్న వాణ్ణి అఅచేతిలో బొమ్మలాగ చేసుకోవ టానికి ప్రయోగించవలసిన అస్త్ర శస్త్రాలన్నీ ఆ అమ్మాయికి సహజ

సిద్ధంగా అందుబాటులో వున్నవే. అసలే శ్రీమంతుల ఇంటి గారాబుబిడ్డ అందులోనూ చదువుకుంది. కాలేజీలో చేరి, వున్నత విద్యలో సంవత్స రంనుంచీ శిక్షణ పొందుతున్న జవ్వని. అంచేత మాటల్లోనూ, నడత లోనూ నవనాగరికత అవలంబించటం ఆవిడకి నచ్చిన విషయం.

"మనకిప్పుడు ఒక ఫస్టుక్లాసు టీ వుంటే బావుంటుంది. అవునా నాన్నగారూ?" ఆవిడ చూసింది నాన్నగారివేపే అయినా, మాట్లాడింది మాత్రం సాతేగారి భార్య వినేటట్లు. ఇంట్లో ఏర్పడిన ఇబ్బంది ఆవిడకి తెలియనే తెలియదు. కాని ఆ ఇల్లాలు లీలకి మరుక్షణంలోనే వున్న పరి స్థితి చెప్పింది. "అయితే ఇప్పుడిక యెట్లా మరి?" అని భయం భయంగా అడిగింది లీల.

"ఆ వచ్చిన అమ్మాయి అవన్నీ చూసుకుంటోంది" అని కాబోయే అత్తగారు చెప్పాక, లీలకి మళ్ళా శ్వాస ఆడటం ప్రారంభించింది. కాని అంతట్లోనే కొంత కుతూహలం పుట్టుకొచ్చింది. ఆ కొత్తగా వచ్చిన అమ్మాయి యెవరు? యెందుకు వచ్చింది? యెక్కణ్ణుంచి వచ్చింది?

"జయంత్‌కి వచ్చిన పెళ్ళి సంబంధం. అమ్మాయిని మాకు చూపించాలని తీసుకువచ్చారు" అని ఆవిడ చెప్పగానే "అట్లాగా!" అంది లీల, కనుబొమ్మ ఆషామాషీగా ఎగరవేస్తూ.

కాని మనసులో ఆ అమ్మాయిని ఒకసారి చూడాలనే ఉబలాటం తీవ్రమయింది. అలా స్నానాల గదివరకూ వెళ్ళి వచ్చింది. ఆ తరువాత తన మనసులో పొంగుతూవచ్చే ఆలోచనల్ని అణుచుకోలేకపోయింది. తక్షణం జయంత్ దగ్గిరకి వెళ్ళి, ఆ అమ్మాయిని గురించి వేళాకోళంగా మాట్లాడితేనేగాని తనకి మనస్థిమితం కలగదని తోచింది. అంచేత, తన పల్చటి లంగాని రెండుచేతుల చిటికెలతో యెత్తి పట్టుకుని, మెట్లెక్కి మేడమీదకి వెళ్ళింది. జయంత్ గడ్డం చేసుకోవడానికి అన్నీ సిద్ధం చేసుకుని, సబ్బుమీద బ్రష్ కదుపుతున్నాడు.

"అమ్మమ్మమ్మమ్మ ! పెద్ద ఆపదే తప్పింది !"

ఆ తప్పిందన్న అభినయం లీలయెంతో అందంగా చేసినట్లు కనుపించింది జయంత్‌కి. ఆ అమ్మాయికేసి అలాగే చూస్తుండాలని వుంది అతనికి. అంచేత ఆ తప్పిన ఆపద ఏమిటని అడగాలనికూడా తోచలేదు. అంచేత లీలే చెప్పుకుపోయింది.

"మీ అమ్మగారు వెలపల చేరారుట. అది వినగానే ఇహ నేను పొయ్యిదగ్గిర చేరవలసివస్తుందని భయపడ్డాను. ఇదేం గ్రహచారం అనుకున్నాను. కాని భగవంతుడు నాబాధ కనిపెట్టి, ఒక వంటావిణ్ణి పంపించాడు సమయానికి."

తన ఛలోక్తికి తనేనవ్వటం మొదలుపెట్టింది. ఆవిడ చెవులకు పెట్టుకున్న నాజూకు లోలకులు అటూ ఇటూ ఊగుతూ తమ యజమానురాలి సంతోషానికి ప్రోత్సాహం సూచించాయి. ఆవిడ జడకూడా ఒకసారి కుడిభుజం మీంచి ముందుకు విసురుగా వచ్చి, మళ్ళీ అంత విసురుగానూ వెనక్కి వెళ్ళిపోయి, నితంబ ప్రదేశంలో నాట్యం చేస్తోంది. ఇటువంటి క్రీడలు ఆవిడకి అతిసులువు.

"వంటావిడ ఎక్కణ్ణుంచి వచ్చింది ?" అని అడిగాడు జయంత్.

"రావడం మీకు భార్యామణి అవుదామనే వచ్చిందట. కాని ఆ జాగా నిన్ననే భర్తీ అయిపోయింది మరి ! ఇంకేం చేస్తుంది ? పోనీ ఈ ఇంట్లో ఈపూట మట్టుకయినా వంట చేద్దామనుకుంటున్నట్టుంది. అదిగో, ఆ బావిదగ్గిర వుంది. మీకు చూడాలనివుంటే...."

జయంత్ కిటికీలోంచి దృష్టి సారించాడు. ఆ బావి అంచునుంచి గిలకవరకూ పైకి కిందకి వస్తూన్న రెండుచేతులు మాత్రం కనుపించాయి, తను కూర్చున్న స్థలంనుంచి. తెల్లగా, నాజూకుగా, పొడుగాటి వేళ్ళతో నిగనిగలాడుతున్నాయి ఆ చేతులు. ఆ చేతుల అందం అసాధా

రణంగా వుంది. జయంత్ చటుక్కున లేచి, కిటికీదగ్గరకి వంగి నుంచు న్నాడు. లీలకూడా అతని ప్రక్కని చేరింది. తార స్నానం చాలించి. నీళ్ళు తోడుతోంది. స్నానం చేయాలని కట్టుకున్న చాలీచాలని చీర మోకాళ్ళవరకే వుంది. తడిసి వుండటంవల్ల వంటికి అతుక్కుపోయి వుంది. నీళ్ళు తోడుతున్నప్పుడు ఆ పల్చటి నడుము ఒకసారి వంగి తక్షణమే తిన్ననవుతోంది. అలా కదలినప్పుడల్లా ఆవిడ అవయవాలు యెక్కడివక్కడ కొద్దిగా కదిలి మళ్ళీ స్థిరపడుతున్నాయి. ఆవిడ వెనుక చాలాభాగం అనాచ్ఛాదితంగా వుంది.ఆ విగ్రహాన్ని పూర్తిచేసి బ్రహ్మ దేవుడు పని మానుకున్నాడా అన్నట్టుంది ఆ వయ్యారం.

కాని ఆవనహరిణికి తనను యెవరో దృష్టులతో వేటాడుతున్నా రని తెలియనే తెలియదు. కూజాబిందె బావిలోంచి పైకి లాగింది. తాడు తప్పించింది. కొంచెం నీళ్ళు పురిసిట్లో తీసుకుని, తన కందిపోయిన అర చేతులమీద పోసుకుంది. ఒక్కఊపుతో కుడి తుంటిమీదికి బిందె యెత్తు కుంది. అదే సమయంలో ఆవిడ తలఎత్తి పైవేపు చూడడం సంభవిం చింది. ఆవిడకళ్ళు మేడమీది కిటికీలోని నాలుగుకళ్ళనీ క్షణమాత్రం చూశాయి. తక్షణం కమలాలు ముడుచుకుపోయినట్టు రెప్పలు క్రిందికి వాలిపోయాయి. సిగ్గుతో, కంగారుతో, హృదయంలో కంపంతో ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"అయిందా చూడడం ? ఏదో తపస్సమాధిలోకి వెళ్ళినట్టుందే తమరు ? మగవాళ్ళకి సిగ్గు లేదంటారు. అది అక్షరాలా నిజమే !" అని కుట్టడం ఆరంభించింది లీల. అప్పుడతనికి స్పృహ కలిగింది.

"ఆ అమ్మాయి నేనా లీలా, నువ్వు వంటావిడన్నావు ?"

"ఏం ? ఇంకేమనాలేమిటి ?" "పోనీ మీ ఆవిడే అనేదాన్ని కాని చట్టరీత్యా అలా అనకూడ దీ రోజుల్లో. బుద్ధి—సిద్ధి మధ్య కూర్చున్న

వినాయకుడిలాగ వుందామన్న మీరు ఆశపడినా, అది ఇప్పుడు వీలుపడదు. కొత్తగా వచ్చిన చట్టం అందుకు ఒప్పదు."

"చట్టం ఒక అడ్డగాడిద!"

"కావచ్చు - నేను కానుగా? నేనూ ఒప్పుకోను"

ఆ తరువాత ఇద్దరూ నవ్వేశారు. ఇంకొంచెం సేపటికి క్రింద నుంచి తల్లి కేకవేసింది. "జయంత్! టీ తీసుకుందురుగాని రండిరా!" అంది. ఆ స్వరంలో ఒక వీసం కోపంకూడా వున్నట్టు అర్థమయింది జయంత్‌కి.

ఇద్దరూ మేడదిగి కిందికి వచ్చారు. తార రెండు కప్పులతో టీ తీసుకువచ్చి వారిముందు పెట్టింది. ఇప్పుడు తార 9 గజాలచీర కచ్చా పోసి, వంటినిండా కట్టుకుని, పమిటకొంగు దోపుకుని వాళ్ళయెదుట కొచ్చింది. ధర్వారీ ప్రింతపు నిండు రవిక వేసుకుంది. ఆవిడ వళ్ళంతా కప్పుకునేటట్టు ధరించిన పద్ధతి చాలా పాతకాలపు దన్నమాట నిజమే.

"ధరించిన వాళ్ళ దేహం చైతన్యంతో నిండుకుని వున్నప్పుడు ఏవేషం ధరించినా శోభిస్తుంది" అనే కాళిదాసు వాక్యార్థానికి ఈ అమ్మాయి రూపకల్పన అనిపించింది జయంత్‌కి.

లీల చెవులకు అనుక్షణమూ అల్లల్లాడే లోలకులున్నాయి. తార చెవులకేమీ బంగారు నగలులేవు. కాని జయంత్‌కి తార చెవులే ఎక్కువ అందంగా కనిపించాయిఆవిడ జడలో అల్లడానికి సరిపోని చిరుపాయలు, వంకెలు చుట్టుకుని చెవుల క్రిందికి వచ్చి వంపులు తిరిగాయి. కెంపారిన చెంపలమీంచి దిగి, చెవును తాకుతున్న శిరోజాలు సహజసుందరంగా వున్నట్టు తోచింది అతని మనస్సుకి. అతను అప్రియత్నంగా వారిద్దరినీ పోల్చి చూసుకుంటూ, వారిద్దరిమధ్యనూ వున్న సామ్య వైషమ్యాలని జాబితా వేసుకున్నాడు మనసులోనే.

లీల సౌందర్యంలో దేవాంగన ఏం కాదుగాని, నీటూ గోటూ వున్నాయి. ఆవిడ కొనదేరిన ముక్కు, చురుకయిన కళ్ళు మంచి పదునయినవి. మాట్లాడినా, పనిచేసినా హుషారుగా మనమోహనంగా వుంటుంది. ప్రతికదలికా, ప్రతిభంగిమా ఆవిడ కళాచతురతను వ్యక్తపరుస్తూ వుంటుంది. లీలంటే స్త్రీ రూపం ధరించిన ఒక మెరుపు అన్నమాట.

ఆవిడకి తన స్త్రీత్వాన్ని గురించి అనుక్షణమూ స్ఫురణవుంది. ఆ స్త్రీత్వం దుర్బలమయినదికాదు. తన కటాక్షానికి గురయినవాణ్ణి తన చూపు దూసివేస్తుందనీ, అతి సులభంగా అతణ్ణి జయిస్తుందనీ ఆవిడకి పూర్తిగా తెలుసు.ఆవిడ తన సౌందర్యానికి ఉచితాలంకారాలు జోడించి, తన ప్రవర్తనకు సమయానుకూలమయిన చతురతా చలాకీ సమకూర్చి, తన ఆకర్షణను ద్విగుణీకృతం చేసుకోగలదు. ఆవిడ సాంగత్యంలో యౌవ్వనం సార్థకమయిందని పిస్తుంది. ఈ ఒక్కరోజులోనే లీల జయించేసింది. కాని ఆవిడ ఏనాడయినా జయింపబడుతుందా ?

ఇక ఈ కొత్త అమ్మాయి ! ఎంత నిర్మలమయిన, స్వచ్ఛమయిన ప్రకృతి ! మంచులో తడిసిన గులాబీ మొగ్గని ఉషఃకాలంలో చూసినట్లుంది. ఆ అమ్మాయి నడిచినప్పుడు అడుగుల చప్పుడువుండదు. తాబేలులాగ, తన అవయవాలని వినయమనే కవచంలో ఇముడ్చుకుని తిరుగుతోందనిపిస్తుంది. ఆ అమ్మాయి మాట్లాడితే ఎలా వుంటుందో వినాలని వుంది. కాని సమక్షంలో ఎప్పుడూ మాట్లాడనే మాట్లాడదని పిస్తోంది. ఈవేళ కొత్తగా వచ్చింది కనుకకాదు; కాని నాజన్మపొడుగునా నాతోనేవున్నా మాట్లాడ్డానికి సంకోచించకమానదు. ఎన్నాళ్ళయినా, వికసించని మొగ్గలాగే వుండిపోగలదు. బుద్ధిపూర్వకంగా పూర్తిగా వికసించి ఒకరికళ్ళ పడనే పడదనుకుంటాను. ఆవిడ పెదవులలో దాగివున్న అమృతమూ, ఆ కళ్ళూ, ఆ రెప్పలూ, ఆ విశాలమయిన నుదుటిమీంచి

పైకి దువ్విన శిరోజాలూ, ఒకేఒక భావాన్ని వ్యక్తపరుస్తున్నాయి. సంపూర్ణ శరణాగతం; త్రికరణశుద్ధిగా చేసిన ఆత్మార్పణ. ఆవిడ నోరు తెరచి ఒక్కమాటకూడా పలకకుండానే తన సందేశం ప్రియుడికి అంద చేయగలదు. "నేను మీదాన్ని: నాకు ఆధారంగా వుండండి; మీతోపాటే గాని నాకు వేరే జీవితంలేదు. నేను వెర్రిదాన్నే అవచ్చు. మీరు వివేక వతిగా చెయ్యండి. మీరు ఎటువంచితే అటేవుంటాను. మీ ఆత్మయొక్క ఆకారాన్నే పొందుతాను" ఈ శరణ్యభావంతోనే ఆవిడ భర్తను జయి స్తుంది. తనూ జయింపబడుతుంది. కాని ఆ సంగతి తనకీ తెలియదు.

లీలతో సహవాసం చేసినందువల్ల మనస్సుకి తృప్తివుంటుంది. కళోపాసనకి కృతార్థత వుంటుంది. కాని ఆ అమ్మాయితో కలసివుంటే ఆత్మకి పోషణవుంటుంది. సమరసంయొక్క ఆనందం వుంటుంది. వీటిల్లో చిరకాలం వుండేది ఏది ? ఎక్కువ ఆకర్షణీయంగా వుండేది ఏది ? వాడిపోకుండా వుండేది ఏది ? ఇప్పట్లో నేను ఏదీ నిర్ణయించుకో లేక పోతున్నాను.

లీల స్నానం ముగించి, అలంకరించుకోవటం మొదలుపెట్టింది. తార వంటింట్లో కూరల్లోనూ, పులుసులోనూ ఉప్పూ కారం వేస్తోంది. జయంత్ తల్లి తలుపు అవతల నుంచుని ఏ వస్తువు ఎక్కడ వున్నదో చెబుతోంది. అంతేగాని, లీలతో మాత్రం ఇటుపుల్ల అటువేయమని అయినా అనలేదు. లీలకి ఏమాత్రం ఇంగితంవుందో ఆవిడ చూస్తోంది. జయంత్‌కి ఈ పరిస్థితి అర్థమయింది. తనమట్టుకు తనకే అలాటి ఆలో చనలు కలుగుతున్నాయి. "లీలకి ఇంతబుద్ధి లేకుండా పోయిందేం ? తన తోటిదే ఒక అమ్మాయి ఇంత చాకిరీ చేస్తుంటే, తనుకూడా కాస్త సహా యం చెయ్యడానికేం ? అతిధిగా వస్తేమాత్రం రేపటినుంచి ఈ ఇంట్లో తనూ బాధ్యతగల మనిషే అవుతుంది కదా? ఆమాటకొస్తే, ఆ అమ్మాయి కేం అవసరం అసలు ? ఇంతకీ తనకీ ఆకలవుతుంది. అన్నం కావలసి

వస్తుంది అని తోచక్కర్లేదూ లీలకి ! ఈ ప్రవర్తన చూసి అమ్మ యే మనుకుంటోందో. "రేపు కోడలు అయి వచ్చాకకూడా కాపురం ఇలాగే తనకేమీ పూచీలేకుండా నడుపుతుంది కాబోలు! అట్లాఅయితే పెద్ద చిక్కేనే!" అనుకుంటుంది తప్పకుండా"

ఈ పరిస్థితి తనకే దుర్భరంగా వున్నందువల్ల ఇంట్లోకి వెళ్ళి, తల్లితో "నేనేమయినా సహాయం చెయ్యనా ఏమిటే అమ్మా!"అన్నాడు.

"నువ్వేం చెయ్యక్కర్లేదు లేరా. అన్నీ ఆ అమ్మాయే చూసుకుంటోంది. ఆ మాత్రం సమర్ధతవుందిలే" అంది తల్లి. ఆ పిల్లని గురించి తల్లి పలికిన ప్రశంసావాక్యాలు అతనికి పన్నీరులాగా, చల్లగా, పరిమళంగా తోచాయి.

అప్రయత్నంగా, అతిసహజంగా అతనికీ తారకీ చూపులు కలిశాయి. ఆ అమ్మాయి చటుక్కున రెప్పలువాల్చి అతన్ని చూడనట్టుగానే వుండిపోయింది. ఆ అమ్మాయి తనవేపు చూసినప్పుడు, తనకి కలిగిన ఆనందంకంటే ఆ అమ్మాయి అట్లా బిడియపడటం ఇంకా మనోహరంగావున్నట్టు తోచింది అతనికి.

మొట్టమొదట పెద్దవాళ్ళ పంక్తి భోజనానికి కూచుంది. విస్తళ్ళు వేశారు. జయంత్ వచ్చి, వాళ్ళకి వడ్డన పురమాయింపుకని ఒకప్రక్కగా కూచున్నాడు. తార పమిట నిండుగా కప్పుకుని, నడుముకి దోపుకుని వడ్డిస్తోంది. బిగించి కట్టుకున్న చీరకావటంవల్ల ఆవిడ అవయవాల నిమ్నోన్నతాలు చెక్కినట్లు స్ఫుటంగా కనుపిస్తున్నాయి. వంటింటి గుమ్మంలోంచి వస్తూ పోతూవున్న ఆ అమ్మాయిని చూస్తూంటే,ఏ అందమయిన అజంతా చిత్రమో రంగు మార్చుకుని సజీవంగా వచ్చి తమఇంట్లో తిరుగుతుందేమోననే భ్రాంతి కలిగింది, జయంత్‌కి. తలుపు వెనుకనుంచుని భోంచేస్తున్న వాళ్ళ విస్తళ్ళు గమనిస్తున్న తార, అప్పుడప్పుడు

జయంత్‌నీ గమనిస్తూనే వుంది. ఆ అమ్మాయికి జయంత్ సర్వవిధాలా నచ్చాడు. ఈ నాగరికంకల పిల్లవాడు ఇంకొకరికి భర్త గాబోతున్నాడనీ, తను అతనిమీద ఇష్టంపెట్టుకుని ఏమీ ప్రయోజనంలేదనీ తెలిసివుండి కూడా నిగ్రహించుకోలేక పోయింది. తను ఈ ఇంట్లోంచి వెళిపోయే వరకూ అతనలా నవ్వుతూ చలాకీగా తనయెదుట మసుల్తూంటే బాగుండు ననిపించింది. తను దైవాన్ని నిందిస్తూకూడా అతన్ని చూసి తృప్తిపడడం మానుకోలేకపోయింది.

ఈ మధ్యలో లీల నడవాలోకి వచ్చి, రెండు మూడడుగులు వంటింటివేపు వేసి, రెండుసార్లు తిరిగి వెళ్ళిపోయింది. జయంత్ ఆ భోజనాలగదికీ వంటింటికీ మధ్య తచ్చాడడం తనకేమాత్రం నచ్చలేదు. ఉత్త మోటు ప్రవర్తనకింద కనిపించింది. తను ఆ సాయంకాలం వెళ్ళి పోతుందే! అంతవరకూ జయంత్ తన చుట్టూనే తిరుగుతూ వుండాలని తనకున్న కోరిక న్యాయమయినదే ననిపించింది. ఘడియఘడియకీ తను రంగురంగుల చీరెలూ రవికలూ మార్చి కట్టుకుంటే చూసి, తన దేహ చ్ఛాయకు ఏ దుస్తులు ఎక్కువ రాణింపుగా వున్నాయో అతను చెబుతా డనుకుంది. అతను తనని అనుక్షణం మెచ్చుకుంటూ, తనమీది కాంక్షని క్షణం క్షణం వృద్ధిచేసుకుంటూ, చివరకి పట్టలేక తననేమయినా కోరతా డనీ, తను "చాల్లెండి, మరీ గారాబం ఎక్కువయింది మీకు" అని మంద లిస్తాననీ ఊహించుకుంది. అతను మోహపరవశంతో కంపిస్తున్న స్వరంతో "లీలా! నువ్వు రోజుకో ఉత్తరం రాయాలి సుమా!" అని ప్రాధేయపడతాడనీ, తను అతినిబ్బరంగా "యథామాం ప్రపద్యంతే" అని జవాబు చెబుదామనీ కల్పన చేసుకుంది.

"ఛ! జేష్ఠమాసంలో మొదటి ముహూర్తానికే పెళ్ళిచేసినా, ఇంకా 15 రోజులు ఓపికపట్టాలి! లీలా, ఇన్నిరోజుల విరహంవల్ల నేను మేఘ సందేశంలో యక్షుడిలాగ చిక్కి శల్యమయి పోతానేమో?" అని అతను

నిశ్వాసపూరిత కరుణారసం వ్యక్తపరుస్తాడనీ, తను అతన్ని ఓదారుస్తూ "మీరేం బెంగపెట్టుకోకండి. నేను మీ దగ్గరకు వచ్చేటప్పటికి మీకోసం అమృతం సేకరించి తీసుకువస్తాలెండి" అని జవాబు చెప్పాలనీ "ఆ అమృతం ఎక్కడ సేకరించి తెస్తావు....? ఇక్కడా ? అని తన అధరాన్ని మీటుతాడనీ కలలు కన్నది.

ఇలాంటివే ఎన్నెన్నో శృంగారభావాలు తన మనసులో రేగుతూ వుండగా, జయంత్ తన దగ్గిరలోవుండి కూడా దూరమయిపోవడం తన కసహ్యం వేసింది. నిజానికి అతనిమీద కోపంకూడా వచ్చింది. అతను బొత్తిగా రసికత్వం లేనివాడుగా కనిపించాడు. ప్రణయినియొక్క మధుర స్వప్నాలను కలచివేసిన కఠినాత్ముడనుకుంది. పెద్దవాళ్ళు అందరి భోజనాలు అయినతర్వాత, తనను రెండవపంక్తికి పిలవడానికి అతను మేడ మీదికి రాగానే "మీరు దగ్గిరుండి వడ్డన చేయించటం అంతా సలక్షణంగా ముగిసిందా ?" అని ఎత్తిపొడిచింది. "అదేమిటి లీలా ! ఇంటికి అతిథులు వచ్చారు. అందులో ఒకరు మీనాన్నగారు కూడాను. వాళ్ళకి లోటు పాట్లు జరగకుండా చూసుకోవద్దూ ? నాక్కూడా గృహస్థధర్మం అన్న బాధ్యత లేదూ మరి ?"

"అవునవును ! మాదొడ్డ గృహస్థ ధర్మంలెండి మీది ! అందర్నీ ఆదరిస్తారు గృహిణిని తప్ప. నాకు తెలుసులెండి ! మీ కా క్షాంకిణీ పూతనచుట్టూ తిరగాలని కోరిక. అంతే...."

"నిన్నటినుంచి ఈ క్షణంవరకూ నువ్వు చాలా తెలివయిన దాన వనుకున్నాను. ఇప్పుడు అందరి ఆడవాళ్ళతో సమానమయిపోతున్నావు నువ్వుకూడా. పద. ముందు భోజనానికి పద. తరువాత నీ అలక తీరుస్తాను. సాయంకాలంవరకు నిన్ను వదిలిపెట్టను. సరేనా ?"

లీల మేడమీంచి ముఖం ముడుచుకునే క్రిందకి దిగింది. జయంత్

తల్లి "చూడమ్మా! ఆ వంటకాలన్నీ మధ్యగా పెట్టుకుని ముగ్గురూ ఒకే సారి భోంచేయండి. నాకో విస్తట్లో వడ్డించి, గోదవార పడెయ్యి" అంది తారతో. కాని తార దాని కంగీకరించలేదు, "మీరందరూ భోంచేసినాక తింటానమ్మా నేను" అంది.

"అలా వద్దమ్మా! నువ్వు నిన్నటినుంచీ ప్రయాణంలో ఏమీ తినకుండా మాడుతున్నావు. అతిథిచేత పాము చంపించినట్లు, నా అవసరం గడుపుకున్నాను నేను. నువ్వుకూడా అందరితోనూ వడ్డించుకో."

"వద్దండీ, నాకు సిగ్గేస్తుంది."

జయంత్‌కి వడ్డించవచ్చు గదా అని ఒక విధమయిన ఉత్సాహమూ, తృప్తీ వున్నాయి తార మనసులో. జయంత్‌కి వడ్డించినప్పుడు అతని పంక్తిని కూచున్న ఆ వన్నెల విసనకర్రికూడా తను వంగి వడ్డించవలసి వస్తుంది కదా అని కొంత కష్టం కలగకపోలేదు. కాని ఆ బాధకంటే ఆనందమే ఆవిడను ఆవరించింది. వడ్డించేటప్పుడు తన ప్రమేయం లేకుండానే, జయంత్ విస్తట్లో నెయ్యి కొంచెం ఎక్కువ పడమాటా వాస్తవమే. ఆ విషయం జయంత్ తల్లి ఒకవేళ గమనించిందేమోనని మాత్రం ఆందోళన పడింది తనలో తనే.

తార చేసిన వంటలో ప్రతి పదార్థమూ రుచిగా కుదిరాయి. కాని చపాతీలు మాత్రం అంత ప్రశస్తంగా రాలేదు. అంచేత వున్న వాటిల్లో బాగా మెత్తగా వున్నవీ, బాగా కాలినవీ యేరి, జయంత్‌కి వడ్డించింది. అతని విస్తరిలో వడ్డిస్తున్నప్పుడు ఆవిడ సున్నటి, గుండ్రటి చెయ్యి ఒక చిన్న కంపం పొందటం జయంత్ గమనించాడు. అంచేత ఆవిడ మీద అతనికెంతో దయ పుట్టుకొచ్చింది. పాపం, ఆ అమ్మాయి కోమల హృదయం, అందుబాటులోలేని తన మీద ఆశపెట్టుకున్నట్టుంది. అంచేత నిరాశతో తపనపడిపోతోంది కాబోలు. ఆవిడమీద అతనికి ఎంతో సాను

భూతీ, కరుణా ఏర్పడ్డాయి. అతను తనలో తను 'నువ్వు ఒక్కరోజు ముందుగా వచ్చివుంటే' అనుకున్నాడు.

అసలు జయంత్ మనసు తారావేపు మొగ్గడానికి కారణం లీలే. లీల ఆ అమ్మాయిని అపహాస్యం చేస్తూ మాట్లాడ్డమే కారణం. తనకు కాబోయే అర్ధాంగి, జన్మపొడుగునా సహధర్మచారిణిగా ఉండవలసిన అమ్మాయి. తన జీవితంలో 'కార్యేషుదాసి, కరణేషు మంత్రీ'గా మూర్తీభవింపబోయే లీల; ఇప్పుడు తన పక్క దర్జాగా తనతోపాటు విందుకు కూర్చుంది. శాశ్వతమయిన నిరాశతో, నాలుగు గడియల్లో ఇల్లు వదలి వెళ్ళిపోవలసిన తార తనచేత ఇంకో రెండుముద్దలు యెక్కువ తినిపించాలని తాపత్రయ పడుతోంది.

వడ్డన పళ్ళెంలో వున్న చపాతీలు ఒకేసారి లీల విస్తట్లో వడ్డించింది. అసలే రుసరుస లాడుతున్న ముఖాన్ని పైకెత్తి రోషంగాచూసింది లీల. అన్ని చపాతీలూ ఒకేసారి వడ్డించటం తన శ్రీమంతపు నాగరికతను అవమానించడమే ననిపించింది. మొఖం కందగడ్డలా చేసుకుని, "ఏమిటీ నాన్‌సెన్స్?" అంది.

నిండు విస్తరిముందు కూచుని ఆధరవులు అటూ ఇటూ తోసెయ్యడమూ, ఒకటి రెండు మాత్రం రుచిచూసినట్టు నాలికకు రాసుకోవడమూ, మిగిలినవి కోడి కిక్కురించినట్లు ఇటూ అటూ పడేసి రెండు మెతుకులు గతికి విస్తరిముందునుంచి లేవడమూ, శ్రీమంతుల లక్షణంగా అలవాటు చేసుకుంది లీల. ఏదో మహా అయిష్టంగా ఆ చపాతీ తన చేతితో పట్టుకుని రెండు మూడుసార్లు నొక్కి నొక్కి చూసింది. మళ్ళీ టపీమని విస్తరికేసి కొట్టింది. అందులో కాస్త పచ్చిగా వున్న భాగం ముక్కలుగా విరిచి విస్తరవతల పారేసింది. ఈ గీర్వాణపు చేష్టలు చూసి తన తల్లికి కోపం వస్తున్నదని తెలిసిపోయింది జయంత్‌కి.

అసలు తనకే కోపం వచ్చింది లీలమీద. చెంపమీద ఒకటిపెట్టి కింద పారేసిన ముక్కలన్నీ ఏరించి విస్తట్లో పెట్టిద్దామా అనుకున్నాడు కూడాను. ఆ లీల కున్న అపరిమిత గర్వమూ, తారకి అవమానం జరుగుతోందనే భావమూ అతన్ని చాలా బాధపెట్టాయి. అయినా ఊరుకున్నాడు. కాని అన్నం పరబ్రహ్మ స్వరూపం అని విశ్వసించే జయంత్ తల్లి మాత్రం మౌనంగా వుండలేకపోయింది.

"కష్టసమయంలో విస్తట్లోకి వచ్చినదాన్ని అమృతంగా పరిగణించాలి, తిని తృప్తిపొందాలిగాని, పారేసి తృప్తి చెందడం మంచిలక్షణం గాదమ్మా!"

పెద్దావిడ ఎంత సౌమ్యంగా చెప్పినా, లీలకు కోపంవచ్చిం( తనేదో తారని ఎగతాళి చెయ్యడంకోసమూ, తారకికూడా లోటుపాట్లున్నాయని నిరూపించడంకోసమూ ఆ చపాతీలు విరిచి క్రింద పారేసింది. వ్యవహారం చివరకు ఎదురుతిరిగి తనమీదే విరుచుకుపడింది. లీల తక్షణమే ఆకు పక్కకి జరిపి, పీటమీంచి లేచింది. గబగబా వెళ్ళి చెయ్యి కడుక్కొని పుక్కిలించి, బాణంలాగ తన తండ్రిగారి గదిలోకి పరుగెత్తింది.

జయంతూ, అతని తల్లీ ఒకరివే పొకరు చూసుకున్నారు. తార మట్టుకు నిశ్చేష్టురాలై అలా నిలుచుంది. లీలకి జయంతే తనకు భర్త కావాలనుంది. కాని తనకు కావలసింది జయంత్ మట్టుకే; అతని తల్లీ తండ్రి ఆమెదృష్టిలో పరాయి మనుష్యులు. తన సంసారంలో వాళ్ళెవళ్ళకీ పల్లెత్తుమాట అనడానికి అధికారం లేదు. ఆమాటకొస్తే, జయంత్‌కి తనకూ సమాన హక్కులు కలవనే కండిషను పెట్టుకునే జయంత్‌కి భర్తృత్వ పదవి చెలాయించటానికి అనుమతి ఇచ్చేది. సంసారం ఏర్పడ్డాక జయంత్ తనను ముద్దుమురిపము చెయ్యవచ్చు; తన సరదాలు తీర్చ

కోవచ్చు. కావలిస్తే 24 గంటలూ తనకొంగు పట్టుకు తిరగవచ్చు-అంత వరకే అతని హక్కు.

తన కూతురు కాళ్ళు తొక్కుకుంటూ అతి కంగారుగా వచ్చి, ముఖం చేతులతో కప్పుకుని ఏడుస్తోందని కనిపెట్టగానే తన ముఖానికి అడ్డంగావున్న వార్తాపత్రిక ప్రక్కన పడేసి, పడుతూ పడుతూవున్న మాగన్ను వదుల్చుకుని, పడక కుర్చీలోంచి లేచి విట్టాగ్గా కూచున్నాడు, సాంగ్లీ జమీందారుగారు.

గారాబంగా కూతురి వెన్ను నిమురుతూ"ఏమయిందమ్మా!ఇంతలా ఏడవటానికి ?" అని పరామర్శించాడు. తండ్రికి మాగన్ను పూర్తిగా వదలి తనమీదనున్న మమకారం సర్వమూ మేలుకున్నదని రూఢి చేసుకున్న తర్వాత "ఆయన తల్లిగారు నన్ను చాలా అవమానం చేసింది" అన్న వాక్యం ఒక పది వెక్కిళ్ళతో కలిపి బరువుగా పలికింది.

ఇంకేముంది? ఇక సాంగ్లీ జమీందారుగారు తమ ప్రతిష్ఠ కాపాడు కోవలసి వచ్చింది. ఆయన సాతేగారిని పిలిచారు. సాతేగారు గదిలోకి ప్రవేశించారు. వస్తూ వస్తూనే తనకాబోయే కోడలు, కైకేయిలాగ గునుస్తూ మూతిముడుచుకుని అక్కడే నుంచుని వుండడం గమనించారు. కాని అందుకు కారణం ఏమిటనేదే తెలియలేదు. ఆ సందేహం సాంగ్లీ జమీందారుగారు వెంటనే తీర్చేశారు.

"మా అమ్మాయికి మీఇంట్లో అవమానం జరిగింది. ఇలా అయితే నాకూ పనికిరాదు; మా అమ్మాయీ సహించదు. అమ్మాయి చదువుకున్నదీ, స్వాభిమానం కలదీని. నేను మీరు పెట్టిన షరతులన్నీ ఒప్పుకున్నాను. కట్నాలూ, కానుకలూ, పట్టుబట్టలూ,లాంఛనాలూ మీరు చెప్పిన ప్రకారం ఇస్తానని ఒప్పుకున్నాను. ఇంకో అయిదువందలో, వెయ్యో యెక్కువ కావాలంటే అడిగి తీసుకోండి. అంతేగాని మా అమ్మాయి

గౌరవానికీ, స్వాభిమానానికీ మాత్రం ఏ విధమయిన కొరతా రాకూడదు. అసలు మా అమ్మాయికి, వాళ్ళ అమ్మమ్మగారి తాలూకున వచ్చే వార సత్వపు ధనం బోలెడు తీసుకు మీ ఇంటికి వస్తోందని ముందరే స్పష్టం గా చెప్పాను మీకు. మీ షరతులన్నీ పాలించి ఇంతటి సిరిసంపదలతో మా అమ్మాయిని మీ ఇంటికి పంపుతున్నప్పుడు, నేను కోరిన ఒక్క షరతు మీరు మన్నించాలి. మా అమ్మాయిని మీఇంట గౌరవంగా చూడాలి" ఈ మందలింపు చదివి ఆయన తక్షణం తన కూతురివైపు తిరిగి, గారాబంగా వెన్నతట్టడం మొదలెట్టాడు. సాతేగారికి ఈ గడప దాటి లోపలకు వచ్చిన కామధేనువు ఒక్క తన్నుతన్ని వెళ్ళిపోతుందా ఏమిఖర్మ అని భయం పట్టుకుంది. ఆయన వంటింటివేపు వెళ్ళాడు తొందర తొందరగా.

"ఏమిటేవ్! ఏమిటిలా ప్రారంభించావు? ఆ అమ్మాయి ఇంకా కోడలు కాకముందే నీ కోడంటికం చెలాయిస్తే ఎలా? మా బాగావుంది!" జవాబు చెప్పాలనుకుంటే ఆవిడకూడా కావలసినంత గ్రంథం విప్పేదే! కాని పరిస్థితులూ, తత్వాలూ వడబోసిన మనిషి గనక, అప్పటిమట్టుకు గుట్టు కాపాడుకోవటం మంచిదని నోరెత్తకుండా వూరుకుంది.

సరిగ్గా అదే సమయంలో తార వడ్డన పూర్తి చేసుకుని నోటికి ముద్ద ఎత్తుతోంది. సాతేగారి మాటలు విన్నాక తారకి కళ్ళు నిండి పోయాయి. అన్నం నోటి కెక్కలేదు. సాతేగారు వెళ్ళిన తర్వాత "నువ్వెందుకమ్మా కంటతడి పెడతావు? సావిట్లో ఏం జరుగుతుందో జరగనీ, నీకనవసరం. నువ్వు నిశ్చింతగా భోంచెయ్యమ్మా!" అంది.

"నాకు చపాతీలు చెయ్యడం చేతగాకపోవడం మూలాన ఇంత గొడవ జరిగింది. నేనుమాత్రం ఏం చెయ్యను చెప్పండి? నాకు గోధుమ చపాతీలు అలవాటులేదు. మా ఇంట్లో మేం బాకిరీ (రాగిరొట్టె) లే చేస్తు ఉంటాం"

"పోనీలేమ్మా! నువ్వు మనసు కష్టపెట్టుకోవటం ఎందుకు? ఇబ్బంది గడిపి, మరువలేని ఉపకారం చేశావు"

జయంతుకూడా సరిగ్గా అలాగే అనిపించింది. ముక్కూమొఖం ఎరగని పరాయిపిల్ల వచ్చి, ఇంట్లో వచ్చిన ఇబ్బంది ఆదుకుని, ఎంతో శ్రద్ధగా శ్రమపడి షడ్రసోపేతంగా వండి వడ్డించింది. చిట్టచివరికి ఆ లీలయొక్క ముక్కోపంవల్ల, విస్తరి దగ్గిర కూచున్న తార ఒక్కముద్ద నోటపెట్టకుండా విస్తట్లో కళ్ళనీళ్ళు కార్చుకుంటూ కూచోడం ఎంత దుస్థితి! లీల తండ్రిగారు తన తండ్రిగారితో మాట్టాడినప్పటి కటు వయిన స్వరం తనూ విన్నాడు. తనతండ్రి ఆయన ఎదుట తల వంచుకు నుంచోడమూ చూశాడు. ఆ నంగనాచి లీల ఇంకా కూనిరాగాలు తీస్తూ తండ్రి గదిలోనే వుందనికూడా తనకి తెలుసు. వసారాలో సోనూమామా ఖిన్నుడై కూచున్నాడు. తమ రాకవల్లనే యీ ఇంట్లో ఇన్ని గొడవ లొచ్చాయని చికాకు పడుతున్నాడు. తార రెండు మెతుకులు నోట్లో వేసు కుని, ఇల్లంతా శుభ్రంచేసి నడవాలోకి వచ్చేటప్పటికి తమ మూటాముల్లె సర్దటం పూర్తిచేశాడు సోనూమామా. తార భరిణిలోంచి కుంకంతీసి పెట్టు కుని వెళ్ళొస్తానని చెబుతూ సాఠేగారి భార్యకి నమస్కారం చేసినప్పుడు ఆ పెద్దావిడ ఆశీర్వాదం పలికేముందు కళ్ళు తుడుచుకోవాల్సి వచ్చింది. జయంత్ వసారాలో నుంచున్నాడు. సోనూమామా మెట్లు దిగటం ఆరం భించాడు. ఇంకో క్షణంలో తారకూడా దిగుతుంది.

కాని తారకి వళ్ళంతా మొద్దుబారినట్టయిపోయింది. నడక చురు కుగా సాగలేదు. ఒక్కసారి తలఎత్తి జయంత్‌వేపు నిబ్బరంగా నిస్సం కోచంగా చూడాలనిపించింది. తక్షణమే వాళ్ళ దృష్టులు కలిసిపోయాయి. లీనమయిపోయాయి, అలాగే నిలిచిపోయారు. ఇదివరలో ఆవిడ అంతః కరణనిండా ఆవరించిన ఆత్మసమర్పణ ఆక్షణంలో ఘనీభవించి, ఆవిడ కళ్ళల్లో కేంద్రీకరించి నట్టనిపించింది జయంత్‌కి. పున్నమి వెలుతురులో

చంద్రికాంత శిలకరగిపోయినట్లు,ఆవిడ నిశ్చలదృష్టిలో తన హృదయం కరగిపోతున్నట్లు తోచింది. తార తన నిశ్శబ్దమయిన భాషతో కళ్ళతోటే తనతో మాట్లాడుతున్నట్ట నిపించింది.

"నేను వెళుతున్నాను. కాని నా దేహంమట్టుకే యిక్కణ్నించి వెళ్ళిపోతోంది.నా మనసు నాతో రావడానికి ఒప్పుకోవడంలేదు. ఆ మనసుతోపాటు శరీరంకూడా యిక్కడే వుండిపోగల్గితే బాగుండిపోయేది. ఈ యింటివారు కోడలుగా తెచ్చుకునేపిల్ల మిమ్మల్ని సుఖపెట్టదు. మీ శయ్య ముళ్ళకంప చేస్తుంది. ఆ లక్షణాలు నాకు తెలుసు. నేనామ్మె యంత చదువుకోలేదు. కాని,నాకే యీ యింట కాపురంఏర్పడివుంటే నా పంచప్రాణాలతో మీ అడుగులకు మడుగులొత్తేదాన్ని మీ కే విధమయిన బాధ,వ్యథ కలిగినా,నా బుజాలమీద మోసేదాన్ని మీయిల్లు బంగారం చేసేదాన్ని; కాని నాకా అమృతసిద్ధియోగం తప్పింది. కాని, ఒక్కప్రశ్నకు జవాబు చెబుతారా? నేనే మొదట వచ్చివుంటే నన్ను స్వీకరించి వుండేవారా?"

జయంత్ తన ఆలోచనా సమాధిలోనుంచి బయట కొచ్చేటప్పటికి తార మెట్లుదిగి. గేటుతెరచి. తన తండ్రితో నడచి వెళుతోంది. ఇంతవరకూ యిక్కడేవుందికదా, యింతట్లో అంతదూరం యెలా వెళ్ళిపోయిం దనిపించిం దతనికి,అతను ఒక్కక్షణంసేపు కలవరపడి అమాంతంగా "అమ్మా! అమ్మా! తిరిగిరమ్మని పిలవ్వే. వాళ్ళిద్దరినీ పిలు! వెళ్ళిపోవలసిన సంబంధం అదికాదు. పిలవ్వే అమ్మా!" అన్నాడు.

"సరిగ్గా నా మనసులో వున్నమాటే అన్నావురా నాయనా!" అంది జయంత్ తల్లి ఉప్పొంగిపోతూ, "అయితే పిలుమరి. యిప్పుడు నువ్వూనేనూ ఓ పక్షం.ఏ పక్షంచెప్పు? వధువుపక్షం. ఇప్పుడా వధువు తరపున మనమొక మహా సంగ్రామం చెయ్యాలి" జయంత్ ఈ మాటలు

చాలా బిగ్గరగానే అన్నాడు. చీరకొంగు చేతికి చుట్టుకుంటూ తండ్రిగదిలో వున్నలీలకి యీ మాటలు వినిపించి, చెవిలో సీసం పోసినట్టయింది. తక్షణం బయలుదేరి చరచరా బయటకు వచ్చింది. జయంత్ కేసి చూస్తూ అతనిదృష్టితో మేళవిద్దామని ప్రయత్నించింది; కాని, అతని దృష్టిలో యిప్పుడు మార్దవం యేమీలేదు. కంటకంలాంటి వాడి కాఠిన్యం మట్టుకే వుంది.

# వేసవి గాడ్పు

మఘాదవ ఝూము నడుస్తోంది. మాఘమాసం గడుస్తోంది. కిటికీ దగ్గిర పరిచిన గొంగళీమీద పడుకుని వున్నాను. నీలంగా, స్వచ్ఛంగా వున్న ఆకాశపు పీలికకాస్త ఆ కిటికీలోంచి కనిపిస్తూంది; దానివేపేచూస్తూ అలా పడివున్నా నాగదిలో బయట ఆకురాలుకాలం సగంశుష్కించిపండి పోయి. పాలిపోయిన ఆకుల్ని కొన్నిటిని నా కిటికీవేపు ఎగరగొట్టి, తరిమి ఆడిస్తోంది గాలి. దాని ఇష్టంవచ్చినప్పుడు ఎక్కడెక్కడికో తీసుకెళ్ళి పారేస్తోంది వాటిని. నాన్నగారూ ! నే నలా పడివుండే ఏమేమిటో ఆలోచిస్తున్నాను.

దురదృష్టమనే ఈదరగాలి నన్నుకూడా ఇలాగే కొన్నాళ్ళు ఎగరేసి ఎగరేసి, ఆఖరికి తీసుకొచ్చి ఇక్కడ పారవేసింది. అంతా కలిసి ఒక్కసంవత్సరం పట్టలేదు పూర్తిగా. కాలచక్రం ఒక్కచుట్టు తిరిగిందంతే ! పోయిన మాఘమాసంలో నేను మీ గడపదాటి ఇవతలకి వచ్చాను. కుగ్రామంలోవున్న పుట్టిల్లు వదిలిపెట్టి, బస్తీలోవున్న ఒక వర్తకుడి కోడలయి అత్తవారింటిని ఆనందింపచెయ్యడానికి వచ్చాను. నాలుగు నగలు మెళ్ళో వేసుకుని కొన్నాళ్ళు కులికాను. నా జీవితంలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమయింది. ఒక కొత్త ఆనందం ఉదయించింది.

మళ్ళా ఇప్పుడుకూడా మాఘమాసమే. కాని ఇప్పుడు నే నెక్కడ వచ్చిపడ్డాను ! ఎలాటి అవస్థలో వున్నాను ! నాన్నగారూ, జరిగిందంతా మీ చెవిని పడ్డదా ? బహుశా లేదేమో : మీరు చెవుకు గుడ్డ చుట్టేసు

కున్నారు; కంటికి గంతలు కట్టేసుకున్నారు. కూతురిని గురించి ఇహ ఎన్నడూ ఆలోచించనే కూడదని నిశ్చయం చేసుకున్నారు. ఆ ఇంటికి వచ్చికూడా, అత్తింటవున్న కూతురి మొఖమయినా చూడకుండా వెళ్ళి పోయిన తండ్రిని గురించి ఇంకే మనుకుంటాం! ఇంత సంబంధం లేకుండా వుండటం ఎలాసాధ్యం చేసుకున్నారు నాన్నగారూ? లోకంలో అందరు తండ్రుల మనోప్రవృత్తులూ ఇలాగే వుంటాయా ఏమిటి? "కన్నాం-కట్టబెట్టేశాం. చేతులు కడుక్కున్నాం. ఇంక దానిఖర్మం ఎట్టా అయితే అట్లాగా!" పుస్తకాల్లోనూ, పురాణాల్లోనూ కూడా సాధారణంగా మనం చదివేదీ ఇంతేగద! శకుంతలని అత్తవారింటికి పంపించివేశాక, ఆ తర్వాత ఆ పిల్ల చచ్చిందో బతికుందో కూడా కనుక్కోలేదు కదూ ఆ కణ్వ మహాముని! సీతను అరణ్యంలో వదిలేసినట్లు జనకమహారాజుకి తెలియనే లేదనుకోగలమా? ఏ సంబంధమూలేని వాల్మీకి తండ్రి అయ్యాడు ఆ సమయంలో. ఆ చూలింతరాలిని ఒక్కసారి చూడడాని కయినా రాలేదు ఆ జనకమహారాజు. నాన్నగారూ! మీరుకూడా అట్లాటి వారేనా?

కాని, ఏ వాల్మీకి లాటివాడూ దిక్కులేకుండానే అరణ్యంలో పడి పోయాను నేను. ఆ అరణ్యమే అనాలి అడవుల్లో మారుమూలగావున్న ఈ వూరిని. ఇంటోవున్నది ఒక ముసలావిడ, మా అత్తగారి మేనత్త. ఆవిడకి కూడా ఈ ప్రపంచమంటేనూ, బ్రతుకంటేనూ విసుగెత్తి పోయింది. నా స్వరూపంలో వచ్చి, తన గుండెలమీద ఒకరాయి పడిం దనే అనుకొంటోం దావిడ. అప్పుడప్పు డలాగే నోరుతెరచి వర్ణిస్తోంది కూడాను. ఇరుగుపొరుగు ఆడవాళ్ళందరూ నే నెవరో మహా నిగూఢ మయిన వృత్తాంతం కలదాన్నని అభిప్రాయపడుతున్నారు. మామూలు మాటల్లో అయితే నే నొక పీడనని వారి నిశ్చయం.

నాన్నా, నేను సీతామ్మవారి కాలి ధూళికి పోలనన్నమాట-నిజమే. కాని ఇప్పుడు నేనున్న స్థితిలో తడవ తడవకీ ఆవిడే స్మరణకు వస్తూంటుంది ఎంచేతో. ఆవిడ వెళ్ళి అరణ్యంలో పడినమాట నిజమే; కాని ఆ ఆశ్రిమంలో ఋషిపత్ను లందరూ ఆవిడ పక్కనే వుండేవారు. రాత్రింబగళ్ళు ఆవిడకి అండదండగా వుండేవారు. ఆవిడకే కాకుండా, ఆవిడ గర్భంలోవున్న పిండాలకికూడా వాళ్ళు మేలేకోరుతూ వుండేవారు. రాములవారు త్యజించారన్న దుఃఖం ఆవిడను పూర్తిగా ఆవరించుకోకుండా సంరక్షిస్తూ వుండేవారు. కాని, నాన్నగారూ! ఇక్కడ నాకెవరున్నారు? ఒక్కసారయినా వచ్చి కనిపించి వెళ్ళండి నాన్నా! నా ఇప్పటి స్థితిచూస్తే మీకు గుండెలు పగిలిపోతాయి. మీ ఇంట మొలిచిన లేత తీగె తీసికెళ్ళి యింకో ఇంటి పందిరిమీద పాకించారు. కాని అది భూమిమీద నాటుకోనేలేదు నాన్నగారూ! దాని వేళ్ళు భూమిలో నాటుకోలేదు. అది సరిగా పాతుకోలేదు. ఎవ్వరూ పాతుకోనివ్వలేదు. ఇది మన కళ్ళఎదుట కూడా ఎందుకుండడం అని, తీసుకొచ్చి ఈ అడివి గ్రామంలో, ఈ పాతయింట్లో నిర్దాక్షిణ్యంగా పారవేశారు మామగారు. నేను వాడిపోయాను; పాలిపోయాను; క్షణక్షణమూ క్షీణించిపోతున్నాను. ఉపేక్ష, అలక్ష్యమూ, అవమానమూ, ముందుముందే మవుతుందో అనే భయమూ, కలిస్తే ఒక ఆడదానికి ఎటువంటి దుర్భర పరిస్థితీ, ఎటువంటి దుఃఖాలూ ఏర్పడుతాయో అవన్నీ నాకు తటస్థించాయి. పోనీ చచ్చయినా పోదామా అంటే, ఆ దోవాలేదు నాకు.నా పొట్టలో ఇంకో ప్రాణి మెసులుతూంది.

నాన్నా, నా తెప్ప మునిగిపోతోంది! ఒక్కసారి దర్శనమిచ్చి వెళ్ళు, నా క్కడసారి దర్శనం. ఒక్కసారి నీ సమీపంలో-ఉహుఁ, నీ సమక్షంలో కూచోనియి నన్ను. నా నిట్టూర్పుల గాడ్పుకూడా నీకు సోకనంత దూరంగానే కూచుంటాలే! జరిగిన రామాయణమంతా వినిపిస్తాను నీకు. అసలైన సిసలైన నిజం అంతా చెప్తాను నీకు. ఏ విషయాలు ఏ

ఆడదీ తండ్రి దగ్గిరకూడా ప్రస్తావించడానికి బిడియపడుతుందో,ఆ విషయాలను కూడా వున్నదున్నట్టు చెబుతాను. ముక్కలయిపోతున్న నా హృదయాన్ని నీముందు పరుస్తాను. అంతా విని నువ్వుచెప్పు; అప్పుడు చెప్పు నువ్వు – "సంధ్యా, నువ్వీ తప్పు చేశావు, ఇక్కడ నువ్వు పొరపాటు చేశావు, ఇదీ నీ అపరాధం" అని నువ్వే నిర్ణయించు నాన్నా. నువ్వు విధించిన శిక్ష అనుభవిస్తానప్పుడు. నువ్వు నిర్ణయించిన ప్రాయశ్చిత్తం చేసుకుంటాను సంతోషంగా.

నే పుట్టి బుద్ధెరిగాక మీరు కంటతడి పెట్టడం రెండే రెండుసార్లు చూశాను. మొదటిసారి నేను బాగా చిన్నదాన్నిగా వున్నప్పుడు; నాకో పెద్ద విషజ్వరం వచ్చి ఏమవుతుందో అని అందరూ భయపడిపోయినప్పుడు; రెండోసారి నా వప్పగింతలప్పుడు, ఇప్పుడు మళ్ళీ ఒక్క సారి మీరు దుఃఖిస్తూంటే చూడాలని వుంది. ఎవళ్ళు ఏమన్నా, ఎవళ్ళు నన్నెట్లా చూచినా, మీరుగనక ఒక్కసారి కంటనీరు పెడితే, అప్పుడు లోకం అంతా ఏమనుకుంటున్నా మీరు నన్ను నిర్దోషిగా నమ్ముతున్నట్టు విశ్వాసం కుదురుతుంది. ఇహ ఆ తర్వాత నే నేమయిపోయినా లెక్కలేదు నాకు.

నన్ను అత్తవారింటికి పంపించిన తర్వాత,మనిల్లు బావురుమంటూన్నట్టనిపించింది మీకు. దిగాలుపడి కూచున్నారు నట్టింట్లో. నే నెక్కడయినా కంటపడతానేమోననే నాలుగు మూలలా వెతుక్కున్నారు. నా మాట వినిపిస్తుందేమోనని ప్రాణాలు చెవుల్లో పెట్టుకుని ఆలకించారు. ఉన్నపళంగా లేచి, బయలుదేరి మా అత్తవారింటికి వచ్చి నన్నొక్కసారి కళ్ళారా చూడాలని తహతహపడ్డారు, ఇదంతా మీరే చెప్పారు ఓసారి. అట్లాగే ఓసారి మా అత్తవారింటికి రానేవచ్చారు కూడాను, ఓసారి వచ్చాక ఇంకోసారి రావాలనిపించింది, కాని వియ్యంకుడింటికి తరుచుగా

వస్తూండడం బాగుండదనిపించి, మీ ఆవేశాన్ని అనేకసార్లు అణిచివేసుకున్నారు. *

నాన్నగారూ! మీరు మీ మనస్సుని చంపుకోవడం అప్పుడు మొదలెట్టారు. "ఇహ సంధ్య మన పిల్లకాదు, ఇకమీదట దానిమీది మమకారం తగ్గించేసుకోవాలి; లేకపోతే నిభాయించుకోలేం" అని అరికట్టుకున్నారు. నేను రెండోసారి పుట్టింటికి వచ్చినప్పుడు మీ మనసులో వచ్చిన ఈ మార్పు కొంత పొడగట్టింది నాకు. కాని మీ మమత అంత సులభంగా స్వాధీనంలోకి రాలేదు. అది తగ్గడానికి నిరాకరించింది. అంచేత మీకు నెమ్మదిలేకుండా పోయింది. అప్పుడిక నన్నే మాటిమాటికీ పుట్టింటికి రప్పించడం ప్రారంభించారు మీరు. నన్నొక్కదాన్నే కాదు, నాతోపాటు మీ అల్లుడుగారిని కూడా రప్పించటం ఆరంభించారు.

పిల్లదాన్ని పిల్చుకురావాలన్న ఉద్దేశ్యం కలిగాక, కారణం ఏదో ఒకటి కనిపెడుతూనే వుండేవారు. ఒకసారి సంకురాత్రి పండగ అనీ, ఇంకోరోజు తోటలో పదిరకాల మామిడిపళ్ళు కొత్తకాపు దింపామనీ, మరోరోజున, మంగళగౌరీ వ్రతం కొత్తదంపతులు మాఇంట్లో నోచుకోవాలనీ, ఇట్లాగే ఒకటి చెల్లగా ఒకటి చెప్పి పిల్చుకుపోతూ వుండేవారు, కూతుర్నీ అల్లుడిగారినీని. మీ దృష్టికి వాళ్ళు లక్ష్మీనారాయణులల్లేనే కనిపించేవారు. నా ముఖంమీద తాండవించే సిగ్గూ,భయముతో కూడిన భావాల్నీ నా బెదురు బెదురు చూపుల్నీ చూసీచూడనట్టు గమనించి తృప్తిపడుతూ వుండేవారు. మామిడిచెట్టుని చుట్టబెట్టి వదిలిన మీ మాలతీ లత ఏమాత్రం గాఢంగా చుట్టుకుందో, ఎంతగా ఎదుగుతోందో, ఎలా వ్యాపిస్తోందో అంచనా వేసుకుంటూండేవారు. కూతురి మూలంగా అల్లుడుగారు మీకు ఇష్టుడయాడో, లేక అల్లుణ్ణి చూడాలని వుండటంవల్ల కూతురిని

---

* మహారాష్ట్ర సంప్రదాయం ప్రకారం వధువు తండ్రి, తన కూతురు బాలింతరాలయితేగాని వియ్యంకుడి ఇంట భోజనం చేయడు.

కూడా తీసుకొచ్చేవారో అర్థమయ్యేది గాదు నాకు. ఆ అల్లుణ్ణి అంత గారాబంగా చూసేవారు మరి....

మరీ లేతదిగా వున్నప్పుడు కాయలుకోస్తే, కొబ్బరిచెట్టు పాడయి పోతుందని నీ కో నమ్మకం వుండేది. ఎవరయినా వచ్చి ఒక్క-బొండం ఇమ్మని అడిగితే నువ్వు ముఖం చిట్టించుకునేవాడివి.కాని అల్లుడు ఇంటికి వస్తే ఒక గెలకి గెల బొండాలు దింపించేవాడివి. ఎంత ఆనందంగా దింపించేవాడివో నేను కనిపెడుతూనే వుండేదాన్ని. అందుచేతే, నీఒక్క-గాని ఒక్క- కూతురి విషయంలో ఇంత క్రూరంగా అయిపోతావని నే నెన్నడూ ఊహించలేదు. నువ్విలా అయిపోతావని కలలోకూడా అనుకో లేదు. అగ్రస్థాయిని అందుకున్నావు సుమా ! మొదట ఆపేక్షగా వుండటం లోనూ, ఇప్పుడు ఉపేక్ష చేయటంలోనూ కూడాను.

అంటే దాని తాత్పర్యం ఏమిటో నాకు తెలుసు. కూతురు నీ పరువు తీసేసిందని నీ అభిప్రాయం. మీ ప్రతిష్ఠ పాడుచేసిందని కని కరంలేని నల్లరాయివయిపోయావు. కూతురికీ ప్రతిష్ఠకీ మధ్య-ప్రతిష్ఠే నీ కెక్కు-వగా భావించుకున్నావు; పోనీ అలాగే కాని, జరిగిన సంఘట నలో నా బాధ్యత అసలు ఎంతమాత్రం వున్నదో కనుక్కో-నే అక్క-ర్లేదూ నువ్వు ?....

నా మనసులో క్షోభిస్తున్న ఈ మూగ ఫిర్యాదు. నీ చెవిని పడితే బాగుండునని, ఇప్పు డీ గాలితో చెబుతున్నాను. బారెడేసి కళ్ళు, విశాల మయిన నుదురూ, గుండ్రిటి చేతులూ, మైదానమంత వక్షస్థలమూ వున్న నా తండ్రి నాఎదుట కూచున్నాడు; కాదు, కాదు....నేనే ఆయన మోకా లికి తల ఆనించుకుని కూచున్నాను. అట్లా అని ఊహించుకుని, నా మనసులోమాట చెబుతున్నా నీ గాలితో.

నాన్నా ! అలా పుట్టింటికి మేము వస్తూపోతూన్న రోజుల్లో ఏ

సుఖమూ, ఆనందమూ అనుభవించానో అవే నా జన్మలో మంచి రోజు లకి ఆఖరనుకుంటాను. నా పెళ్ళయిన దగ్గిరనుంచీ ఆరోజువరకూ నా సంతోషం పొంగుకుంటూ వచ్చి నిండు పౌర్ణమి అయిపోయింది. ఆ తర్వాత హఠాత్తుగా అమావాస్య వచ్చేసింది. దీపావళి పండక్కి పుట్టిం టికి వచ్చామా, తిరిగి మా ఇంటికి వెళ్ళగానే నా సంతోషానికి గ్రహణం పట్టుకుంది. ప్రశాంతంగావున్న రాత్రిపూట పనులన్నీ ముగించుకుని, తెల్లటి దుప్పటి పరిచివున్న పక్కమీద హాయిగా విశ్రాంతి తీసుకుందా మని పడుకోగానే, ఇంటి కప్పుమీంచి బల్లి ఎదురు రొమ్ముమీద తప్పున పడ్డట్టయింది నా బతుకు.

నిజంగా బల్లే అది; తెల్లటి విషపు బల్లి. 'భోలా' అనే గొల్లవాడి కూతురు; కాళ్ళకి సింధీ దేశపు అందెలూ, చేతినిండా పచ్చబొట్లూ, రవిక అంచున రూపాయలతో చేసిన దండకడియాలూ "యిరకలీ" ప్రాంతపు నేతచీర కట్టుకుని నెత్తిమీంచి లాక్కున్న ముసుగూ, మాటల్లోనూ చూపుల్లోనూ పుట్టెడు పోకిరీతనమూ-ఇలాటి గుణగణాలతో రెండు పొద్దులా హాజరయేది మాఇంటికి. మాకో పెద్ద గమిడి గేదె వుండేది. కాని దానికి పాలు తియ్యడం ఆ యింట్లో ఎవరికీ చేతనయేదికాదు. "నీరూ" వచ్చి తీసేది. అప్పుడప్పుడు భోలా వచ్చేవాడు. కాని రివాజుగా అదే వచ్చేది. దాని అందెల చప్పుడు వినిపించగానే, పాలచెంబు పట్టుకు ఆయనే దానికంటె ముందు పశువులపాకలో ప్రవేశించేవారు. ఒకటి రెండుసార్లు అత్తగారు ఆయనతో అన్న మాటలు నా చెవిని పడ్డాయి కూడాను.

"నువ్వెందుకురా నాయనా వెళ్ళటం; పని పాడుచేసుకుని పశు వుల పాకలో నుంచోటం - కోడలు పితికించి తీసుకొస్తుందిలే."

దీనికి ఆయన చెప్పిన జవాబూ విన్నాను.

"అదికాదే అమ్మా. ఆ నీరూ వుందే. మా చెడ్డదగాకోరులే. పాలు తీస్తూ తీస్తూనే నాలుగు ధారలు నోట్లో పిండేసుకుంటుందేవ్ !"

ఎప్పుడయినా ఒకరోజున ఆయన కనుపించకపోతే,నీరూ తిన్నగా వచ్చి మా అత్తగారిని అడిగేది: "ఇయ్యాల చినదొరగా రేరీ మరి ? నా మీద కాపలా ఎవరు కాత్తారు గనకా ? పాలు పిండతా పిండతా తాగేత్తే ఎట్టా?...."

ఒక రకపు యాసతో మాట్టాడేది.అంచేత అది ఎక్కడో బెల్గాం ప్రాంతపు మనిషి అని సులభంగా తెలిసిపోయేది. ఇదీ, దీని తండ్రి భోలా, ఇంకా నలుగు రయిదుగురు ఆ జాతివాళ్ళు. ఆ కొండలు దాటి వచ్చి మావూళ్ళో నివాసం ఏర్పరుచుకుని, ఈ పాలవ్యాపారం చేస్తు న్నారు. భోలా నీరూకి పెళ్ళి చేశాట్ట ఆ ఊళ్ళో. కాని అది మొగుణ్ని వదిలేసి, తండ్రివెంట కొండలుదాటి ఇటు వచ్చేసింది.

నేను అత్తవారింట అడుగు పెట్టిననాటినుంచీ చూస్తూనే వున్నాను దాన్ని. అదీ నా వేపు గుర్రుమని చూస్తూండేది. "నువ్వెట్టా చూస్తే నాకేమే చావుపీనుగా ? నాకు నీతో ఏం పని ? నీవల్ల నాకు పోయేది నల్లపూసంతయినా లేదు."

కాని నే పూర్తిగా పొరపాటు పడ్డాను—నా జీవితానికి జీవమయిన నా నల్లపూసలే దాని దగ్గిర చిక్కడి పోయాయి. ఆ సంగతి నాకు చాలా రోజులయాక తెలిసివచ్చింది నాన్నగారూ ! నే నదో తరహా మైకంలో వుండేదాన్ని. ఎంతో నమ్మకంతో వుండేదాన్ని. ఎంచేతంటే, నా భర్తని ఏరింది నువ్వు. నీ అంచనాలోనూ ఎంపికలోనూ, తప్పు జరగదని నాకు చాలా గట్టి నమ్మకం. ఓసారి ఆయన్ని గురించి ఎంత, ఎలా వర్ణించావో నా కింకా జ్ఞాపకం వుంది.

"అమ్మాయీ, సంధ్యా ! నీకో సత్యవంతుడి వంటి భర్తను

తెచ్చానమ్మా" అన్నారు. నేనూ ఆయన్ని ఆ దృష్టితోనే చూసుకుంటు న్నాను. భక్తితోటీ, ఆదరంతోటీ ఆయన్ని ఆరాధిస్తున్నాను.

కాని నాన్నగారూ, ఇంతటి మీరు, వ్యవహర్తలూ ఇంత ప్రపంచ అనుభవం వున్నవారూ, అయినా ఈ విషయంలో మాత్రం పొరపాటు పడ్డారు సుమండీ! పూర్తిగా మోసపోయారు. కన్నకూతురికి సంబం ధించిన ఇంతటి ముఖ్య విషయంలో పొరపాటు పడడం అంటే, ఆజ న్మాంతమూ బాధపెట్టే వాత పెట్టుకోవడమన్నమాట.కాని చివరకి మనిద్ద రకీ ఆ గతే పట్టింది. "కర్పూర మనుకున్నది కలరా వుండయింది,తులసీ దళం అనుకున్నది గంజాయి ఆకు అయింది."

ఆ రోజున కార్తీక పౌర్ణమి. సూర్యడస్తమిస్తూండగానే చంద్రు డుదయించాడు.స్వచ్ఛమయిన నీలి ఆకాశంలో వెన్నెల విప్పారుతోంది. చంద్రుడు సృష్టిమీదంతటా సమృద్ధిగా పాలు చిలుకుతున్నాడు. హృదయ సరోవరంలోఉన్న ఆశా కమలాలన్నీ ఒక్కసారి వికసిస్తు న్నాయి. నేను కార్తీక దీపాలు పెట్టడానికి బయలుదేరాను. మొట్ట మొదట దీపమూ, హారతీ పట్టుకుని పెరటిలోఉన్న తులసికోట దగ్గిరకి వచ్చాను.

ప్రార్థనచేసి, ప్రదక్షిణం చేసి, దీపం అక్కడ పెట్టాను. ఇంకా కొన్నిచోట్ల దీపాలు పెట్టిరావాలి. ఒక ప్రమిదలో దీపం వెలిగించి, జ్యోతికి గాలి తగులకుండా చేయి అడ్డంపెట్టి, పశువుల పాక దగ్గిరకి వెళ్ళాను. కొట్టంలో అంతా అంధకారమయంగా వుంది. ఆ అంధ కారంలో గుస గుస లున్నాయి. ఆ గుస గుసల్లో పాపం వుంది.

పశువుల పాక పై భాగం మీదంతటా తెల్లటి పౌర్ణమి వెన్నెల. పాక లోపల అమావాస్య యావత్తూ గూడుకట్టుకుంది. నేనా ప్రదేశం కూడా వెలుగుతో నింపాలని వెళ్ళాను. కాని....నా చేతిలోవున్న దీపం

ఆరిపోయింది. పాకలోని అంధకారం నాలోకూడా ప్రవేశించింది. కాళ్ళు వణికిపోయాయి. గుండెల్లో బాకు గుచ్చినట్టయింది. అట్లాగే వెనక్కి తిరిగి వచ్చేశాను. ఇంట్లోకి వచ్చి చెరగులో ఏడ్చాను. ఆ నీరూ, పాలు పితకడం ఏమిటో, ఈయన పారా వుండట మేమిటో స్పష్టంగా అర్థ మయింది.

ఆ రాత్రింతా ధుమ ధుమ లాడుతూనే వున్నాను నేను. దొరికి పోయిన దొంగ, "అబ్బే అదేంకాదు. అట్లాంటిదేం లేదు !" అని దబా యించి, నన్నో పాలుతాగే పిల్లని మరిపించినట్లు మరిపించటానికి ప్రయ త్నించారు. కాని కాసేపటికి నే నంత వెర్రిబాగులదాన్ని కానని ఆయన కర్థమయింది. ఇహ అప్పుడాయన వ్యూహం మార్చారు. సమదాయించ డం మానేసి కోపం తెచ్చుకున్నారు."నా విషయాల్లో ను వ్వనవసరంగా జోక్యం కలుగజేసుకోవలసిన అవసరంలేదు. నువ్వు జాగ్రత్తగా మసు లుకో. ఇంతకీ నీకేమీ లోపం జరగటంలేదుగా !" అని అదమాయిం చారు.

ఆ మాట వినేటప్పటికి నా కన్నీళ్ళు ఆగిపోయినాయి. బయ టికి ప్రవహించవలసినవి లోపల ఉప్పొంగి నా మనస్సుని ముంచేశాయి. ఆయన ఆ రాత్రి ప్రక్కమీద నాకు గజం దూరంలో వుండిపోయారు. కాని ఆయన అంత దూరాన్న వున్నా, నాకుమట్టుకు ఏదో కాలుతున్న గాడిపొయ్యి చేరువలో వున్నట్టనిపించింది. ఆయన గారి అవినీతి ప్రవ ర్తనకంటే, నన్ను ఎక్కువ బాధపెట్టిన విషయం ఏమిటంటే, ఆయన పెద్దగా కోపం తెచ్చుకుని, నవాబు దర్జాతో న న్నాజ్ఞాపించడం. ఆయన దర్పమే న న్నెక్కువగా గాయపరచింది. నా శోకమయ నాటకానికి నాంది ఈ విధంగా ప్రారంభమయింది.

ఆ రాత్రి మెలకువగా వున్నంతసేపూ ఇదే ఆలోచిస్తూ వుండి పోయాను.నీరూ స్వరూపంలో, నా సంసారానికి పట్టిన చీడపురుగుని ఏరి

పారెయ్యాలి. కాని యెట్లా ? అత్తగారితోనూ, మామగారితోనూ? ఛ ఛ! నా భర్త తప్పుని నేనే ప్రచారంచేస్తే ఆ అవమానం కూడా నాదే అవుతుంది. పుట్టింటికి వచ్చి నీతో చెబుదామా అనిపించింది. ఒక్క క్షణం. కాని యిది చెప్పుకోడానికి వీల్లేనిచోట లేచినరణం. ఎవరితోమాత్రం ఎట్లా చెప్పటం? ఎవరికీ తెలియకుండా ఈ వ్యాధి కుదుర్చుకో గలిగితేనే అందరి మాన మర్యాదలూ నిలుస్తాయి. ఆలోచించగా, ఆలోచించగా ఒక్క వుపాయం తట్టింది. తెల్లారకముందే నిద్రలేచి లోపలియింట్లోకి వెళ్లాను; పాలచెంబు చేత్తోపట్టుకని అత్తగారి దగ్గిరికి వెళ్ళాను.

"మీరొకసారి పశువులపాకకి వస్తారా నా తోటి?"

"ఎందుకే ?"

"ఇవ్వాళ ఆ బర్రెపాలు నే తీస్తాను."

"నువ్వా ?"

"అవును. నాకు పుట్టింట కొంత అలవాటుందిలెండి. బర్రెని పెంచుకునేది మనము, కాని పాలకోసం ఆ నీరూమీద ఆధారపడి వుండటమూను. దాని యిష్టం వచ్చినంత ఆలస్యంగా వస్తుంటుంది పైగా. మనం నిన్న రాత్రి తీసిన పాలతో పొద్దున్న టీ తాగటమూను. ఎందుకొచ్చిన అవస్థ మనకి ?"

నా మాటలు విని అత్తగారు మనసులో ఆనందించారని ముఖం లోనే తెలిసిపోయింది. ఆవిడ నాతోకూడా బర్రె దగ్గిరకి వచ్చింది. ఆవిడని బర్రెముందు చెట్టుదగ్గిర వుండమని చెప్పి, నేను పొదుగు దగ్గిర కూచున్నాను. నీరూ తీసినంత చురుకుగా కాకపోయినా, మెల్లిమెల్లిగానే పాలు పిండటం ప్రారంభించాను. కూజా బిందంత పొదుగునుంచి పాలు పితికే లోపల నాకు ముఖం అంతా చెమటపట్టింది ముంగురులు ముఖానికి అతుక్కుపోయినాయి. కాని నేను కసితో దహించుకు పోతున్నాను.

పట్టుదలలో పని చేస్తున్నాను. ఈపూట ఈపని నేను సవ్యంగా చేసేస్తే సీరూకి స్వస్తి చెప్పించవచ్చు. నురగతో పొర్లిపోతున్న పాలచెంబు అత్తగారి చేతి కందించినప్పుడు ఆవిడ సంతోషమూ అలాగే పొంగి పొర్లిపోయింది.

మే మిద్దరమూ పశువుల పాకనుంచి బయటికి వచ్చీ రాకముందే సీరూ వస్తూండడం కనిపించింది. ఆ బిందెలు మోగించుకుంటూ, బరువుగా అడుగులు వేసుకుంటూ, వళ్ళంతా తిప్పుకుంటూ, ఎదురుగా వచ్చింది మాకు. నురగలు కక్కుతూన్న పాలచెంబు దానికి చూపిస్తూ "ఇదిగో. ఇవాళ మా కోడలే తీసింది పాలు. నీకంటే ఓ గిద్దెడు ఎక్కువే పిండింది కూడాను. అంచేత ఇకమీదట నువ్విక్కడ పాదం పెట్టక్కర లేదు" అంది.

సీరూకి తోకమీద పాదం పడ్డట్టయింది, నాకేసి ఒక్కచూపు చూసింది. చూపు కాదది. రెండు కళ్ళలోంచీ విసిరిన బాకు. నేను దాని కూకటివేరు పెల్లగించేశాను. ఇకమీదట యేం మిషమీద మా ఇంటికి వస్తుంది గనుక ; నేను యుక్తిచేసి ఓడించేశాను దాన్ని.

ఆ దొండపండులాంటి పెదిమిలమీది వణుకుతో, ఆ తెల్లటి ముఖంమీది నిండు బుగ్గలమీద ఆవరించిన జేగురింపుతో, చటుక్కున చీత్కరించుకుని, బుసకొట్టుకుంటూ గిరుక్కున ముఖం తిప్పుకుని ఒడ్డూ పొడుగూవున్న ఆ జమిలి ఎముకల శరీరం వంకరటింకరులుగా వూపుకుంటూ, ఆ సీరూ అన్న పేరుగల తాచుపాము నాకళ్ళ ఎదటినుంచి వెళ్ళిపోయాక "అమ్మయ్య !" అనిపించింది నాకు.

ఈ వృత్తాంతం ఆయనగారికి తెలిసింది. ప్రేమా, ఆపేక్ష వున్న భర్తే గనక అయివుంటే "ఇవాళ నువ్వు తీసిన పాలు తాగే అదృష్టం కలిగింది" అని గారాబంగా చూసేవాడు భార్యని. కాని ఆయన చూపు

లోనూ, మాటలోనూ నన్ను మెచ్చుకున్నట్టే కనిపించలేదు. పైగా ముఖం మాడ్చుకున్నారు.

నేనింతటి పాతాళ యంత్రినని, నొప్పిగా వున్నచోట చటుక్కున వేడి జీడిగింజ పెట్టేదాన్ననీ ఆయన ఎప్పుడూ అనుకోలేదు. ఆయన నిన్నరాత్రి దర్పం చూపించినదీ అంచేతనే.ఆయన నీరూతో ఆ రీతిగానే ప్రవర్తిస్తున్నప్పటికీ నేను కనుబొమకూడా ఎత్తకూడదని శాసించటానికి ఆయన భర్తృత్వ అధికారమంతా నామీద ప్రయోగించారు.

కాని, నే నప్పటికిమట్టుకు అమాయకురాలిలాగా ఊరకుని. ఆ తర్వాత తగినమందు వేసేశాను.అదీ ఆయనకి నఖశిఖ పర్యంతం తాపం పుట్టించింది; నన్ను గట్టిగా కోప్పడ్డానికీ వీలులేకపోయింది.భరించటానికీ వీలులేకపోయింది. ఆ రోజు రోజంతా ఆయన నాతో సరేసరి, ఇంట్లో ఎవరితోనూ కూడా మాట్లాడలేదు. అత్తగారు అదంతా కనిపెడుతూనే వుంది. ఉడుక్కుంటే ఉడుక్కున్నారులే. అనుకున్నాను నేను. పైగా ఎంత తీవ్రంగా ఉడుక్కుంటే అంత తొందరగా చల్లారుతుందనుకున్నాను....

నేను సర్వవిధాలా ఉచితమయిన పనే చేశాను. కులస్త్రీ నడుచుకోవలసినట్టే నడుచుకున్నాను. అయినా ఆరోజు ఒక్కొక్క గడియ గడిచినకొద్దీ నాకు భయం ఎక్కువవుతూ వచ్చింది. న్యాయంగా నడుచుకున్నా, అన్యాయంగా ప్రవర్తించినా ఆయన మగవారు. అంచేత ఆ రాత్రి పడకగది తలుపు గడియవేస్తూంటే నాకు శరీరమంతా కంపించిపోయింది. ఆయన నాకు ప్రాయశ్చిత్తం చెయ్యడానికి అక్షింతలు కలిపే వుంచుకున్నారు. నావేపు వేలు ఆడిస్తూ "నువ్వు నీరూని ఇక్కడకు రాకుండా చేయగానే నాకూ దానికీ మధ్య సంబంధం తెగిపోయిందనే అనుకుంటున్నావా ఏమిటి?"

"నేనట్లా ఏమీ అనలేదే। కాని అది పాలుపితికే వంకమీద

మాత్రం ఇక్కడికి రా నక్కరలేదు. మీకంతగా కావలసివుంటే, మీ సంబంధానికి మీ ఇష్టంవచ్చిన పేరుపెట్టి దాన్ని బహిరంగంగా తెచ్చి ఇంట్లోనే వుంచుకోండి"

"తెచ్చి వుంచుకుంటే ఏంచేస్తావే నువ్వు ?"

"దీపం వెలిగించి మీ ఇద్దరికీ మంగళహారతి పడతాను !"

నాన్నగారూ, నా నోటికి వచ్చినట్టు అన్నేశాను. ఆయనా కోపం మీద వున్నారు; నేనూ కోపంగానే వున్నాను. ఆయనకి ఆ క్షణంలోనే తెలిసిపోయి వుంటుంది. "ఇహమీదట ఒక వరలో రెండుకత్తు లిమడటం మనకి సాధ్యంకాదు, మన భార్యగారు కొండమిరపకాయ; ఈవిడని సంతోషంగా వుంచాలంటే, ఆ నీరూ ద్యాస వదిలేసుకోవాలి" అని నిస్సంశయంగా బోధపడి వుంటుంది. కాని అవి ఆచరణలో పెట్టడము ఆయనకి సాధ్యంకాలేదు. దానిమీది వ్యామోహం ఆయన్ని పూర్తిగా వశం చేసుకుంది. మూసుకుపోయిన కమలంలో చిక్కుకున్న తుమ్మెదలాగా వుందాయన అవస్థ. సుకుమారమయిన ఆ రేకలని ఆయన అంత సులభంగా చింపివేయలేకపోయారు. కాని ఎంత కష్టపడి అయినాసరే, ఆయన ఆ మనోనిగ్రహం సాధించాలనీ, నన్ను క్షమాపణ వేడుకోవాలనీ, ఇకముందు నీతిగా, పవిత్రంగా వుంటానని వాగ్దానం చెయ్యాలనీ నా పట్టుదల. ఆయన అలా చేసినట్టయితే, నేను మనస్ఫూర్తిగా క్షమించి వుండేదాన్ని. జరిగిందంతా మరిచవుండేదాన్ని.

కాని, ఆయన నన్ను ఊరడించడానికి ప్రయత్నించలేదు. అంచేత మాకు మరీ ఎడమొఖమూ పెడమొఖమూ అయిపోయింది. రోజురోజుకీ, కొడుక్కీ కోడలికీ మధ్య ఏదో గట్టిగానే బెడిసిందని అత్తగారు కనిపెట్టారు. కొడుకుని పిలిచి అడిగారు. కాని ఆయన ఏం చెప్పగలరు ? అప్పుడిక నన్ను పట్టుకు వేధించారు అత్తగారు. కాని నేను మాత్రం

ఏమని చెప్పగలను ? ఆ తర్వాత అత్తగారూ, మామగారూ సంప్రతించు కున్నారు. అప్పుడు నేనే దోషినయి వుంటానని తీర్మానించుకున్నారు కాబోలు. ఎంచేతంటే, ఓ రోజున మామగారు కేకవేశారు నన్ను.

"కోడలా, ఇలారా : నా ఎదటికి రా !"

తలుపుచాటున వున్నదాన్ని విధిలేక ముందుకి వచ్చాను.

"ఏమిటమ్మా ఇదంతా, ఏమిటి నువ్వు చేస్తున్నపని ? ఆఁ ఏదో ఈ ఇల్లు ఉద్ధరిస్తావనీ, సంతోషంగా వుంచుతావనేనా నిన్ను కోడల్ని చేసుకున్నాం. మరి నువ్వు మా అచ్యుతంతో అలా మెసలుతున్నావేం ? ఆడవాళ్ళు భర్తల మాటలని మన్నించటమే మర్యాద. తెలిసిందా? మళ్ళీ నా దగ్గిరకి ఇలా వుంటున్నట్టు వార్త రాకూడదు. జాగ్రత్త.... !"

నాన్నగారూ, చూశారా ఈ అన్యాయం ? మామగారు దొంగని వదిలిపెట్టి సన్యాసిని దండించారు. ఆయన అభిప్రాయంలో నేనే ఏదో అపరాధం చేశానని. ఆ రాత్రికి నా ఏడుపుకి అంతం కనిపించలేదు. ఆయన నా దగ్గిరకి వచ్చి కళ్ళు తుడిచారు. వెన్నుమీద చేయివేసి నిమిరి సముదాయించారు. నా కాయనమీద వున్న కోపమంతా ఆ క్షణంలో మాయమయిపోయింది. నాలోని స్త్రీత్వం, అండలేక అల్లాడుతున్న స్త్రీత్వ మంతా ఆయన హృదయంమీద వాలిపోయింది. ఆయన పశ్చాత్తాప పడక పోయినా, నేను ఆయన్ని క్షమించేశాను. ఉహుఁ, అట్టా అనడానికికూడా వీల్లేదు. నిజానికి అసలు క్షమించడమనే ప్రసక్తిలేదు ఆ సమయంలో. ఆయన్ని ప్రశ్నలువేసి, పాపం చెయ్యానని చెప్పించి, పశ్చాత్తాపపడటు ఒప్పించి ఆ తర్వాత క్షమించాలనుకున్న స్త్రీ, ఆ క్షణంలో ఎక్కడికి అంతర్ధానమయిపోయింది. అక్కడ మిగిలిపోయినది, అన్నివిధాలా శరణార్థి అయిన, అబల అయిన స్త్రీ మట్టుకే.

కాని ఆ తర్వాత ఆశ్చర్యం ఏమినిచెప్పను నాన్నగారూ ! నడనే

గకపోయినా, ఆయన తన పవిత్ర నిశ్చయాన్ని నాకు చెప్పుకున్నారు. అది కూడా మాటవరసకుకాదు, హృదయపూర్వకంగా అశ్రుసాక్షిగా. ఇహ అప్పుడు నా బాధలన్నీ మరిచిపోయి, నేనే ఆయన కన్నీళ్ళు తుడవవలసి వచ్చింది. ఆ క్షణంలో నాకు నేనే బొత్తిగా పిచ్చిదాన్నేమో ననిపించింది; నేనే తప్పుచేశాననిపించింది. ఉత్తపుణ్యానికి నేనే ఈ గడచిన ఎనిమిది రోజులూ ఆయనతో విరోధంగా వుండిపోయా ననిపించింది.

ఆ రాత్రి ఆ నాలుగు గోడల మధ్యన్నే. వసంతఋతువు వ్యాపించేసింది. ఆయన ఒక పెద్ద మామిడిచెట్టు అయిపోయారు. మొదట్లో చుట్టుకునివున్న జాజితీగకి ఆకులుకంటె ఎక్కువగా చిరుతీగలు మొలచినయి. మామిడిచెట్టు అందిగదా : "దా! నిన్ను అనంగుడి వుద్యానవనంలోకి తీసికెళ్ళి ఉయ్యాల ఊపుతాను" జాజితీగ ఏమందంటే, కాని ఏమందో ఎవరికీ వినిపించలేదు. మనసులోవున్న మాట ఆ నవ్వుతూన్న పెదిమలమీదికి వచ్చి ఆగిపోయింది. నవ్వే మిగిలిపోయింది. ఇక ఆ కళ్ళల్లోని పావలు ఏం సమాధానం చెప్పాయో మరి.

ఆ మర్నాటినుంచీ ఇంట్లో వాతావరణం పూర్తిగా మారిపోయింది. నేను ఉల్లాసంగా తిరుగుతున్నాను. ఆయన పనీపాట చూసుకుంటున్నారు. మనం చేసిన మందలింపు బాగానే పనిచేసిం దనుకున్నారు మామగారు. ఆయన అహంభావం తృప్తిపడ్డది. 10, 12 రోజులు చిటికెలో గడిచిపోయాయి. అయినా, నాకు వినపించనేలేదుగాని బల్లిమాత్రం ఎక్కడో పలుకుతూన్నే వుంది. వాస్తు పురుషుడు భూగర్భంలో ఎక్కడో అశుభం వుందని హుంకరిస్తున్నాడు. నానోట కొట్టడానికి దైవం ఒక గుప్పెడు మట్టి పట్టుకుని బయలుదేరాడు. భవిష్యత్తంతా సుఖంగా గడుస్తుందని నాకు భ్రమకలిగించి, నాటకమాడి, హఠాత్తుగా నా అదృష్టం నన్ను విడిచి వెళ్ళిపోడానికి ప్రయాణం కట్టుకుంటోంది. నా సంసారంలోంచి నీరూకి ఉద్వాసన చెప్పేశా ననుకోవడమే నే చేసిన పెద్ద పొరపాటు.

దాని భౌతిక శరీరం చుట్టుప్రక్కల కనిపించలేదుగాని,అది గాలిగా మారి ఆయన్ని అంటిపెట్టుకునే వుంది. వేసిన వలరి తియ్యనిలేదు. జరిగేదేదో కనుమరుగుగా జరిగేపోతోంది. కాని ఒకరోజున దాని ఉద్వాసన ముద్ర ఆయన ముఖంమీద కనుపించింది నాకు. నేను కలవరపడి పోయాను. బారెడు ఎడంగా వుండిపోయాను. ఎంతో క్షోభపడిపోయాను. ఆయన అర్థం చేసుకున్నారు. నేను ఎట్టాటి నిప్పులు చెరిగేమాటలన్నా, అవి విని సహించడానికి నిశ్చయించుకున్నట్టు కనబడ్డారు. కాని నేను నోరెత్త లేదు. అనగలిగినంత కఠినమయిన మాటలు ఇదివరకే అనేశాను. నా బాధా, తిరస్కారమూ, క్రోధమూ అన్నీ అదివరకే ప్రదర్శించాను. ఇప్పుడింక మళ్ళీ అదే ఎక్కం చదవాలి—ఏం వుపయోగం?

ఆరోజునుంచీ మళ్ళీ నా వైఖరి పూర్వపుస్థితిలో పడిపోయింది. మౌనంగా తటస్థంగా మసలుతున్నాను. ఇట్లాగే ఇంకో 15 రోజులు గడిచి పోయాయి. ఇంట్లో వాతావరణం అంతా మళ్ళా చచ్చుపడిపోయింది. అత్తగారి నుదుటిమీద ముడతలు వెలిసినయి.మామగారి ముఖంలో ప్రశ్నార్థకం మొలిచింది. ఆయన ముఖంమీద పొగచూరిన కళ వ్యాపించింది. అత్తమామలు, భర్తంటే నా కిష్టంలేదని స్థిరపరచుకున్నారు. ఒకవేళ నా మనసు ఇంకెవరిమీదయినా....

అలాటి పరిస్థితులతోనే మార్గశిర మాసం వెళ్ళిపోయింది. పుష్యం వచ్చింది. అప్పుడు నే నుత్తమనిషిని కాదనికూడా తెలుసుకున్నాను, వాళ్ళకీ తెలిసింది. కాని పెద్దలయిన అత్తమామలు ఏ విధమయిన స్వాగత చిహ్నమూ ప్రదర్శించలేదు. వాళ్ళ మనసుల్లో ఏ మభిప్రాయ పడ్డారో ఆ భగవంతుడికే తెలియాలి. నాకుమాత్రం ఇటువంటి అస్తవ్యస్తపు పరిస్థితుల్లో ఇలా తటస్థించకుండా వుండాల్సిందనిపించింది. మనస్సిలా దుఃఖపూరితమయినప్పుడు అంకురించిన బీజం ఎలా ఎదుగుతుందో, ఎలా బ్రతుకుతుందో ఎవరు చెప్పగలరు?

మాఘమాసంలో ఒకరోజున ఆయన ఏదో చాలా విచారంగా వున్నట్టు కనిపించారు. నేను తబ్బిబ్బుపడ్డాను. ఏది ఏమయినా, ఆయన నాకు పసుపుకుంకుమాను. ఆయన భోజనానికి రాకుండా "నా కక్కర్లేదు" అని వెళ్ళి గదిలో పడుకోగానే, అత్తగారు వెళ్ళి అనేక ప్రశ్నలు వేశారు. కాని ఆయన ఉలకాలేదు; పలకాలేదు. దాంతో ఆవిడ కోడలి మూలంగానే ఏదో కొంప మునిగిందనుకుంది. ఆ నిర్భాగ్యురాలే కొడుకుని సుఖపడనివ్వటం లేదని నిశ్చయించుకుంది. గదిలోంచి బయటికి వెళుతూ వెళుతూ నావేపు ఒక్క అగ్నేయాస్త్రంలాటి చూపు చూసింది. ఒకసారి హుంకరించి విసురుగా వెళ్ళిపోయింది. ఇంట్లో అందరూ నిద్రపోయాక నేను వెళ్ళి ఆయన ప్రక్కన కూర్చున్నాను.

"ఎట్లావుంది మీకు వంట్లో? అంత తలకాయనొప్పి ఎలా వచ్చింది?"

కాని ఆయన వ్యాకులంగా చూడడంతప్ప ఏ సమాధానమూ చెప్ప లేదు.

"అయితే నాతోకూడా చెప్పరా? మీరేమో ఇలా విచిత్రంగా ప్రవర్తించడమూ, నిందలు నేను పడడమూను, దీని అంతటికీ నేనే కారణమయినట్లు...."

అప్పుడు ఆయన ఒక్క ఉదుటున లేచి కూచున్నారు. నా చేతులు తనచేతుల్లోకి తీసుకుని, నా కళ్ళల్లోకి అతిజాలిగా చూస్తూ వణుకుతూన్న స్వరంతో రెండుముక్కలు మాట్లాడారు. "నాకు ప్రాణంమీదికొచ్చే చిక్కులో పడ్డాను. తప్పిస్తావా?"

నాకు కంగారు ఎత్తిపోయింది. గుండె దడదడలాడి పోయింది.

"నేను తప్పించాలా మిమ్మల్ని? ఎలాగ? నే చేయగలిగిందేమయినావుంటే చెప్పరాదుటండీ? ఏమిటి మీకొచ్చిన చిక్కు?"

"అదంతా చెప్పడానికి వీల్లేదు"

"అదేమిటండీ మరి ? నాకు తెలియనివ్వ కూడదూ ? ఏమిటండీ ఈ న్యాయం ?"

"నువ్వు యింకేమీ అడక్కు నన్ను"

బావుందా నాన్నగారూ ? చిక్కులో వున్నారుట - నే సహాయం చెయ్యాలిట । నేను ఏమీ తెలుసుకో కూడదట. నాకొక్కింతెం కోపమే వచ్చింది సుమండీ ।

"సరే అయితే మీ ఇష్టం. నన్నెక్కడ బలియివ్వాలో ఇవ్వండి తీసుకెళ్ళి; నే సిద్ధంగా వున్నాను"

"నువ్వేం బలి అవక్కర్లేదు-నాకో 300 రూపాయలు తెచ్చిపెట్టు. అంతే"

"ఎక్కడినుంచి ?"

"మీ నాన్నగారి దగ్గరనుంచి"

"మా నాన్నగారి దగ్గరనుంచి ఎందుకూ తేవడం ? మా మామ గార్నే అడగండి"

"వీల్లేదు; నువ్వు రేపు పుట్టింటికి వెళ్ళు. పంపించే ఏర్పాటు నే చేస్తాను"

"మా నాన్నగారు ఇవ్వకపోతేనో ? ఎందుకూ, ఏమిటీ అని ప్రశ్నలు వేస్తేనో ?"

"నీ కేమితోస్తే అది చెప్పు. ఏః ఆపద అటువంటిది. నీ భర్త క్షేమంగా వుండాలనే కోరిక నీకుంటే...."

"అంతంత మాట లెందు కండీ ? ఎందుకలా అదేకర్తెరలో పెడతారు నన్ను ? సంగతేమిటో స్పష్టంగా చెప్పకపోతే, నేను మా నాన్న గారి దగ్గరకు ఏ మొహం పెట్టుకొని వెళ్ళను ?"

"అయితే నీ ఇష్టమొచ్చినట్లు చావు. ముందర నా గదిలోంచి బయటికి పో!"

ఈ అవమానం బల్లె మల్లే గుచ్చుకుంది నాకు. చటుక్కున గది తలుపు తీసుకుని బయటికొచ్చి ఒక పాతచీర పరచుకుని నడుంవాల్చాను. ఈ యాతన ఎవరితో చెప్పుకుంటాను? హృదయంమీద కలిగిన గాయం ఎవరికి చూపించగలను? ఊరికే ఆలోచిస్తూ వుండిపోయాను. ప్రాణం మీదకొచ్చిన చిక్కు అంటే ఎటువంటిదో ఇప్పుడర్థమవటం ఆరంభించింది. మా మామగారేమీ వెట్టివారుకాదు. అందుచేతనే ఈయన అయ న్నడగ నంటున్నారు. ఇదంతా దాని వ్యవహారమే అయివుంటుంది. ఆ నీరూ అడిగివుంటుంది ఈ పైకం. అది తెచ్చి ఇవ్వకపోతే నా దాపుకి రావద్దని వుంటుంది. మంచిదే అయిందయితే; సొంతి వెయ్యకుండానే నొప్పి తగ్గినట్టయింది. నేను వెళ్ళి మా నాన్నగార్నడిగి డబ్బు తెచ్చి పెట్టాలిట! బాగానేవుంది. నా చేతులతోటే నా నెత్తినీ, నాన్నగారినెత్తినీ నిప్పులు పోయించాలని అనుకుంటున్నారు కాబోలు ఈయన.... ఇంకేం!

ఇట్లాగే ఏమేమిటో ఆలోచనలలో మునిగి వుండగానే, ఎప్పుడు కన్ను మూతపడిందో నాకు తెలియదు. పొద్దున్నే లేచి చూసేటప్పటికి ఆ పెద్దమనిషి పక్కమీద లేరు. అనుకోకుండానే తలగడవేపు చూశాను. దానికిృంద ఒక చీటీ కనిపించింది. మడత విప్పాను. అమిత ఆదుర్దాగా చూశాను ఆ మూడు పంక్తుల వేపూను.

"నాకు జీవితమంటే విరక్తి పుట్టి వెళ్ళిపోతున్నాను. బహుశా ఈ ప్రపంచంలోంచే వెళ్ళిపోతానేమో! నాకోసం వెతకవద్దు"

ఆ చీటి చదువుతుంటే నాకు కడుపులో దేవినట్టయింది. తీసు కెళ్ళి అత్తగారికి చూపించా నా చీటి. ఆవిడ ఏడుపు ఆపుకుంటూ, మామ గారి చేతికిచ్చింది. ఆయన కనపడని కొడుకుసంగతి ఆలోచించకుండా

దగ్గరలోవున్న నా మీద పుష్పాంజలి చల్లారు. "దీనివల్లనే ఈ కొంపకి ఇంత మూడింది. ఇదే వాణ్ని సర్వనాశనం చేసేసింది" అదంతా నాకు వినిపించింది. నాకు వినిపించేలాగే అన్నారాయన. ఆ తర్వాత కొడుకుని వెతకడానికి మనుషుల్ని పంపించారు. "పరాజీ" - "మడగాంవ్" దగ్గర నుంచి "సావంతవాడీ" "బెళగాంవ్" వరకూ జాగ్రత్తగా వెతకమన్నారు—కాని ఎవరూ ఆయనగురించి వాకబుతీసుకురాలేక పోయారు. అప్పుడు ఆయనేదో అఘాయిత్యం చేసివుంటారనే అభిప్రాయపడ్డారు అత్తగారు మామగారూను. మామగారు నెత్తిన చెయ్యిపెట్టుకు కూచునేవారు. నేను నా గదిలోనే వుండిపోయేదాన్ని జైలులో వున్నట్టు. నన్నెవ్వరూ ఆ జైలులో పడెయ్యలేదు. ఎందుచేతంటే ఎవరికీ నేనొకత్తెనున్నాననే ధ్యాసే లేదు నా అంతట నేనే వెళ్ళి ఎవరికీకనిపించకుండా ఆ గదిలో పడివుండేదాన్ని. నాకు తోడుగా నా దుఃఖమూ, ఆలోచనలూను.

"ఆయన నిజంగానే అంతపనీ చేసి వుంటారా? -ఎట్లా? చెరువా, బావా సముద్రమా? అంత ధైర్యం చెయ్యగలరా ఆయన? నిండుప్రాణం తీసేసుకోగలరా? దృఢంగా వున్న శరీరాన్ని వదిలేసుకోగలరా? ఏమో ఎవరు చెప్పగలరు? - లేకపోతే నామీద కసితీర్చుకోవటం ఎలాగ మరి? ఏది ఏమయినా, సిసలయిన కబురు తెచ్చేవరకూ నా కుంకుమ తుడిచివేసుకోను."

ఇదమిత్థం తెలియకుండా అలాగే వారం పదిరోజులు గడిచిపోయాయి. ఆ తర్వాత ఒకరోజున మూడుఝాములు పొద్దుపోయాక నీరూ తండ్రి భోలా, ఇంకొక నలుగు రయిదుగురు అతని జాతివారూ, నీరూ తల్లీ, నీరూ ఒక తండా తండా వచ్చి గుమ్మంముందు నిలబడ్డారు. భోలా, మామగారిని పిలిచాడు. భయపడుతూ కాదు బెదిరించేవాడిలాగా

పిలిచాడు; మామగారికి ఇదేదో విషమ మయిన వ్యవహారమే అయి వుంటుందని అనిపించింది. వాళ్ళందరినీ పెరట్లోని వసారాలోకి పిలిపించారు. భోలా వెళ్ళి తన గుంపుతోసహా అక్కడ బైఠాయించాడు. నీరూ తల్లి ఒక వారగానుంచుంది. దాని వెనకే నీరూ నిల్చుంది.

"ఏమిటి విషయం?" అన్నారు మామగారు.

"మా అమ్మాయి విషయమే—"

"ఏం? ఏమయింది ఏమిటి, అమ్మాయికి?"

"ఏమవడానికి ఏముంది; మీ అబ్బాయిగారు దాని బ్రతుకు బండలు చేశారు"

మామగారు నిర్ఘాంతపోయారు. ఆయన కళ్ళకి వెయ్యి చిచ్చుబుడ్లు వెలుగుతున్నట్లు భ్రాంతి కలిగింది. ఇటువంటి వృత్తాంతమేదో చెవినిపడుతుందని ఆయన కలలోకూడా అనుకోలేదు.

"ఏమిటి నువ్వనేది?"

"నే నేమయినా అబద్ధం చెబుతున్నానా ఏం ? మీరే చూడండా అమ్మాయివేపు - మూణ్నెల పొట్ట కనిపిస్తూనే వుంది"

"దానికి మా వాడే కారణమనడానికి ఋజువేముందిరా?"

"ఆయన ఊరొదిలిపెట్టి, ఎవరికీ కంటికగపడకుండా పారిపోవడం కంటే ఇంకా పెద్ద సాక్ష్యమేం కావాలి మీకు ?" అన్నాడు, భోలాతోవచ్చిన వాళ్ళల్లో ఒకడు.

"నే నొకసారి మీ అబ్బాయిగార్ని నిలబెట్టి ఖచ్చితంగా చెప్పాను కూడాను. మా అమ్మాయికి ఏదో ఒకదోవ చూపించకపోతే మీ అయ్యతో చెబుతాను అని ముందరే చెప్పాను. ఆ మర్నాడు పారిపోయాడు"

"ఏమిటోయ్? ఒక దాన్ని మించిన అభాండం ఇంకోటి కల్పించుకుపోతున్నారు మీరు?"

"ఇవి మేం కల్పించే అభాండాలుకాదు. మీ అబ్బాయిగారు చేసిన అన్యాయాలు. ఆ పిల్లదాన్ని మోసంచేసి గొంతుకోశాడు. దాన్ని మీ ఇంట్లో వదిలిపెట్టేస్తాం. ఏలా చూస్తారో మీరే చూడండి. డాక్టరుదగ్గిర కెళ్ళాం. 300 రూపాయలండిగాడు. మేం ఎక్కడినుంచి తెస్తాం?" అని ధోలా పెళ్ళాం మొదలెట్టింది.

అప్పుడు మామగారి ముఖం మీద వచ్చిన మార్పు కంటచూడ వలసిందేగాని వర్ణించలేం. ఇది పరువూ మర్యాదల సమస్య అయి కూచుంది. ఈ ధోలాగాడు ఈ ముక్క ఊరంతా యాగీ చేసినా చేసే వాడే. పోలీసురిపోర్టు ఇచ్చినా ఇచ్చేవాడే. ఆయన ఆ 300 రూపాయలు నన్ను తెమ్మని ఎందుకు ప్రాధేయపడ్డారో ఇప్పుడర్థమయింది. ఆయన ప్రాణమ్మీదికి వచ్చిన వ్యవహారమేమిటో ఇప్పుడు బోధపడింది నాకు.

వాళ్ళు ప్రవేశించటమూ, ఆ పెరటి వసారాలో ఒకచోట కూచోటమూ. అన్నీ నేను నా గది కిటికీలోంచి దొంగతనంగా చూస్తూనే వున్నాను. నీరూ ముఖంమీద అదివరకుండే కళ లేనేలేదు. దీనంగా జాలిగావుంది. అదివరకుండే కొంటెతనం, చలాకీ ఎక్కడికో పారి పోయాయి.

ఆ క్షణంలో దాన్నిచూస్తే నాకు జాలివేసింది. ఓరకంగా చూస్తే నా అవస్థ ఎటువంటిదో దాని అవస్థా అంతేగా! ఇద్దరమూ కూడా స్త్రీ జాతికి సర్వదా ఏర్పడే బాధలనే అనుభవిస్తున్నాము. నా దురదృష్టం నిజంగా చమత్కారమయినదే! సహధర్మచారిణికి వుండే హక్కుతో ఏ వంశోద్ధారకుడి బీజము నేను ధరించి మోస్తున్నానో, అతనిదే మరో బీజము, పాపపుణ్యాలని లెక్కచెయ్యకుండా ఆ అమ్మాయి గర్భంలో ఎదుగులోంది. కళ్ళు నొప్పులు పుట్టేవరకూ చూశాను ఆ దృశ్యము. ఆ తర్వాత నేలమీద కూలపడి ఛోయన ఏడ్చాను చాలసేపు. కొంచెం సేప

టిలో వాళ్ళ కివ్వవలసిన సంభావన ఏదో ఇచ్చేసి,వాళ్ళని అక్కడినుంచి తోలేశారు మామగారు.

ఆ తర్వాత నాలో ఇంకేవేవో ఆలోచనలు వరుగెత్తాయి. ఇప్పుడు వాళ్ళు సీరూని ఏంచేస్తారు చెప్మా ? ఫలాని ఫలాని విధంగా చేస్తారేమో నని తోచినప్పుడు నాకు ఒళ్ళు గగుర్పొడిచింది. "భగవంతుడా ! ఆ అమాయకపు ప్రాణి శాపం నా గర్వానికి తగలదుగదా !" అని నా మనస్సు ఆక్రోశించింది. ఎంచేతంటే, నేనిప్పుడు ఆ బిడ్డమీద ఆశ పెట్టుకునే జీవిస్తున్నాను.

వాళ్ళు అటు వెళ్ళివెళ్ళగానే, మామగారుపిడుగుల్లా అడుగు లేసుకొంటూ నా గదిలోకి వచ్చారు. ఆ ఢోలాగాకు వచ్చి ఈయన వరువు, సంభావన వట్టుకు చక్కాపోయాడు. ఆకసి నామీద తీర్చుకున్నారు.

"నా కొంప ముంచేశావు నువ్వు! నా కొడుకు నాకు దక్కకుండా చేశావు. నీ ప్రవర్తన మంచిదై వుండి, అతనికి సంతోషంగా నువ్వు నడుచుకొనివుంటే, వాడలా బయట ఎందుకు తిరిగేవాడు ? నువ్వు నీ పుట్టింటికి వెళ్ళిపో ! ఇక్కడనుంచి పో తక్షణం ! నాకంటి క్కనిపించకు ఇక మీదట ...."

ఆ తర్వాత నాన్నగారూ ! ఆరోజునే మీకు వర్తమానం పంపించారు— "ఉన్నవారు వున్నట్లు బయలుదేరి రండి" అని కబురు పెట్టారు. ఆ మర్నాటికల్లా వచ్చేశారు మీరు. వచ్చి సావిట్లో కూచున్నారు. ఇదివరకు రోజుల్లో మీరు రాగానే మీకు ఎదురువచ్చి లోపలికి తీసుకెళ్ళేదాన్ని ....మీతో ఎప్పుడెప్పుడు రెండు మాటలు మాట్లాడుదామా అని వుంటూండేది. కాని ఈ రోజున ఏ ముఖం పెట్టుకు మీకు ఎదురొచ్చి స్వాగతం చెప్పగలను ?

మామగారు బయటికి వచ్చారు. జరిగిన వృత్తాంతం చెప్పారు

మీతో. అంటే ఆయనకి తోచినట్టు, యన ఎవరిని దుష్టులుగా అను కుంటున్నారో అదే సత్యమయినట్లు చెప్పారు...."మీ అమ్మాయి నా ఇల్లు ధ్వంసం చేసేసింది; ఆ పాదం మంచిదికాదు. ఒక్క సంవత్సరమయినా తిరగకుండా ఇంతటి విపరీతాలు సంభవించాయి. ఇంకొక్క క్షణంకూడా ఈ ఇంట వుండటానికి వీల్లేదు ఈ దురదృష్ట దేవత! మీరు వెంటబెట్టు కొని తీసుకుపొండి! ఇందుకే మిమ్మల్ని పిలిపించాను"

మామగారు అట్లా ఉద్రేకపడి మాట్లాడ్డం ఓవిధంగా సబబే అంటాను నేను. చేతికి అందిన ఒక్క కొడుకు కనిపించకుండా పోయి నప్పుడు ఆయనకి మంచీ చెడూ ఆలోచించే మనస్థిమితం లేకుండా పోవ డంలో ఆశ్చర్యమేమీలేదు. అది ఎవరికయినా సహజమే! ఆయన్ని నిందించాల్సిన పనిలేదు. అంచేతనే నాన్నగారూ, నునే నిందించేది మిమ్మల్ని. మీరు కొంచెం శాంతంగా వుండవలసింది....ఇంతటి ఆరో పణలు భరిస్తూన్న వ్యక్తి మీ కన్న కూతురని, అది యీ క్షణంలో బ్రతుకుదో ముత్తైదో తెలియలేని అవస్థలో వుందనీ-ఒక్క క్షణం ఆలోచించ వలసింది మీరు....కాని మీరు మా మామగారికంటే ఉద్రేకపడి మాట్లా డారు; ఆయనకంటే గట్టిగా అరిచారు.

"అత్తవారింటిని అస్తవ్యస్తం చేసిన పిల్ల నా కూతురే కాదు; దాన్ని పుట్టింటికి వెంటబెట్టి తీసుకెళ్ళటం అంటే అపనింద మూటగట్టి పట్టుకు వెళ్ళడమన్నమాట. అది మీ కోడలు; మీ ఇష్టం వచ్చినట్లు చేసు కోండి. దాన్తో ఇకనాకేమీ బాంధవ్యంలేదు; నా కూతురు చచ్చిపోయిం దనుకుంటాను....చచ్చి బూడిదయి పోయిందనుకుంటాను ఈనాటినుంచీ"

మీరు మాట్లాడ్డం ఆగిపోయింది. ఇక్కడి వాళ్ళందరూ నన్ను నానా మాటలు అన్నారు. ఇంక మీరు ఒక్కరూ ఏమంటారో తెలుసు కుంటే చాలనే ఇన్నాళ్ళూ ఎదురు చూశాను. ఇప్పు డదీ స్పష్టమయి

పోయింది. మీరుకూడా నా గాయంమీద ఊదడానికి బదులు ఇంకో దెబ్బ వేశారు. అయినా నా కళ్ళకి అంతర్గతంగా ఆశ చావలేదు. మీ రొక్కసారి గదిలోకి వచ్చి కనిపిస్తారనీ, "సంధ్యా! అసలు ఏం జరిగిందమ్మా!" అని అడుగుతారనీ అనుకున్నాను. ఒకసారి మీవేపు వ్యాకులంగా చూస్తాననీ, మీ మోకాలిమీద తల పెట్టుకుని నా పరిస్థితంతా మీకు చెప్పవచ్చుననీ ఆశపడ్డాను. నా ముఖం చూస్తేనే, నేను నిరపరాధినని మీరే తెలుసుకుంటారనీ అనుకున్నాను. మీరింకా వస్తారు, ఇంకా వస్తారు అని ఎదురు చూశాను. మీ అడుగుల చప్పుడు కోసం ఆలకిస్తూ కూచున్నాను. కాని మీరు నా గదివేపు రానేలేదు.

ఇహ అప్పుడు వుండబట్టలేకపోయాను. నేనే నెమ్మదిగా గది ఇవతలకి వచ్చాను. నడవాలోంచి సావిట్లోకి తొంగిచూశాను. మీరు కనిపించలేదు. చుట్టుప్రక్కల అంతటా చూశాను వెతుకుతూ. మూలని గొడుగులేదు. ఎక్కడా కండువా లేదు. వాకిలి దగ్గిర చెప్పులు లేవు. మీరా ప్రాంతాల వున్న దాఖలాయే లేదు. నాన్నగారూ మీరట్టానే లేచి వెళ్ళిపోయారు కదూ. నన్ను చూడకండా ఒక్కసారి పలకరించకుండా వెళ్ళిపోయారా?

ఆ మర్నాడే మామగారు నన్ను ఈ పల్లెటూరికి పంపించేశారు. ఈ కుగ్రామంలో, ఒక పాతఇంట్లో పారేయించారు. ఒక పరిత్యక్త బతుకు బతుకుతున్నాను—చావు అనేది అంత పెద్ద భయానకమయినదేమీ కాదని అప్పుడప్పుడనిపిస్తుంది. తలుచుకున్న క్షణంలో తెచ్చుకోగలను. కాని నా లోలోపలనుంచి ఆ ఎదుగుతూ ఎదుగుతూవున్న ప్రాణి మొరపెడుతుంటుంది — "అమ్మా! నువ్వుచచ్చిపోవద్దే. నువ్వు చచ్చిపోతే నేనూ చచ్చిపోవాలి"-ఆ పసి ప్రాణికి చచ్చిపోదామని ఎందుకుంటుంది? నేనుమాత్రం ఇప్పుడు చచ్చిపోయి సాధించే దేమిటి? నా మీద వున్న కళంకం నిర్మూలం చెయ్యకుండా చచ్చిపోతే ఇహ కలకాలం నా

పేరుకి ఆ కళంకం అంటుకునే పోతుంది. కాని నాకు న్యాయం ఎట్లా జరుగుతుంది? నా తరఫున వాదించేవా రెవరున్నారు? అటువంటప్పుడు మీరు జ్ఞాపకం వస్తుంటారు. ఒక్కసారి వచ్చి కనిపించి వెళ్ళండి; నా కర్మ కథ ఆలకించి వెళ్ళండి. "నీ కంతగా చెప్పుకోవలసిన దేమయినా వుంటే నువ్వు ఇక్కడికి రారాదుటే" అనవచ్చు మీరు. కాని నేను మీ కూతురిని కాదూ? పుట్టిల్లంటే నా ప్రాణానికి వైకుంఠమంత పవిత్ర మయినది. ఈ పరిస్థితుల్లో నే నెట్లా వస్తాను? నే పుట్టింటికి వచ్చి నప్పుడు మీరు తుచ్ఛంగా నన్ను చూడడం నే నెప్పటికీ సంభవించ నివ్వను. మీరే నా దగ్గరకి రావాలి. ప్రేమలేకపోతే పీడాపోయింది, కాని మీ కర్తవ్యమయినా మీరు చేయవద్దూ? మీ వియ్యంకుడి పక్షం అంతా విన్నారు మీరు. కాని నా తరఫున నే చెప్పుకునేది కూడా ఒకసారి వినా లని తోచటమే లేదా మీకు? నాన్నగారూ! నేను మిమ్మల్ని తప్ప ఇంకెవరిని తప్పు పట్టగలను?

కాని నాకు తెలుసు; మీరు రారని నాకు తెలుసు. నాది ఉత్త అరణ్య రోదనమే! ఒక్కొక్కప్పుడు ఈ పరిస్థితుల్లో మా అమ్మ బతికి వుంటేనా అని పిస్తూంటుంది. ఆవిడ మీ మనస్సుని మళ్ళా నావేపు తిప్పి వుండేది. రాయిలాగ కఠినమయిపోయిన మీ అంతఃకరణ ఆవిడ కన్నీ ళ్ళతో తడిపి మృదువుగా మార్చివుండేది....ప్చ్....ఛ....! ఇలా అనుకో వటంలో ఏం ప్రయోజనం వుందిగనక? అసలు ఆవిడని మీరు ఏ మాత్రం లెక్కచేసేవారో చిన్నప్పటినుంచీ నేను చూడలేదు గనుకనా? మీ పట్టుదలా, మీ మొండితనమూ ఎవరూ సడలించలేరు.

ఇన్ని తెలిసినా, ఇంకా ఎందుకో ఈ ప్రాణం మీ కోసం తల్ల డిల్లి పోతోంది! ఈ చుట్టూ వీస్తూన్న గాడ్పులు భరించలేకుండా వుంది. ఈ దావానలమ్మించి వచ్చే గాడ్పులని సహించలేకుండా వుంది. అవి నా

కన్నీళ్ళతో చల్లబరటంలేదు. మీ కళ్ళల్లోంచి కూడా రెండు చుక్కలు రాల్తే ఉపయోగ ముంటుందేమో ? అందుకనే ప్రార్థిస్తున్నాను !

నాన్నగారూ ఒక్కసారి వచ్చి వెళ్ళండి !

# మానిని

రాత్రి పదిగంటలు దాటింది. సహ్యాద్రి పర్వతాల లోయల్లోని గాఢాంధకారంలో, రైలుబండి కాసిల్‌రాక్ స్టేషనువేపు పరుగెడుతోంది. రైలు పెట్టెలోవున్న ప్రయాణీకులలో ముప్పాతిక మువ్వీసం మంది కునికిపాట్లు పడుతున్నారు. ఒకమూలగా చేతులూ, కాళ్ళూ ముడుచుకు కూచున్న సఖారామ్‌కు కూడా వీలయితే ఒక్క కునుకుతీస్తే బాగుణ్ణనే అనిపిస్తోంది. ఆ పగలంతా తను చేసిన ప్రయాణపు త్రిప్పటలో అతను బాగా అలిసిపోయాడు. మధ్యాహ్నం భోజనం చెయ్యగానే పొట్టబరువుతో అంబదే గ్రామంనుంచి వాళపాయీ వరకూ 4 మైళ్ళు ఏకర్రి ఎండలో నడవటంతో ప్రారంభించిన ప్రయాణం అది. ఆ తర్వాత కుళే స్టేషను వరకూ చేసిన బస్సు ప్రయాణం శరీరాన్ని కుదిపేసింది. ఇక తెల్లారి బెల్గాం వస్తేనేగాని రైలులోంచి బయటపడడం సాధ్యపడదు. పోనీ, ఆ తర్వాతయినా ఇంటికెళ్ళి హాయిగా పడుకుని నిద్రపోదామా, అని ఆశపడ దాని కసలే ఆస్కారంలేదు. 11 గంటలు కొట్టేటప్పటికి ఆఫీసులో హాజరవ్వాలి. అందుకనే విధీ విరామంలేకుండా ధకధక ధక్కమంటూన్న ఇంతటి రైలు శబ్దంలోనూ, అప్పుడప్పుడు కెవ్వుమనే ఇంజను కూతల మధ్యా, హఠాత్తుగా లేచి గుక్కపట్టి ఏడ్చే పసిపిల్లల ఏడుపులను లెక్క చెయ్యకుండానూ కూడా రైలు కిటికీకి ఒకప్రక్క తల చేరవేసి నిద్రాదేవిని ప్రసన్నురాలిని చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

కాని ఇట్టే రెప్పవాల్చగానే అట్టే నిద్రపట్టడానికి అతి ముఖ్యమయిన మనశ్శాంతి అతనికి తక్కువయింది. అతని మనస్సు ఒక విధంగా తృప్తిపడిందిగాని, ఒక విధంగా బాధపడుతూనేవుంది. ఒకవేపు వెలుగుగానూ, ఒకవేపున చీకటిగానూ వుంది. ఒకవేపున అభిమానమూ, రెండో

వేపున కింకర్తవ్యతా మూఢత్వమూ ఆవరించుకున్నాయి. ఈ క్షణంలో తనకి కళ్ళకు కట్టినట్టు దేదీప్యమానంగా కనిపిస్తూన్నది శాంతంగా, గంభీరంగా, సాత్వికంగావున్న ఒక్కటే ఒక్క స్వరూపం. ఆ మానసిక మూర్తిని ధ్యానం చేస్తున్నకొద్దీ అతని మెదడులో అనేకమయిన ఆలోచనా తరంగాలు పొంగుతున్నాయి. అతను అప్రియత్నంగా వర్తమాన కాలంలోంచి భూతకాలంలోకి ప్రయాణం చేసేశాడు.

* * *

ఇన్నాళ్ళకి ఇవ్వాళే మా రెండో అక్కయ్య నిజస్వరూపం నాకు సాక్షాత్కరించింది. ఏదో పుణ్యక్షేత్రానికి వెళ్ళి, పవిత్రమయిన కృష్ణా గోదావరి నదులలో స్నానంచేసినట్టుంది. భగవంతుడు ఎవరికయినా ఒక సోదరిని ప్రసాదించేటట్టయితే ఇటువంటి సోదరిని ఒక్కత్తిని ఇస్తే చాలు!

కాని "భగవంతు డెవరికయినా తమ్ముణ్ణి ఇచ్చేట్టయితే ఇటువంటి తమ్ముణ్ణే ఇవ్వాలి" అని ఆవిడ అనుకునే ఆస్కారం ఏముంది గనుక? ఉపేక్ష చేయడంతప్ప నే నావిడకి చేసినఉపకారం ఏముంది? అమ్మకూడా అంతేచేసింది. భోంచేసేటప్పుడు పలమారితే పెద్దక్కయ్యని గురించీ, చిన్నక్కయ్యను గురించీ తలుచుకుంటుంది. కాని ఈ అక్కయ్యను గురించి అనుకోనే అనుకోదు అమ్మ! వాళ్ళిద్దరూ సుఖంగా వున్నారో లేదో అనే ఆవిడ ఆదుర్దా అంతా! పెద్దక్కయ్యని ఖానాపురంలో ఒక శ్రీమంతుడి కొడుక్కిచ్చారు. చిన్న అక్కయ్య ఒక సైకిలుషాపు ప్రొప్రయిటరు భార్య. వాళ్ళిద్దరూ ధగధగా మెరిసిపోతూ తిరుగాడుతున్న సమయంలో ఈ అక్కయ్యయొక్క చలనంలేని స్నిగ్ధ జ్యోతి ఎవరికంటా పడనే పడదు. అసలు ఈ అక్కయ్యనుకూడా కాస్త ఆస్తీ పాస్తీ యిల్లూ పొలమూవున్న సంపన్నుడికే ఇచ్చి చేశారు పెళ్ళి. కాని అన్నదమ్ముల్లో

కలహాలవల్లా, దావాలవల్లా, వాటికోసం చేసిన ఋణాలవల్లా మా రెండో బావగారు ఇంచుమించు యావత్తు ఆస్తీ పోగొట్టుకున్నారు. అది అతని దురదృష్టమన్నమాట నిజమే. కాని అందుచేత అక్కయ్యని చిన్న చూపు చూడడమెందుకు ? కనిపెంచిన తలిదండ్రులు కూడాను!

నిన్నగాక మొన్నకూడా అంతే జరిగింది. నా పెళ్ళిని గురించి అక్కయ్యకి ఒక్క శుభలేఖ పోస్టులో పంపించి ఊరుకున్నారు నాన్నగారు; శుభలేఖయినా పంపించకపోతే బాగుండదు గనుక ! అదయినా తప్పనిసరి గనుక. కాని పెద్దక్కయ్యకీ, చిన్నక్కయ్యకీ మట్టుకు బారెడు బారెడు ఉత్తరాలుకూడా వ్రాశారు. తప్పకుండా రమ్మనమని ప్రాధేయపడుతూ. అయినా ఒక్కగాని ఒక్క తమ్ముడి పెళ్ళిగదా అని రెండో అక్కయ్య మాత్రం రాకుండా ఎలా వుండుకుంటుందని అను కున్నాను. ఆఖరి క్షణంవరకూ ఆశగా ఎదురుచూస్తూనే వుండిపోయాను. కాని ఆవిడ రాలేదు. పెళ్ళికానుకగా 5 రూపాయలు మనిఆర్డరూ, నా పేరున ఒక్క ఉత్తరం మట్టుకే వచ్చాయి.

"చిరంజీవి సుఖారాముకు అనేక ఆశీర్వాదాలు. వచ్చే దశమినాడు నువ్వొక ఇంటివాడివవుతావు. ఒక అమాయకపు కొత్త అమ్మాయి నీ ఇంటికొస్తుంది. నా శరీరం ఇక్కడవున్నా, నా ధ్యాసఅంతా అక్కడే వుంటుంది. నా మనస్సంతా నిన్ను పరివేష్టించి వుంటుంది. మీ ఇద్దరి మీదా మంగళాక్షతలు పడే ముహూర్తంలో నే నిక్కడ పూజగదిలో దేవుడిముందు కూర్చుని మీకు సర్వశ్రేయస్సులూ కలగాలని ప్రార్థించి హారతి యిస్తూ వుంటాను. నా మరదలు గుణంలోనూ, రూపంలోనూ మెచ్చదగినట్టు వుండనే వుంటుంది. ఆవిడ సుఖంగా వుండేట్టు చూసుకో నువ్వు. నీకు ఒక్కటే ఒక్క విషయంమట్టుకు చెబుతాను. రూపంకంటె గుణాన్ని ప్రేమించటమే ఉత్తమయిన వాళ్ళకి లక్షణం. ఆ అమ్మాయి

సీతలాగ వుండాలని నువ్వు ఆశించడం న్యాయమే. కాని నువ్వు కూడా రాముడులాగ వుండటానికి ప్రయత్నం చెయ్య.....!"

అరమరికలు లేకుండా, మనసారా వ్రాసిన ఉత్తరం అది. అందులోని ప్రతి అక్షరమూ నా హృదయ కుహరంలో నాటుకుపోయింది. నాకు వచ్చిన అనేక అభినందన పత్రాల్లో ఏ ఒక్కటీ ఈ ఉత్తరానికి సాటిరాదు. ఆ ఉత్తరం నేను లెక్కలేనన్నిసార్లు చదువుకున్నాను. పెళ్ళి సందడంతా అయింతర్వాత నెమ్మదిగా "సునంద" చేతికే ఇచ్చాను. ఆవిడ చదవటం ముగించి నాకిచ్చేస్తుంటే, ఆవిడ కళ్ళు నిండివున్నాయి. "ఈ వదినగారు మనపెళ్ళికి రాలేదేం మరి?" అని అడిగింది. ఏమని సమాధానం చెప్పగలను?

శరీరానికి తగిలిన గాయం మరిచిపోవచ్చు. కాని మనసున నాటిన గాయం ఆరదు. చిన్నక్కయ్య పెళ్ళికి వచ్చినప్పుడు మా మాలతి అక్కయ్యకి సంభవించిన ఘాతం జన్మ జన్మాలికి బాధపెడుతూనే వుంటుంది. ఆ గాయం కలగడానికి కారణం మా పెద్దక్కయ్య ఒకత్తేకాదు. మా నాన్నా, అమ్మా కూడా సమాన భాగస్వాములే. "మాలతి అంత పెద్దగా పట్టించుకోదులే!" అని అమ్మ అనుకునుంటుంది. "అయినా తన పేద పరిస్థితి గమనించుకుని జరిగినదానికి బాధపడకపోవడమే, మాలతికి మంచిది" అని పెద్ద అక్కయ్య వూహ. కాని అమ్మా, పెద్దక్కయ్య కూడా అట్లా అనుకోవటంలో పూర్తిగా పొరపాటు పడ్డారు.

ఆ రోజున చిన్నక్కయ్య పెళ్ళి. దక్షుడియజ్ఞం చూడ్డానికి వచ్చిన సతి ఇతివృత్తమే, మళ్ళా మాయింటి పెళ్ళి పందిరిలోనూ తటస్థించింది. తేడా ఏమిటంటే, అప్పుడు సతి ఒక్కర్తే వెళ్ళింది. ఇప్పుడు మా అక్కయ్య భర్తతోసహా వచ్చింది. వచ్చీరావడంతోనే, పనిలో జొరబడి పోయింది. యధా సమయానికి మా పెద్ద అక్కయ్య ఆవిడ భర్త

గారు కూడా హాజరయ్యారు. అమ్మకి మిన్ను ముట్టకున్నంత సంతోషం కలిగింది. మా పెద్దక్కయ్య మంచి శ్రీమంతురాలు. అంచేత అతినాజూకు తత్వం. అప్పు, యిస్సోమని ఆపసోపాలు పడుతూనే యింట్లోకి ప్రవేసించింది. భర్తగారు ఆవిడ నుదుటిమీద చేయివేసి, ఉపచారం చేస్తూ కూచున్నాడు. తన పెద్దకూతురి సౌకుమార్యాన్ని గారాబం చెయ్యాలో, అల్లుడి పత్నీప్రేమను గురించి మెచ్చుకోవాలో తెలియక తబ్బిబ్బయింది అమ్మ. మాటిమాటికీ తన పెద్దల్లుణ్ని గురించి శ్లాఘించడమే అమ్మకో పెద్ద పనయింది. మా రెండోబావగారు చూడ్డానికే పదిమంది మనుషులపెట్టు. అయినా, ఎదురుగా వున్నప్పుడు ఎవరికీ అడ్డూ అనిపించేవాడుకాదు. కనిపించకపోతే ఎవరూ కనిపెట్టుకునే వారుకాదు. ఆ కాఫీ నీళ్ళు ఏదో అందరితో పాటే తనకీని, పదిమందితో పాటే తన భోజనమూను. ఇంటిల్లిపాదినీ తనచుట్టూ త్రైనాతీ వుండేలాగ చేసుకునేవాడు మా పెదబావగారు. ఎవరయినా ఆయన్ని కాస్త అలక్ష్యంచేస్తే, పెద్దక్కయ్య కస్సు బుస్సుమనేది.

అంచేత ఇంటిపనంతా రెండో అక్కయ్యమీదే పడింది. ఉన్న పనులన్నీ ఉపేక్షించి, భర్త చుట్టూ తందనాలాడ్డం ఆవిడ కిష్టముండేది కాదు. ఆ విద్య మా పెద్దక్కయ్య దగ్గిర నేర్చుకోలేదు ఇంకా మా మాలతక్కయ్య. ఇంటెడు పనులు చేసుకుంటూనే, అటు తన భర్తకేం కావాలో ఒకకంట కనిపెడుతూ, ఒకచేత అమరుస్తూ వుండేది. కాని ఆమె చర్య ఎవరికీ కనిపించకుండానే కానిచ్చేది. అంచేత మా పెద్ద అక్కయ్యకీ, మిగిలిన బంధువర్గానికీ కూడా మాలతక్కయ్యకి భర్తమీద వుండే ప్రేమ అంతంత మాత్రమేననే అభిప్రాయం ఏర్పడిపోయింది. అంచేత మా పెద్దక్కయ్యా, చిన్నక్కయ్యా కూడా సూటీపోటీగా అన్యాపదేశంగా మాలతిని హాస్యం చేయటంలో తమ తెలివితేటలన్నీ వుపయోగిస్తూండేవారు.

అసలు అంతకు ముందురోజు సాయంకాలం వరుడికి సీమంత పూజ నిశ్చయించారు. అంచేత ఆడవాళ్ళందరూ మగపెళ్ళి వారి విడిదికి బయలుదేరుతున్నారు. ఈ వేడుక చూడడానికి అందరూ కలిసి వెళ్ళేటందుకు మా బంధువర్గంలో ఆడవాళ్ళూ, ఇరుగు పొరుగు ఇల్లాళ్ళూ అంతా మా ఇంట్లో పోగయ్యారు. అందరి దృష్టినీ ఆకర్షించేటంత ఆడంబరంలో మా పెద్దక్కయ్య అలంకరించు కుంటోంది. తన ముస్తాబంతా పూర్తి చేసుకుని, నిలువుటద్దంలో ఒకటికి రెండుసార్లు పరీక్షించుకుని, తన పెట్లోంచి ఒక చీర మడత తీసి చేత్తో పట్టుకుని మా రెండో అక్కయ్యని పిలిచింది—

"ఒసే, మాలతీ !"

"ఏమిటి అక్కయ్యా ?"

"నీ ముస్తాబు అదీ అయిందా ?"

"ఇదేం ? నే సిద్ధంగానే వున్నానుగా !"

"ఏమిటీ, ఈ చీరతోటా ? ఈ నేతచీర కట్టుకుని వస్తావా మా వెంట ? నయమే ఇంకా ! మా అందరికీ కూడా తలవంపులు తెచ్చి పెడ్తావా ఏమిటి ? ఇలా తటస్థిస్తుందని నే ననుకుంటూనేవున్నా మొదటి నుంచీ. అంచేతే కాస్త ముందే జాగ్రత్తపడి మరో రెండు చీరలు పెట్లో వేసుకొచ్చాను. ఇంద, ఈ జరీచీర కట్టుకుని, ఈ రవిక వేసుకో !"

అంటూ మా పెద్దక్కయ్య, తన ఔదార్యం అంతా ప్రదర్శిస్తూ చుట్టూవున్న అక్కలక్క లందరిమీంచి తనచూపు తిప్పింది. తన మంచి తనమూ, ఔదార్యమూ ఇంకా వుంది చూస్తూండండి అన్నట్టు ఒక నగల డబ్బా మూతతీసి, అందులోంచి ఒక కాసులపేరు తీసి మాలతివేపు అందిస్తూ "ఇంద ! ఇదీ,కూడా వేసుకో అమ్మెళ్ళో. బొత్తిగా లంకలో సీతలాగవుంటే ఎలాగా నువ్వు ?" అంది అతిదర్పంగా.

మా రెండో అక్కయ్య ఇంకోళ్ళ వస్తువు ఎరువు తీసుకుం టుందా ? అదయినా ఈ వాతావరణంలో ! ఆ ఇచ్చేదేదో వాత్సల్యం తోటీ, ఇంతటి బహిరంగ ప్రదర్శనం లేకుండానూ, ఇంత పటాటోపమూ, బడాయీ చెయ్యకుండానూ, ఇచ్చివుంటే, ఏకాంతంలో బతిమాలి ప్రేమగా కోరితే, "పెద్దక్కయ్య మనస్సు నొప్పించడ మెందుకులే" అనే భావంతో అంగీకరించి వుండేదేమో, ఎరువు నగలూ చీరలూ ధరించటానికి. కాని మా పెద్దక్కయ్యకి అట్లా ఇవ్వటంకంటే అందరి ఎదటా ఒకసారి చెప్పి ఇవ్వడమే ముఖ్యమయింది. తన గొప్పతనమూ, తన ఔదార్యమూ అంద రికీ చూపించటమే ఆవిడకి అభీష్టమయింది. అంచేత మా మాలతి అక్క య్యకి స్వాభిమానం అంతా ఒక్కపెట్టున ఉప్పొంగింది. అంచేత ఉగ్గ బట్టిన కోపపు స్వరంతో, తుంపినట్టు పలికిన మాటలతో జవాబు చెప్పింది :

"అక్కయ్యా ! నీ దాపుడుచీర నీ దగ్గిరే వుండనీ, అది నా కుప యోగించేది కాదు. నే నిలావుండి నీవెంట రావటం నీకు తలవంపు లయితే, నేను పది అడుగులు వెనకే వుంటాలే. ఇప్పుడూ నాలుగడుగులు వెనకే వుంటున్నానుగా ! అయినా అక్కడెవరయినా నావేపు వేలుపెట్టి చూపించి, ఎవరని అడిగితే, 'పెళ్ళి చాకిరీ కోసం కుదుర్చుకున్న దాసీది లెండి' అని చెప్పు; ఫరవాలేదు వస్తా"

చటుక్కున అంతర్ధానమయ్యే మెరుపులాగ అక్కడినుంచి వెళ్ళి పోయింది మాలతి. అకస్మాత్తుగా నడినెత్తిన పిడుగు పడ్డట్టయింది పెద్ద క్కయ్యకి. పదిమందికీ తన హుందాతనం ప్రదర్శిద్దామని ప్రయత్నిం చింది; కాని పదిమందికీ కనిపించింది తన మాడిన మొహం. "మొత్తం మీద మా బాగా జాడించిందిలే" అని అమ్మలక్కలు గుసగుసలాడటం కూడా పెద్దక్కయ్యకి వినిపించే వుంటుంది. ఆ క్షణంలో మా అమ్మ గనక అక్కడకి రాకపోతే, పెద్దక్కయ్య పెద్ద చిక్కులో పడిపోయేది

పదిమంది ఎదటాను. "అక్కగదా అని ఆప్యాయంగా ఏదో ఇవ్వబోతే, మరీ ఇలా ప్రవర్తిస్తావేమని అడిగేవాళ్ళే లేకపోయారు!" అని ఓదార్చింది మా అమ్మ. మా మాలతే అక్కడవుంటే, ఇలా ఓదార్చే ధైర్యం వుండేది కాదనుకోంది అమ్మకి. అయినా తన పరోక్షంలో తల్లి ఇలా అన్నట్టు తర్వాత తర్వాత మా మాలతికి కూడా తెలిసేవుంటుంది. అయినా మళ్ళీ ఆప్రసక్తే తీసుకురాలేదు మాలతక్కయ్య. "పుట్టింట్లో శుభకార్యం గదా అని వచ్చాం. అది నిర్విఘ్నంగా పూర్తి అయ్యేట్టు చూడడమే మన కర్తవ్యం. అందుకోసం వళ్ళువంచి పనులుచేసి, మనసులు పాడు చేసుకోకుండా వుండటమే ముఖ్యం" అని తీర్మానించుకుని కాలం గడిపిందనుకుంటాను.

కాని మా మాలతి దురదృష్టం ఇంతటితో అంతమవలేదు. అది అనుభవించవలసిన ఘట్టాలు ఇంకా ఒకటి రెండు ముందు ఘడియల్లో దాక్కుని వున్నాయి. యావన్మందీ మగపెళ్ళివారి విడిదిలో చేరాము. అక్కడ వారి ఆడవాళ్ళు కూడా పోగయ్యారు. చేరిన ఇల్లాళ్ళందరూ తమ తమ సింగారింపులు, అనేక రకాల నవీన సౌందర్య సామగ్రితో వృద్ధిచేసుకోడానికి ప్రయత్నించిన వాళ్ళే. వాళ్ళందరి మధ్య సాదా సీదాగా వున్నది మాలతి ఒక్కర్తే. పరిశుభ్రంగావున్న నేతచీర కట్టుకుంది. చేతినిండా గాజులు వేసుకుంది. చక్కటి కుంకుమబొట్టు అర్ధచంద్రాకారంగా తీర్చుకుంది. తిన్నటి మధ్యపాపిడి తీసుకుని నున్నగా దువ్వుకున్న జుట్టుని పెద్దముడి వేసుకుంది. కిరీటం ప్రభలాగా, పెద్దగా, గుండ్రంగా వున్న ఆ నల్లటి చక్రంమధ్య పద్మంలా వున్న ముఖం స్వాభిమానంయొక్క తేజంతప్ప ఇంకే పౌడరూ, స్నో లేకుండా ప్రకాశిస్తోంది. కాని అస్వాభావికపు అలంకరణలనే అలవాటు చేసుకున్న ఆ స్త్రీ సమూహం మాలతిని చిన్నచూపు చూసి ఊరుకుంది.

వేదికమీద వేసిన పరుపూ తలగడలమీదకి యింకా వరుడు వచ్చి

కూర్చోలేను. అంచేత, అక్కడ చేరిన పేరంటాళ్ళు అందరూ నుంచునే వున్నారు. పురోహితుడు వరపూజకి మండపంలో ఏవో సన్నాహాలు చేస్తున్నాడు. ఆ సమయంలో మా పెద్దబావగారు భార్యని ఒకప్రక్కకి తీసికెళ్ళి, ఏదో చెవులో చెప్పాడు. ఆవిడ బయలుదేరి వచ్చి మా అమ్మ చెవిలో వూదింది. అమ్మ నాన్నగారి చెవి దగ్గర గుసగుసలాడింది.

"మీ అయన కిష్టంలేకపోతే, మనం బలవంతం చేసి ఒప్పించడం ఎందుకులే! మాంతి మొగుడికి యివ్వదలచిన దేదో మనయింటి దగ్గర యిద్దాం పోనీ" అంది అమ్మ.

కొంచెం లోతుగా అరా తీస్తేనేగాని, నా కసలు ఈ విషయ మేమిటో బోధపడనేలేదు. తన భార్య ముఖతా అత్తగారికి, అత్తగారి ద్వారా మామగారికి పెద్ద అల్లుడుగారు పంపించిన కబురు ఏమిటయ్యా అంటే, "జ్యేష్ఠ మర్యాదలు జరిపేటప్పుడు నా ప్రక్కని ఆ రెండో అల్లుడుగార్ని కనక కూచో పెట్టేట్టయితే, నే నది మర్యాదగా గాకుండా అమర్యాద చేసినట్టే పరిగణిస్తానూ!" అని.

మా అమ్మకి,మా పెద్ద బావగారి పట్టింపు సమంజసమనే తోచింది. తన పెద్ద అల్లుడు పట్టణపు మనిషి; ఉద్యోగస్తుడు; నవ నాగరికంగా వుండేవాడు. ఎంత సంప్రదాయమే అయినా, అతని సరసని కొంకణ వాసస్తుడూ, తలపాగా చుట్టుకునేవాడూ, మోతుబరి అయిన రైతే అయినా తన రెండో అల్లుణ్ణి కూచోపెట్టడం న్యాయం గాదనే అనిపించింది. మా అమ్మ అభిప్రాయాన్ని తక్షణం మా నాన్నగారు ఆమోదించేశారు.

అంచేత, ఆ తరుణం వచ్చినప్పుడు మా పెద్దక్కయ్యనీ, పెద్ద బావగారినీ పీటలమీద కూర్చోపెట్టి పూజలు చెయ్యడమూ, మర్యాదలు జరపడమూ, కానుకలు ఇవ్వడమూ యధావిధిగా జరిగిపోయాయి.

ఆ సమయంలో పురోహితుడు రెండవ అల్లుడి సంగతి జ్ఞాపకం

చేశారు. కాని మా అమ్మ అతనివేపు ఉరిమి చూసి, ఊరుకోమని సౌజ్ఞ చేసింది. నేను మా రెండో అక్కయ్య ముఖంవేపు చూశాను. అగాధమయిన లోతుగల నది పైకి ఎలా వుంటుందో అలా గంభీరంగా వుంది మాలతి ముఖభావం. ఆవిడ కళ్ళల్లో ఒక తపస్వినిలోవుండే నిగ్రహం నిండివుంది. ఆవిడ తన హృదయంలోని కళవళం ఎవరికీ కనిపించనివ్వలేదు. మా పెద్దక్కయ్య పూర్తిగా తృప్తిపడింది-తనకి లోగడ జరిగిన అవమానాన్ని వడ్డీతో సహా ముట్టచెప్పాం గదా అని.

ఆ రాత్రి భోజనాల పంక్తిలో మాలతి కనుపించలేదు. ఆవిడ భర్తకూడా ఆకలిగాలేదని జవాబు చెప్పారు. మాలతి తమకు జరిగిన అవమానాన్ని విరిగిన బాణపు మొనలా హృదయంలో దాచుకుంది. మొట్ట మొదటి అవమానం తన అక్కగారు తనకు జేసింది. ఇప్పుడు తన తల్లీ తండ్రికూడా చేరి, తననీ, తన భర్తనీ కూడా అవమానించారు. ఆహ్వానించిన తలిదండ్రులే అవమానం చేశారు. నేను అన్నంతిని మేడమెట్లు ఎక్కుతూంటే, వాళ్ళిద్దరూ ఏదో మాట్లాడుకుంటున్నట్టు అస్పష్టంగా వినిపించింది. బహుశా ఈ విషయమే అయివుంటుంది. ఆవిడే ఏదో భర్తతో చెబుతోంది; కొన్ని కొన్ని మాటలుమట్టుకే వినిపించినయి. దాన్నిబట్టి అదేదో రేపటి విషయంగా తోచింది నాకు. అయినా నాకు మాత్రం అక్కయ్యని పిలిచి ఆశ్వాసించాలనే కోరిక పుట్టేంత అపేక్ష ఎక్కడిది ?

ఆ మర్నాడు పొద్దున్న 8 గంటలకి పెళ్ళి జరిగింది. "వాయించండోయ్, భజంత్రీలూ వాయించండి!" అన్నారు.

దంపతుల మస్తకాలమీద మంగళాక్షతలు పడ్డాయి. ఆ తర్వాత కాస్సేపటికల్లా మాలతి అక్కయ్య తన ట్రంకుపెట్టి సర్దుకుంది. ఆవిడ భర్త తలకి పాగా చుట్టుకుని ప్రయాణానికి సిద్ధమయ్యాడు-రోడ్డుమీద

నుంచుని ఒక ఖాళీ జాగా అపుచేశాడు. దేవుడి గదిలో విగ్రహానికి నమస్కారం చేసివచ్చిన మాలతి, తలిదండ్రుల పాదాలకి నమస్కారం చెయ్యడానికి వంగినప్పుడు మాత్రం అమ్మ ఆశ్చర్య పడిపోయింది.

"మాలతీ ! ఇదేమిటే ? ఎక్కడికి బయల్దేరారు ?"

"నేను స్వతంత్రంగా వుండగలిన ఇంటికి ! ఏ విధమయిన అవమానం జరగని చోటికి ! మా ఇంటికి !"

"ఒసే, ఒసే ! ఏమిటే నువ్వనేది ?"

"అమ్మా ! ఆ విషయాలన్నీ నువ్వు అడుగావద్దు, నే చెప్పావద్దు. జరిగినవన్నీ వాళ్ళ వాళ్ళ మనసుల్లో ప్రతివాళ్ళకీ తెలుసు !"

"నువ్వు మనసులో ఇంత బాధపడ్డావుటే తల్లీ ?"

"నమ్మినవాళ్ళే ద్రోహంచేస్తే సహించటం చాలా కష్టమనిపిస్తుందమ్మా ! అమ్మా, మేం బీదవాళ్ళమన్న సంగతి లోకంలో అందరికీ తెలుసు. కాని నేను దిక్కులేనిదాన్ని కాదన్న విషయం కనీసం నీ ఒక్కత్తికన్నా తెలిసివుంటే బాగుండేది"

ఇంక ఆ తర్వాత ఎవరు మాత్రం ఏం సమాధానం చెప్పగలరు? అసలు ఏం చెప్పడానికి ఎవరికి ముఖం చెల్లుతుంది ? ప్రతి ఒక్కరినీ వాళ్ళ వాళ్ళ మనసులే బాధపెడుతున్నాయి. అప్పుడిక అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంది. పెద్దక్కయ్యకూడా నాలుగు చుక్కలు రాల్చింది. ఇద్దరూ కలిసి మాలతిని బ్రతిమాలారు. తమ తప్పులు ఒప్పుకున్నారు. కాని మాలతి తన నిశ్చయం మార్చుకోలేదు.

కూతుళ్ళకీ, బంధువులకీ ఇవ్వడంకోసం అందరికీ బట్టలు తెచ్చేవుంచింది అమ్మ. పెద్దక్కయ్య తీసుకొచ్చిన పెళ్ళికానుక ఖరీదయిన చీర గనుక, దానికి బదులు పెద్దక్కయ్యకూ పెద్ద జరీచీర తెప్పించింది. మాలతి ఏదో సాధారణమైన చీర తెచ్చింది గనుక,దాని కివ్వడానికి ఒక

సాధారణమయిన చీర తెప్పించింది. ఇతర విషయాల్లో చూపించిన పక్ష పాతమే ఈ చీరల విషయంలోనూ చూపించింది అమ్మ. కాని ఆక్షణంలో అమ్మ తన మనసులో ఏమనుకుందో ఏమో ఆ భగవంతుడికే తెలియాలి. ఆదరా బాదరా వెళ్ళి బీరువాతీసి జరీచీర పట్టుకొచ్చింది. అమ్మచేత బొట్టు పెట్టించుకోవడానికి మెడ ముందుకి చాచి ముఖం అందిచ్చిందే కాని, అమ్మ ఇస్తూన్న చీర తీసుకోవడానికి చెయ్యి ముందుకు పెట్టలేదు మాలతి.

"అఁహఁ! నా కిం కోచీర అక్కర్లేదులే అమ్మా! ఇప్పుడు నేను కట్టుకున్నదే నువ్విచ్చిందనుకో. ఇదే నీ ఆశీర్వాద మనుకుంటాను నేను. ఇంకేమీ అక్కర్లేదమ్మా!"

జరీచీర పట్టుకుని వున్న అమ్మ చేతులు గజగజా వణికిపోయాయి. నే నది చూడలేకపోయాను. నే చటుక్కున కటువుగా మాట్లాడాను :

"అక్కర్లేకపోతే పొమ్మనవే! ఇంత ఫోజ్సు చేసే మనిషి ఎందు కొచ్చిం దసలు మనింటికి?"

నేను వేసింది ఆఖరుమాత్ర అయింది. కుడినుంచీ, ఎడమనుంచీ, అంతరిక్షంనుంచీ కూడా అక్షింతలే పడ్డాయి. అందరు చేసిన పూజలూ అయిన తరువాత, తమ్ముణ్ణయిన నేను మంత్రపుష్పం చదివానన్నమాట. అదీకూడా కిక్కురుమనకుండా భరించింది మా మాలతి.

వచ్చటి పందిట్లో పెళ్ళివారంతా చూస్తూండగా, కొత్త అల్లుడు ఆశ్చర్యంతో నివ్వెరపోయి నిల్చుండివుండగా, అమ్మకి, నాన్నకి ఇటు వంటి కఠినశిక్ష వేసి మాలతి వెళ్ళిపోయింది. ఈ శుభకార్య సమయంలో వుండే చైతన్యం సర్వమూ తనవెంట తీసుకు వెళ్ళిపోయింది. పందిట్లో వున్న ఉత్సాహంమీద చన్నీళ్ళు దిమ్మరించింది: ఆవిడ దిమ్మరించిందన డంకంటే ఆవిడని అవమానం చేసిన మేమే మా చేతుల్తో చన్నీళ్ళు

గుమ్మరించుకున్నాం అని ఈ రోజున అనిపిస్తూంది నాకు. వెళ్ళిపోతూన్న జట్కా వేపు చూస్తూ వీధి మెట్లమీద నుంచున్నాను.

ఆ జట్కా మళుపు తిరుగుతూండగా, మాలతి పమిటచెంగుతో కళ్లు ఒత్తుకోవడం కనిపించింది నాకు. అందరినీ త్యాగం చేసుకుని వెళ్ళిపోతోంది ఆ మానిని. ఆవిడలోవున్న పుట్టింటిమీది అపేక్ష ఏడుస్తోంది అంతే!

అక్కయ్యకి అనేకసార్లు అవమానం జరిగినమాట నిజమే.కాని, ఆవిద వచ్చి మంచినీళ్ళు ముట్టకుండా వెళ్ళిపోవడం మాత్రం బాగుండ లేదనిపించింది నాకు. ఆవిద ప్రవర్తనవల్ల శుభకార్యంలో వుండే శోభ అంతా పోయింది. పైగా ఊళ్ళో అంతటా మా కుటుంబాన్ని గురించి రకరకాల వ్యాఖ్యానాలు వుత్పన్నమయాయి. కాని ఆవిడమాత్రం ఏం చేస్తుంది గనుక? అన్నింటినీ భరించి ఇంకోపూట వుండవలసిం దంటామా? ఈ మనిషి ఏదయినా భరిస్తాదని ఒక మనిషిని గురించి అందరూ అనుకోవటం మొదలెడితే, ఇక ఆ మీదట....

ఆ తర్వాత నా మనస్థితి మరీ విచిత్రంగా పరిణమించింది. ఒక సారి అక్కయ్యవేపూ. ఒకసారి అమ్మవేపూ మొగ్గేది నా సానుభూతి. నా బుద్ధికి అక్కయ్య ప్రవర్తన సమంజసమే అనిపించింది. కాని ఆ అభిప్రాయాన్ని నాలోవున్న స్వార్థమూ, అహంకారమూ ఒప్పుకునేవి కావు. న్యాయం అంతా ఆవిడవేపేవున్నా, నే ననవసరంగా కోప్పడ్డాను. ఆ తర్వాత నాలుగు రోజులవరకూ ఆ విషయమే చర్చించుకున్నారు అమ్మా, పెద్దక్కయ్యాను. మేం తప్పుచేశాం అని ఆనాడు ఒప్పుకున్నారే గాని, మళ్ళీ ఇప్పుడు తమ తమ సహజ స్వభావాలు చూపించారు.

ఆ మీదట 6 ఏళ్ళు గడిచినా, మాలతి మళ్ళీ పుట్టింటివేపు చూడ లేదు. ఒక్క ఉత్తరమయినా వ్రాయలేదు. తనకు పుట్టింటిమీద వున్న

వాత్సల్యం అంతా సమూలంగా పెరికి పారేసింది కాబోలు! "మనకి పుట్టిల్లనేది ఒకప్పుడుండేది, అంతే!" అనే నిర్ణయానికి వచ్చేసింది కాబోలు! నేనుకూడా ఆ 5 ఏళ్ళలోనూ ఆ సహ్యాద్రి కొండలుదాటి ఆవిడ వూరికి వెళ్ళనేలేదు. ఎవళ్ళ ఇంట్లో వాళ్ళు వుండడమే మంచిదిలే అన్నట్టు అయిపోయింది ఆఖరికి. ఆవిడకి ఒక ఉత్తరం వ్రాయాలన్న ఊహ నా పెళ్ళి నిశ్చయమయాక వచ్చిందంతే. అక్కయ్య ఎలాగా రాదని అమ్మకీ నాన్నకీ బాగా తెలుసు. రాకుండా వుండడమే మంచిది అనుకున్నారు కూడాను.

* * *

ఏది ఏమయినప్పటికీ అక్కయ్య నన్ను ఆశీర్వదిస్తూ వ్రాసిన ఉత్తరం చూసినప్పటినుంచీ నా మనసు ఆవిడవేపే ఎగిరిపోవడం మొదలెట్టింది. అమ్మను గురించీ, నాన్నను గురించీ అక్కయ్య ఇప్పుడేమనుకుంటుందో ఆ దేముడికే తెలియాలి. కాని నామీద మాత్రం ఆవిడకెంతో అపేక్ష వున్నట్టు ఆ ఉత్తరంలోని ప్రతి అక్షరమూ సాక్ష్యమిస్తోంది. పెద్దక్కయ్యకీ, చిన్నక్కయ్యకీ నామీద వున్న సోదర వాత్సల్యంకంటె ఈ రెండో అక్కయ్యకున్న అపేక్ష అసాధారణమయిన గాఢత్వం కలదని నా మనసుకి ఎంచేతో రూఢి అయిపోయింది. నా పెళ్ళికి వచ్చిన ఇద్దరు అక్కయ్యలూ నన్ను ఎంతో గారాబంగా, ముచ్చటగా చూసిన మాట నిజమే. కాని వాళ్ళ ఆప్యాయతలో అహంభావం లేదని నే చెప్పలేను. ఇచ్చి పుచ్చుకోవడంలో సమానస్థాయి వున్నంతవరకే ఆ ఆప్యాయత నిలిచేదనిపించింది. "నువ్వు బాగున్నంతకాలమూ, నువ్వు మమ్మల్ని గౌరవించినంతసేపూ, మేమూ నిన్ను ఆశీర్వదిస్తూంటాం" అనే భావమే స్పష్టంగా బయటికి తెలుస్తూండేది.

మాలతి అక్కయ్యకున్న ఆంతరంగిక ఆత్మీయతనీ, వాళ్ళు చూపించే ఆప్యాయతనీ పోల్చుకోవటమే పొరపాటనిపించింది. నా పెళ్ళి

నాలుగు రోజులలోనూ మా రెండో అక్కయ్య ప్రస్తావన అనేకసార్లు వచ్చింది.

కాని అందరూ ఒక పల్లవే పాడేవారు : "మాలతికి మా పెద్ద బడాయిబాబూ। భగవంతుడు వాళ్ళని అంతంత మాత్రంగా వుంచినప్పుడే యీలా మిడిసిపడుతోంది,ఇక ఐశ్వర్యవంతురాలయితే పట్టనేలేక పోయే వాళ్ళం" ఇటువంటి మాటలు వింటే నాకెంతో విచారం వేసేది. అసలు వాళ్ళందరూ అలా తుచ్ఛంగా మాట్లాడినకొద్దీ, మాలతి అక్కయ్య నా మనసులో గాఢంగా నాటుకుపోయేది. లోలోపల ఒక నిర్ణయానికి వచ్చే శాను. ఈ పెళ్ళి హడావిడి అయిపోగానే,వాళ్ళ వూరువెళ్ళి అక్కయ్యను చూడాలని తీర్మానించుకున్నాను. అదయినా ఉత్త చేతులతో వెళ్ళటం లేదు. మాంచి జరీచీర ఒకటి కొని పట్టుకెళ్ళా లనుకున్నాను.

నా ప్రయాణం అమ్మకి అంత ఇష్టంలేదనినాకు తెలుసు. అయినా లెక్కచెయ్యకుండా బయలుదేరి సిన్న మధ్యాహ్నానికి అక్కయ్య గుమ్మంముందు చేరుకున్నాను. నాకు మనసులో ఏదో సంశయం పీకి స్తోంది. "నువ్వు ఇంతదూరం వచ్చావు సరే. కాని అక్కయ్య నీకు స్వాగతం చెప్పి మర్యాదలు చేస్తుందని నీకెలా నమ్మకం? మీ ఇంటికి అనిత వచ్చినప్పుడు అందరూ విసిరిన అవమానాలతోపాటు నువ్వుకూడా ఆఖరుని ఒక బెడ్డ వేశావు జ్ఞాపకంవుందా ?

"అక్కర్లేకపోతే పొమ్మనవే. ఇంత ఫార్సు చేసే మనిషి అసలు ఎందుకు రావాలి మనింటికి" అన్నావు జ్ఞాపకం వుందా....?" అంటూ నా మనస్సే నన్ను గిల్లుతోంది.

కాని, నే అంతదూరంలో కనిపించగానే, అక్కయ్య ఎంత ఆనందంతో బయటికి పరుగెత్తుకు వచ్చింది। మిట్ట మధ్యాహ్నమప్పుడు ఆ వీధి గుమ్మంలో వెన్నెల కాసింది. ఒక్కక్షణం అక్కయ్య తన కళ్ళని

తనే నమ్మలేకపోయింది. ఆవిడ కళ్ళల్లో ఆశ్చర్యమూ, విస్మయమూ వృద్ధి అయిపోయాయి రెండు క్షణాలపాటు. ఆ తర్వాత తమాయించు కుని, "రారా సఖారామ్ ! కూచో. ఇవాళ పొద్దున్న అసలు వీధి గుమ్మం దగ్గిర పనసచెట్టుమీద కూచుని కాకి అరవడం మొదలెట్టింది. ఏం, ఎవ రయినా బంధువు లొచ్చేట్టయితే ఎగిరిపో మరి ! అన్నాను. కాని నువ్వు వస్తావని కలలోకూడా అనుకోలేదురా !"

ఇంతట్లో పెరటి గుమ్మంలోంచి బావగారు కూడా సావిట్లోకి వచ్చారు. నేను వాళ్ళిద్దరికీ నమస్కారం చేశాను. "దీర్ఘాయుష్మాన్భవ." అని దీవన వినిపించింది. అది అక్కయ్య స్వరం ! కెరటాలు కెరటా లుగా అమృతం వంట్లో పోసేస్తే ఎంత మధురంగా వుంటుందో అంత మధురంగా వుంది ఆ ధ్వని. "ఎంత పెద్దవాడవయ్యావురా !" అని ఒక్కసారి గారాబంగా కళ్ళారా నావేపు చూసి, మెల్లిగా ఇంట్లోకి వెళ్ళి పోయింది. ఆ తర్వాత క్షణ క్షణమూ లోపలికెళ్ళి ఏదో పని చూసుకోవ డమూ, బయటికొచ్చి రెండు మాటలు మాట్లాడ్డమూను. దాని కొడుకు కాస్సేపు నా చుట్టూనూ, కాస్సేపు దాని కొంగు పట్టుకునీ తిరగడం మొదలెట్టాడు. తనకి పంచదార చిలక తెచ్చిన మామయ్యకూడా వాడికి తియ్యగానే కనిపించాడు. అక్కయ్య వంట ఇంట్లో ఇంకో తపేలాతో బియ్యం పొయ్యిమీద పడేసింది. బావగారు స్నానాల గది దగ్గిర నీళ్ళ కాగుకింద నిప్పు రాజేశారు.

"మాలతిది బీద సంసారం మరి !" మాలతి "పేద ఇల్లాలు గదూ !" అనే అరపా దడపా అంటూండేవారు. కాని నాకిక్కడ బీద తనమూ, పేదరికమూ ఎక్కడా కనిపించలేదు. ఎటొచ్చీ వాళ్ళ యిల్లు పూరిల్లు. అంతే ! కాని ఎంత శుభ్రంగా వుంది ఇల్లంతా ! ఆఖరికి ముంగిలికూడా అద్దంలా స్వచ్ఛంగా వుంది. ఎటు చూసినా సమృద్ధి కని పిస్తోంది. కళకళలాడుతూ వున్నాయి ఇల్లూ పెరడూ కూడాను. ఒక

ప్రక్కని చక్కటి తులసికోట వుంది. ఇంకో దగ్గిర జాజితీగ పందిరి వుంది. ఇంటి చుట్టూవున్న కంచెమీద పరిమళించే పువ్వులు పూసే తీగ లున్నాయి. ఇంటికి ముందూ వెనకా కూడా పనసచెట్లున్నాయి. నీటి బోదె ప్రక్కన ఒకటి రెండు మామిడిచెట్లున్నాయి. నీళ్ళ గదిలోంచి వచ్చిన నీళ్ళు పారేచోట మాంచి తెగకుచెందిన అరిటిచెట్లు రెండు మూడు కుదుళ్ళున్నాయి. గొడ్లపాకలో పొట్టిదయినా కామధేనువవంటి పొదుగు గల ఆవూ, ఒక దూడా వున్నాయి. వీధి గుమ్మం దగ్గిర మెట్లమీద ఒక పిల్లి హాయిగా పడుకుని వుంది. దాని బొచ్చు పట్టులాగా నిగనిగలాడు తూంది. అది తన తోకని వంటిచుట్టూ కైవారంగా తిప్పి ముందరి కాళ్ళ మీద తోక కొన మెల్లిగా ఆడిస్తూ, తను ఒక భాగ్యవంతుల ఇంట్లోవున్న ఏ కొరతాలేని పిల్లిననే తృప్తితో అరమోడ్పు కన్నులతో విశ్రాంతి తీసుకుంటోంది. అన్నదమ్ముల కలహాల్లోనూ, కోర్టు దావాలలోనూ పోయిన ఆస్తి ఏదో కృష్ణార్పణమని మరచిపోయి, మిగిలివున్న ఆస్తిని మాత్రం జాగ్రత్తగా చూసుకుంటూ, శ్రద్ధగా పని చేసుకుంటూ, తృప్తిగా వున్నారు అక్కయ్యా, బావా. ఉన్న కుంచెడు భూమిలోనూ ఎంత ఎక్కువ పండించగలమా అని శ్రమించి ప్రయత్నం చేసుకుంటు న్నారు. జీవన యాత్రకి అత్యవసరమయినవి లోటులేకుండా వున్నారు వాళ్ళు. వాళ్ళ దగ్గిర లేనిది ఖంగుఖంగుమనే శబ్దం ఒక్కటే. రాజుగారి ముఖంతో వుండే కాగితాలు ఒక్కటే వాళ్ళదగ్గిర లేనివి. అవి మనకెంత విలువగల వనిపించినా, వాళ్ళ దృష్టిలో అవి అనవసరమే అని తీర్మా నించుకున్నారు.

మా భోజనాలయిన తర్వాత తను వడ్డించుకునేముందు ఒక అరి టాకు పాయలో మామిడికాయంత అన్నంపెట్టి, దానిమీద కాస్త సాంబారు పోసి, ఒక ప్రక్కని కాస్త కూరపెట్టి, ఆ ఆకు ఒకప్రక్కని పెట్టించి అక్కయ్య.

"ఇది ఆవుకా ఏమిటే ?" అన్నాను.

"లేమరా, ఇంటివెనక గుడిశెలో ఒక ముసిలిది వుందిరా ! ఇది వరకు అది మనింట్లో పనిచేస్తూండేది. ఇప్పుడసలు బొత్తిగా లేవలేదు పాపం ! అంచేత నాలుగు మెతుకులు పెడుతూంటాను రోజూ"

పెద్ద పెద్ద శ్రీమంతుల ఇళ్ళల్లోకూడా జరగని దానధర్మం మా అక్కయ్య ఇంట జరుగుతోంది కదా అనుకున్నాను మనసులో. మరి దీనిది బీదసంసారం అంటారెందుకు ? మాయింట్లో అందరూ దీన్ని తలుచుకుని పెద్ద జాలిపడతారెందుకు ? అంత పేదరాలే అయితే ఇంకొళ్ళకి పెట్టగలదా ? దీని కీ దానధర్మాలెవరు నేర్పారు ? కష్టాలు కలిగినప్పుడే మానవుడికి మంచిగుణాలు అబ్బుతాయంటారు. ఒకవేళ అక్కయ్యకూడా అనుభవమే ఇటువంటి దైవికమయిన గుణాలు నేర్పిందా....?

విస్తళ్ళు ఎత్తి ఇల్లు శుద్ధి చేసినతర్వాత. అక్కయ్య తన కార్ఖానా ఆరంభించి. తీరికగా వున్నప్పుడు కూచుని అరిటాకు దొప్పలు కుట్టి అవి అమ్మటం ఒక వృత్తిగా పెట్టుకుంది. నూరేసి దొప్పలు బొత్తులుగాపెట్టి, అవి ఒక శుభ్రమయిన గుడ్డలో కట్టి వుంచుతుంది. అలాటివి పదో పన్నెండో గుడ్డమూటలు నావిడిలో దక్షాన్ని వేళ్ళాడుతున్నాయి. గోడ మూలని ఏరి తీసుకొచ్చిన అరిటాకులతో నింపిన గోనెసంచులు వరసగా పేర్చి వున్నాయి. ఇంకోపక్కని ఎండిన అరిటాకులు చింపి బొత్తులు పెట్టి చదునుగా వుండేందుకు ఎత్తులకింద పెట్టిన దొంతరలున్నాయి. అక్కయ్య తెల్లారగట్టే లేచి అన్ని తోటలూ తిరిగి. ఎండి వాలిపోయిన అరిటాకులు. మంచులో తడిసి మెత్తగావున్నప్పుడే కోసి తెస్తూ వుంటుం దని ఊహించుకున్నాను. ఒక్క నిమిషం ఊరికే కూచోకుండా, ఏదో వుపయోగమయిన పని చేస్తుండటం అలవాటు చేసుకుందని కూడా

గ్రహించాను. కొన్నాళ్ళ క్రితం ఈ కుటుంబాన్ని మింగేసెయ్యాలనీ, దరిద్రదేవత అంగలేసుకుంటూ వచ్చిందనీ, అప్పుడు మా అక్కయ్య నిరంతరము శ్రమ చేయడమనే కంచె అడ్డుపెట్టి ఆ దరిద్ర దేవతని అంతదూరంలోనే ఆపుచేసేసిందనీ అర్థం చేసుకున్నాను. ఒక స్తంభాన్ని ఆనుకుని కూర్చుని దొన్నెలు కుడుతోంది అక్కయ్య. చాపిన కాళ్ళు ఒక మడమమీద ఇంకో మడమ వేసుకుంది. అదే విశ్రాంతి తీసుకోవడమన్న మాట ఆవిడ పనిపాటల మధ్య. ఆవిడ ఈ పని ప్రారంభించడానికి కూచోగానే, బావగారు తన కునికిపాటులోంచి లేచారు. ఆవిడ దగ్గిరలో కూచుని, ఎండుటాకులు దొన్నెలు కుట్టడానికి అనువయిన ఆకారంలో కొడవలితో కోసి ఒక ప్రక్కన పెడుతున్నాడు. రెండేసి ఆకులు తీసుకుని అవి దొన్నెల్లాగ మడిచి, చుక్‌చుక్‌మని చరచరా కుట్టేస్తోంది. ఒక్కొక్క దొన్నె చొప్పున ఆ దొన్నెల రాశి పెద్దదవుతోంది.

నేనేవేవో కబుర్లు చెబుతూ కూచున్నాను. చేతకాకపోయినా ఏదో సహాయం చెయ్యడానికి ప్రయత్నం చేస్తున్నాను. మా కబుర్లలో అనేక విషయాలు అనేకమంది వృత్తాంతాలు దొర్లిపోతున్నాయి. ఎంతో సంతోషంగా మాట్లాడుకుంటున్నాము. నే నావిడకోసం తీసుకొచ్చిన కానుక చేతి కివ్వడానికి ఇదే తగిన సమయం అనిపించింది. నే నక్కడినుంచి లేచాను. నా సంచీలోంచి చీరా, రవికలగుడ్డా, కుంకపొట్లమూ తీసి ఒక దానిమీద ఒకటిపెట్టి, అక్కయ్య ఎదట పెట్టాను. "అక్కయ్యా ! ఇదిగో నాపెళ్ళి సందర్భంలో నీకు ముట్టవలసిన కానుక" అన్నాను.

మెత్తగా నిగనిగలాడుతూన్న ఆ చీరకేసి ఒక్కసారి స్థిరంగా చూసింది అక్కయ్య. చూస్తూ చూస్తూండగా దాని ముఖంమీదికి ఏదో గంభీరమయిన భావం వచ్చేసింది. మాటలు ఆగిపోయినయి. చకచకా దొన్నెలు కుడుతూన్న చేతులు అట్లాగే ఆగిపోయినయి.ఆ విశాలమయిన

కళ్ళల్లో నీళ్లు నిండినయి. నాకేదో అస్తవ్యస్తపు పనిచేసి నట్లనిపించింది. నా ఉద్దేశమూ, అభిప్రాయమూ ఆవిడకి చెప్పటానికి ప్రయత్నించాను

"అక్కయ్యా ! నీకీ చీర చూడగానే ఏ యే సంఘటనలు జ్ఞాపకం వచ్చివుంటాయో నాకు తెలుసు. కాని ఈ చీర ఇంకెవరో ఇచ్చినది గాదు. నే తీసుకొచ్చింది. నా డబ్బుతో, నీ మరదలు ఎంపికతో కొని తీసుకొచ్చిన చీర ఇది. నా పెళ్ళి కొచ్చిన వాళ్ళందరికీ కానుక లివ్వడం అయింది. కాని నీకు ఏమీ ఇవ్వకపోవడం నాకు నచ్చలేదు. అంచేత ఇది తీసుకొని బయలుదేరి వచ్చాను. అక్కయ్యా ! నీకింకా మామీద కోపం తగ్గనేలేదా ? కనీసం నామీదయినా....?"

"ఛ ఛ ! అట్లా మాట్లాడతావేమిరా సఖారామ్ ! నా కెవరిమీదా కోపంలేదు. నీమీద ఎప్పుడూ కోపంలేదు. నా హృదయం సంతోషంతో నిండివుంది. వర్షాకాలంలో నది పొంగివచ్చినట్టు, నువ్వు సంతోషంతో పొంగుతూ నన్ను చూడటానికి వచ్చావు. మా ముగ్గురు ఆడపిల్లల తరవాత అపురూపంగా పుట్టిన మగపిల్లాడివి. మా అందరికీ ఒక్కగానొక్క సోదరుడివి. నిన్నొక్కసారి చూడాలని నాగుండె లెంత కొట్టుకున్నాయో నా కొక్కర్తికే తెలుసు. సంవత్సరం సంవత్సరమూ రక్షాబంధనం పండుగరోజు వచ్చి వెళ్ళిపోతూండేది. కాని ఒక్కరోజున కూడా నాకు నిన్ను చూచే ఆనందంగాని నీకు హారతిచ్చే తృప్తిగాని కలుగలేదు. ఒక్క సంవత్సరంకూడా నీకు యీవూరు రావాలని పించలేదు. నేను బీదదాన్ని. అంచేత అవీ ఇవీ అర్థిస్తానని భయపడి నా తమ్ముడు నన్ను చూడటానికి రావడం మానేశాడు కాబోలు ననిపిస్తూండేది. నేను నా లోలోపలే ఒక ప్రార్థన గొణుక్కుంటూ వుండేదాన్ని :

'వస్తువులూ వద్దు వాహనాలొద్దు
వెండి బంగారాలు అసలొద్దుస్వామీ !

ఒకసారి మా తమ్ముడొచ్చి కనిపిస్తే
వందలూ వేలూను శ్రీ వెంకటేశా !'

"నాకు నువ్వు కలల్లో కనిపిస్తూనే వుండేవాడివి. నీకు వడుగు జరిగినప్పుడు కొత్త జంజెపోగుతో నుంచున్న స్వరూపం కనిపిస్తూండేది. నీకు పెళ్ళి అని శుభలేఖ వచ్చినప్పుడు నువ్వింత పెద్దవాడవయి వుంటావని ఊహించుకోలేక పోయాను నిజంగా."

"నే నీకంత జ్ఞాపకం వుండబట్టే కాబోలు పెళ్ళికి వచ్చావు కాదు" అని ఎరుపు తెచ్చుకున్న కోపంతో సణిగాను.

"నా కసలు ఈ మధ్య ఎక్కడికీ వెళ్ళాలనే అనిపించటంలేదురా! మన మట్టిమీద మనం నిలబడితే చాలు ననిపిస్తోంది. పేదవాళ్ళకి స్వాభిమానం వుంటే ఎలా చెలామణి అవుతుంది చెప్పు ? అది మనకీ ఇతరులకీ కూడా బాధ కలిగిస్తుంది. మాలాటివాళ్ళు ఎక్కడికెళ్ళినా, అవతలివాళ్ళు ఏమనుకుంటూంటారో తెలుసా ? వీళ్ళేవో అర్థించడానికి వచ్చారనుకుంటారు. ఎన్నోసార్లు పొరపాట్లు చేసిన అనుభవంమీద చెబుతున్నాను సుమా ! చివరకి మనకే మనసులో ఏమనిపిస్తూంటుందో తెలుసా ? మనతో మాట్లాడే మనుషులు సవ్యంగానే మాట్లాడుతున్నారా? లేక ఏదయినా గూఢంగా అపహాస్యం చేస్తున్నారా ? వీళ్ళన్న మాట ఏవో ఎత్తిపొడుపు గాదుగదా ? అనే అనుమానం పట్టుకుంటుంది. అసలు ఇలాటి అనుమానాలవల్లే నేను సగం చచ్చిపోయేదాన్ని. సీతా, ద్రౌపదీ మొదలయిన వాళ్ళు అన్నీ త్యజించి, అందర్నీ వదిలేసి, భర్తలతో అరణ్యాల్లో ఎందుకు తిరిగారో, ఈ పరిస్థితులవల్ల నాకు బాగా అర్థమయింది. ఆప్తులమధ్య వుండటం ఎందుకు ? వాళ్ళ సూటిపోటీ మాటలు పడటం ఎందుకు ? అసలు ఎక్కడికి మాత్రం ఎందుకు వెళ్ళతాం మనం ? ఏదో సుఖమూ, సంతోషమూ కలుగుతాయని కదా ? ఇక్కడ

నాకే సుఖానికీ కొరతలేదు. చెయ్యా, కాయా ఆడినన్నాళ్ళూ, కడుపుకి సరిపోయే గంజికి కరువురాదు...."

ఇంతట్లో అప్పుడే దింపిన నాలుగు కొబ్బరికాయలు చేత్తో పట్టుకుని బావగా రొచ్చా రక్కడికి. అంచేత మా సంభాషణ ఆగిపోయింది. "బావగారికి కనీసం ఉండ్రాళ్ళయినా చేసిపెట్టు" అంటూ ఆ కాయలు అక్కయ్యముందు పెట్టాడు. ఆ మాటలు వినేటప్పటికి మనసులో భారం ఎంతేతో తగ్గిపోయింది. నిన్న రాత్రిసలు ఉడకబెట్టిన పిండితో ఉండ్రాళ్ళు చెయ్యనే చేసింది.ఆ వుండ్రాళ్ళలోకి ఉట్టిమీంచి పిడతదింపి, వాసిన విప్పి, నూకలకూడులాటి ఆవు నేయి వేసింది, మా మేనల్లుడూ, బావగారూ, నేనూ ఒక్క పంక్తిని కూచుని ఎంతో ఆనందంగా భోం చేశాం. జిహ్వకీ, మనసుకీ కూడా తృప్తి అనిపించింది. నామట్టుకు నాకు ఆ ఆతిథ్యంలోవున్న ఆదరంతో భౌతికంగానూ, మానసికంగానూ వున్న ఆకలంతా తీరిపోయింది. ఒక్క నాకేమిటి ? మా అక్కయ్య ఆపేక్షకి బ్రహ్మ విష్ణు మహేశ్వరులే అతిథులుగా వచ్చినా, తక్షణం ప్రసన్నులయి వుండేవారు.

మా అక్కయ్య నన్ను ఇంకా రెండు రోజులుండమని ఎంతో బలవంతం చేసింది. నాకూ వుండాలనే వుంది.కాని ఇవాళ మధ్యాహ్నమే బయలుదేరాను అక్కడినుంచి. ఏం చేస్తాను ? ఎక్కడో నౌకరీలో వున్నవాడిని మరి. నే బయలుదేరుతున్నప్పుడు నే తెచ్చిన చీర మళ్ళీ నా చేతి కందిచ్చింది అక్కయ్య. పైన పెట్టిన రవికగుడ్డ మాత్రం బదలాయించింది. నే నిచ్చింది దాచుకుని, తన దగ్గిరనున్న కొత్త మదత ఆ చీరమీద పెట్టింది.

"ఇది నా మరదలి కియ్యి. నా కానుక అని చెప్పు !" అంది.

నాకు మాత్రం నిజంగా మనసులో కోపమే వచ్చింది.

"నువ్వు నీ తమ్ముడికి వాత్సల్యానికి కట్టిన విలువ ఇంతే" అన్న మాట. ఆ రోజున నేను చేసిన అవమానానికి వడ్డీతో సహా బదులు తీరుస్తున్నానని అనుకోనా నేను ?"

"నువ్వట్లా అనుకోకూడదు సఖారామ్ ! ఈ చీర ఎంత ఖరీదయినదో చూశావుగా ! ఎవరికయినా ఒక కానుక ఇచ్చినప్పుడు, అది వాళ్ళకి ఉపయోగపడేదిగా చూసి ఇవ్వొద్దూ ? ఎవరికి ఏది తగుతుందో, ఎవరికి ఏది పనికొస్తుందో అని ఆలోచించకపోతే ఎలా చెప్పు ? నా పిల్లలు చీటీగుడ్డల చొక్కాలూ, గౌనులూ తొడుక్కుని తిరుగుతూంటే, ఆయన దుప్పటిలాటి ముతక పంచలు కట్టుకు పనులు చేసుకుంటూంటే నా వంటిమీద జరీచీర నప్పుతుందా, ఒప్పుతుందా ? చెప్పు పోనీ! జనం ఏమనుకుంటారో అని కాదు. మన మనస్సుకే ఎలాగో వుండదూ ? అంచేత ఈ జరీచీర నే కట్టుకునే అవకాశం వుండదుగా ? అంచేత పెట్టిలోనే వుంచేస్తే చిమ్మటలూ, బొద్దింకలూ తూట్లు చేస్తాయి తప్ప ఇంకేమయినా ఉపయోగం వుంటుందా? అందుకే మరదలు కిచ్చి కట్టించమని చెబుతున్నాను. అంతేగాని నేను నిన్ను అవమానం చేయటంలేదు నాయనా ! ఎవరయినా మన వూరునుంచి ఇటు వస్తూంటే నువ్వు నాకు తగిన సాదాచీర ఒకటి పంపించు. అది నే తప్పకుండా కట్టుకుంటాను. ఆ పంపించేది కాస్త గట్టిగా రెండేళ్ళు మన్నేదిగా పంపించు. ముతకదయినా. దాన్ని నే అమిత ఆనందంతో వాడుకుంటాను. అది కంటబడినప్పుడల్లా నిన్ను జ్ఞాపకం తెచ్చుకుంటాను. సరేనా ? పుట్టింటి దగ్గర నుంచి వచ్చిన వస్తువు ఆవగింజకంటె చిన్నదయినా, అది ఆడవాళ్ళ మనసులకి ఎంత విలువగా కనిపిస్తుందో నీకు తెలియటం దుర్లభం. ఇప్పటికయినా అర్థమయిందా ?"

అక్కయ్య చెప్పిన మాట నిజమే మరి, న్యాయంగానే చెప్పింది. నేనే విధంగానూ ఆవిడ వాదాన్ని ఖండించలేకపోయాను. అంచేత

ఊరికే ఆవిడ ముఖం కేసి చూశాను. ఆవిడ కళ్ళల్లోకి చూస్తూ, ఆవిడ హృదయాంతరాళంలో భావం గ్రహించటానికి ప్రయత్నం చేశాను. ఆవిడలో ఏ కోశానా అహంకారంగానీ, వగగానీ, క్రౌర్యంగానీ లేవు. ఆవిడ చెప్పిన మాటలు త్రికరణ శుద్ధిగా చెప్పినవే। వస్తువు ఉపయోగ పడాలనే వుద్దేశ్యంతోనే చెప్పింది. ఏ వస్తువయినా అక్కరకు రావాలి; దేన్నీ దురుపయోగం చేయకూడదు; వృధా చేయకూడదు అనే విష యాలు బీదరికంలో వున్నవాళ్ళకి నియమాలులాగా ఏర్పడుతాయి. ఇంట్లో మిగిలిన వాళ్ళకి లేనటువంటి భారీతనం ఏ ఒక్కళ్ళకీ తగదు — అనే సూత్రంకూడా ఆవిడకి గృహిణీ ధర్మం చేసిన సదుపదేశం. మిగిలిన వాళ్ళందరినీ విస్మరించి ఆవిడ కొక్కర్తెకూ జరీచీర తెచ్చినవాణ్ణి నేనెంత తెలివిగలవాణ్ణి నిజానికి। కాని నా కంతమాత్రపు ఆలోచన ఎక్కడిది? అసలు మా అమ్మే ఇవన్నీ ఆలోచించి, అందరికీ తగిన సామాన్లూ సరంజామా సేకరించి, నా చేతికిచ్చి పంపించి వుండాల్సింది. కాని ఆవి డకి నే నక్కయ్యను చూడ్డానికి వెళ్ళడమే ఇష్టం లేనప్పుడు ఇంత దూరం ఎందుకు ఆలోచిస్తుంది గనుక।

విధిలేక, ఆ చీర మళ్ళీ నాపెట్లో పడేసుకుని, తిరుగుముఖం పట్టాను. కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ నుంచునివున్న అక్కయ్యని వెనక్కి తిరిగి చూసే ధైర్యం లేకపోయింది నాకు.

# బహిష్కారం

దురదృష్ట దేవత అసలు గుమ్మంలోకి రానేకూడదు. వచ్చినా చుట్టపు రూపంలో మాత్రం బొత్తిగా రాకూడదు. ఎందుచేతంటే అప్పుడు దాన్ని ఎదుర్కోవడం దుర్ఘటమయిపోతుంది. రవంత ధైర్యం వుంటే, పెద్దపులి వచ్చినా ఎదిరించి తుపాకి గురిపెట్టి ఒక దెబ్బ తీసెయ్యవచ్చు. కాని సాక్షాత్తూ బావగారిమీద, స్వంత సహోదరి భర్తమీద తుపాకి బాసు చెయ్యడం అసాధ్యం. అతగాణ్ణి పల్లెత్తు మాటన్నా అఘోరించేది అక్కగారు. ఇక ఆవిడ కష్టం చూసి బాధపడేది తల్లిని. అంచేత ఆఖరుకి అటు తిరిగి అటు తిరిగి మనకు సంప్రాప్తించేది తల్లిని దుఃఖపెట్టాం గదా అనే ఆవేదన. జగన్నాధరావుకి సరిగ్గా ఈ పరిస్థితే ఏర్పడింది.

అతని అక్కగారు తల్లికి గారాబు బిడ్డ: పైగా కాస్త అర్భకురాలు. అంచేత పుట్టింటికి తరుచు వస్తూ పోతూవుండేది. ఆవిడని దిగబెట్టడానికనో, తీసుకెళ్ళడానికనో బావగారూ వస్తూ పోతూండేవారు. కాని ఈసారి వాళ్ళు పుట్టింటి కొచ్చిన తీరే వేరుగావుంది. ''ఇవ్వాళ వాళ్ళతో పాటు కూలీవాడి నెత్తిన ఒక పెట్టి. పరుపూ, చేతిలో ఒక గుడ్డలమూటా కూడా వచ్చి ఇంట్లో పడ్డాయి.

జగన్నాధానికి మొదట్లో ఇదంతా ఏమిటో బోధపడలేదు. కాని ఆ సాయంకాలం అంటే తల్లీబిడ్డలు కొన్ని గంటలసేపు ఏకాంతంగా మాట్లాడుకున్న తరవాత అసలు విషయం విశదమైంది.

అక్కయ్యగారి అత్తింట కొంత కురుక్షేత్రం ప్రారంభమయిందట. తమ తండ్రిగారు చనిపోయిన తర్వాత. ఆయన తాలూకు రొఖ్ఖం అంతా మాయం చేసేసినట్లు ఆరోపించి "ఇక మిగిలిన ఆస్తిలో నీకు

సూదిమొన మోపగలిగినంత చోటుకూడా ఇవ్వమని" నిష్కర్షగా చెప్పేసి, జగన్నాధం బావగార్ని ఇంట్లోంచి తరిమేశారుట ఆయనగారి అన్నదమ్ములు. "ఆయనా ఏ పాపం ఎరగడు. కడిగిన ముత్యంలాగా నిష్కల్మషమయిన వాడూ" అని అక్కయ్య వాదన. ఏది ఏమయినా, ఇప్పుడీ బావగారు అత్తింటనే వుండి, తన అన్నదమ్ములమీద దావాలూ, తగాదాలూ నడిపించాలని నిశ్చయించుకుని, జగన్నాధం ఇంటికి వచ్చి తేవిణీ వేశాడుట.

ఈ పురాణం అంతా ఓపూట చెప్పిన తరువాత అక్కగారు తల్లితో చెబుతూన్న ఫలశ్రుతి మట్టుకు తన చెవులతో విన్నాడు జగన్నాధం. "ఆఖరుకి సత్యమే జయించి తీరుతుందనుకో! మమ్మల్ని ఇంట్లోంచి తరిమేసిన దాయాదులు బాగుపడతారటే అమ్మా ? చూద్దువుగానిగా! ఇప్పుడీయనికి పూర్తిగా కోపం వచ్చేసింది. ఆయనకు కోపం వచ్చిందంటేనా...."

"నిజమేలే తల్లీ !" అని కూతుర్ని ఆశీర్వదించినట్లు పలికి, జగన్నాధాన్నీ, కోడలు వత్సలనీ పిలిచింది తల్లి. ఇంట్లో ఎడమవేపున ఖాళీగా వున్న కొట్టుగది బాగుచేయమని ఆజ్ఞాపించింది. వత్సల చీపురు కట్ట చేతపట్టింది. జగన్నాధం బావగారి సామాను చేరవేశాడు. వాళ్ళ కోసం ఏర్పాటుచేసిన గదిలోకి అక్కగారూ, బావగారూ ప్రవేశించి "సుఖంచమే శయనంచమే" అని అన్న తర్వాతగాని జగన్నాధానికీ, భార్యకీ తమ గదిలోకి వెళ్ళడానికి అనుమతి దొరకలేదు. ఆ రాత్రి జగన్నాధానికి నిద్రే పట్టలేదు. లేచి కూచుని వత్సలని సలహా అడిగాడు.

"ఏమే, ఇప్పుడు ఏమిటే చెయ్యడం ?"

"ఆ ప్రశ్న అసలు నేను వెయ్యాల్సింది"

"అదేమిటి ?"

"ఇన్నాళ్ళూ అత్తగారు ఒక్కర్తే. ఇప్పుడు ఆడబిడ్డకూడా వచ్చారు. ఇహ ఇప్పుడు నా బ్రతుకు అడకత్తెరలో పోక అన్నమాటేగా !"

"నీకు ఏం భయంలేదు. నే నున్నానుగా !"

"ఉంటే మాత్రం చీపురు ముల్లంత చిన్న విషయంలో అయినా మీమాట లెక్కచెయ్యరు అత్తగారు. మిమ్మల్నింకా పాలుతాగే పిల్లాడితో సమంగానే చూస్తారు"

"అట్లాగే, అట్లాగే, నేనూ చూస్తాను చూస్తాను రెణ్ణాళ్ళు. ఇంక ఆపైన నాకు రేగుకొచ్చిందంటే, ఒక్కదెబ్బకి రెండు తునకలు చేసేస్తాను...."

ఆయన ఎంత ధైర్యం చెప్పినా, చెప్పుకున్నా ఆరోజు వాళ్ళ మనసుల్లో, ఏదో భయం భయంగానే వుంటూ వచ్చింది. ఇక ఇప్పుడు వాళ్ళిద్దర్లోనూ ఒకళ్ళ కొకళ్ళే తప్ప ఇతరత్రా ఏ ఆధారమూలేదు. ఒకరి అంద ఒకరు చూసుకుని, ధైర్యం రెట్టించుకుని ఎప్పటికెక్కు అప్పుడు ఏదో విధంగా విడదీసుకు పోతూండడంకంటే ఇంకో మార్గం లేదని ఏమీ సంప్రదించుకోకుండానే అర్థం చేసుకున్నారు.

ఆ రాత్రి వారి ఆలింగనము ఇంకొంచెం గాఢమయింది.

ఆవూరి వారందరికీ జగన్నాధం మంత్రిలాంటివాడు. అతని వయసు వాళ్ళింకో ఏడెనిమిది మందున్నారు. ఆ వూళ్ళోవాళ్ళు అందరూ జట్టుగా కలిసి తిరుగుతూ ఎవళ్ళింట్లోనో ఒకరి ఇంట్లో చేరేస్తూ ఏపని వచ్చినా కలిసి చేసుకుంటూ, ఒకళ్ళ కొకళ్ళు సహాయం చేసుకుంటూ, కాస్త తీరిక గలిగినప్పుడు అందరూ కూచుని పేకాడుకుంటూ రోజులు గడుపుతూండేవారు. అసలే అది బొత్తిగా చిన్న గ్రామం. అంచేత అక్కడ సహచర్యం, సహభావం, సహకారం అప్రయత్నంగానే వుంటూవుండేవి. ఒక్క కాలవలో పారే నీరులాగే జనమే అందరూను. ఎవ్వడూ ఏ ఇంటికీ పరాయివాడు కాదు.

ఆ మర్నాడు పశువులని కాచేవాడికి స్వాధీనంచేసి ఇంటికి వచ్చి

నప్పుడు, జగన్నాధంతోపాటు గణపన్నా, మల్లయ్యా కూడా వున్నారు. ఇంట్లోకి వచ్చీరాగానే "అమ్మా, మాకు తింటానికేమయినా పెట్టవే" అని ఒక్క మామూలు కేకవేశాడు, ఉత్సాహంగా జగన్నాధం.

తల్లి అరిటాకు పాయలువేసి, గోధుమ రొట్టెలూ పచ్చడీ వడ్డించింది. ఆ ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ, పేలుకుంటూ దవడలాడిస్తున్నారు. వంటింట్లో వుద్భవించిన ఆ నవ్వులూ, ఆ పరిహాసాలూ, వెనకవేపు మండువా వసారాలో కూచుని, దస్తావేజులు తిరగవేస్తూన్న అల్లుడుగారి చెవిని పడ్డాయి. లేచి ఇంట్లోకి వచ్చాడు. వినాయకుడికి వుండేంత బొజ్జా, బొడ్డు కిందికి కట్టుకున్న పంచా, మెళ్ళో హారంలా వేళ్ళాడేసుకున్న జంజమూ, కబంధుడిలాగ బుజాన్ని ఒరుసుకుంటూన్న దవడా, అడ్డమేగాని నిలువు కనిపించని ఆకారమూ, అరిటి అస్తంలాగ గుత్తంగా అంటుకుపోయివున్న చేతి వేళ్ళల్లో బిగించి పట్టుకున్న బీడీ, ఉండుకుంటూన్న నల్లటి ఆసామీ ఒకడు గుమ్మంలో నుంచుని తమవేపు నిప్పులు కక్కుతూ చూస్తున్నట్టు గమనించగానే, పంక్తిలోవున్న వాళ్ళ నవ్వులాటలూ,కబుర్లూ మధ్యలోనే ఆగిపోయాయి. గణపన్నకి, మల్లయ్యకి చెయ్యీ నోరూ కూడా ఆడలేదు.నోటిలో ముద్దలు మింగుడు పడలేదు.

"ఏమోయ్! మీకెవళ్ళకీ ఇఛ్ఛా వాకిఛ్ఛా లేవా ఏమిటి? పరాయి వాళ్ళ ఇంట్లో బాసినిపెట్టు వేసుక్కూచుని, ముద్దలు ఎగరెయ్యటానికి సిగ్గూ బిడియమూ లేవూ మీకు?"

వాళ్ళిద్దరూ అమాంతం విస్తళ్ళ ముందు నుంచి లేచి బయటి కెళ్ళిపోయారు. తన ఆహ్లాదపూరితమయిన చూపుని అమ్మవేపు తిప్పి, అక్కయ్య తన భర్త ప్రవర్తనకి వ్యాఖ్యానం చెప్పింది: "చూశావు చే ఆయన వ్యవహార జ్ఞానం!" కాని అల్లుడిగారి లౌకికదృష్టి అత్తగారికి

అట్టే నచ్చినట్టు కనిపించలేదు. జగన్నాథం కొయ్యబారిపోయి అలా నోరు తెరుచుకునే వుండిపోయాడు. ఎవరో తన కంఠం తుంచేసినట్టని పించింది.

అంతట్లో బావగారు జగన్నాథంమీదే నాలుగు అక్షింతలు వేశాడు:

"ఏం జగన్నాథం ! మీ ఇంట్లో ఏమయినా సమారాధనా ఏమిటి? దోవన పోయేవాళ్ళందరినీ పిల్చుకొచ్చి మేపుతూండడానికి ! ఇట్లా అయితే కాపురం ఓ కొడికి తెస్తావయ్యోయ్ !"

ఆరోజా రోజంతా జగన్నాథానికి మనసులో నెమ్మదిలేదు. జరిగిన సంగతి గ్రామంలో అందరికీ అరక్షణంలో తెలిసిపోయింది. రెండో రోజున మంచెదగ్గిర ఈ విషయమే చర్చించుకున్నారు. "ఇహమీదట జగ్గన్న ఇంటికి వెళ్ళేముందర కాస్త ఆలోచించి వెళ్ళటమే మంచిది" అన్నాడు గణపన్న. జగన్నాథానికి ముఖం వాడిపోయింది. తన స్నేహితులు తన ఇంటికి రాకపోతే తను మాత్రం ఏ ముఖం పెట్టుకు వాళ్ళ ఇళ్ళకి వెళ్ళతాడు గనుక. ఆ సాయంత్రం మల్లయ్య వాకిలి ముందరి నుంచే వచ్చాడు. అతను పిలిచినప్పటికీ జగన్నాథం అటు పోనేలేదు.

జగన్నాథం పొద్దున్నే ఇంటికి వచ్చేటప్పటికే, బావగారు విస్తరి ముందర కూచుని చద్దన్నం ముద్దలు ఎగరేస్తూ కనిపించాడు. జగన్నాథానికి వెయ్యి తేళ్ళు కుట్టినట్టయింది. నిజానికి ఇంటి యజమాని తనూ. అయినా తను ఇంటికి వచ్చేటంతవరకూ అయినా బావగారు ఓపిక పట్ట లేక పోయారు. అసలు కన్నకొడుకుని కూడా నిర్లక్ష్యం చేసి అల్లుడి గారికి ఒడ్డించడానికి ఆవిడకి ఎలా మనసొప్పిందో ! భర్త ఇంటికి రావడం చూసి, వత్సల ఒక విస్తరి వేసింది. అది చూచిన జగన్నాథం పుల్లవిరుపుగా మాట్లాడాడు :

"నా కిప్పుడేం అక్కర్లేదు. నేను తినేవచ్చాను" అని; అక్కడి

నుంచి చక్కాపోయాడు. వత్సలకి ఆ మాటలో ఏమాత్రం నిజమున్నదో అర్థమయింది. ఇంకొంచెం సేపయాక వత్సల బావిదగ్గిర బియ్యం కడుగు తూండగా, అతనూ ఆ ప్రక్కకే వచ్చేడు కాడవలి సానపట్టడానికి.

"మీరు ఏమీ తినకండి. నేనూ ఏమీ తినను. మనిద్దరంమట్టుకు దర్భలల్లే అప్పుకుపోదాం. సరేనా ?"

"అదేమిటి నువ్వు చద్దితినలే ?"

"ఇంట్లో వున్నవాళ్ళల్లో ఒకళ్ళు ఉపోషంగా వున్నప్పుడు నా కడుపు నింపుకోవచ్చునని మా అమ్మ నేర్పలేదు మరి !" అంటూ నీళ్ళు నిండిన కళ్ళతో ఒకసారి చూసింది జగన్నాధం వేపు.

అతను "చ్చొ....చ్చొ....చ్చొ...." అంటూండగానే, ఆవిడ ముందరి ప్రకరణానికి అవకాశం ఇవ్వకుండా అక్కడినుంచి వెళ్ళి పోయింది. పెరట్లోంచి వసారాలోకి, వసారాలోంచి ఇంట్లోకి చకచకా చక్కాపోయింది. ఆవిడ చేతులోవున్న తాటాకుబుట్ట మూలనుంచి ఒక నీటి ధారకూడా ఆవిడవెంటే సాగింది. అది నిజానికి ఆవిడ హృదయంలో వుండే వాత్సల్యమేమో ననిపించింది జగన్నాధానికి.

జగన్నాధం ఇంటి ముందరి వసారాలో ఒక ఎత్తయిన అరుగు వుంది. దానిమీద తిష్టవేసి, వచ్చేపోయే వాళ్ళందరినీ వెటకారం చేస్తూ, పలకరిస్తూ వుండేవాడు బావగారు. ప్రతిరోజూ పొద్దుట వేళ ఇదే ఒక అనుష్టానంగా అభ్యాసం చేసేవాడు. ఎవరయినా వాకిట్లోకి రావడమే తరువాయిగా, అతనిలో ఏదో ఒక లోపం కనిపెట్టి, దాని విషయం చమత్కరించి, ఎత్తిపొడిచి, అదే ఒక హాస్యంగా తనే పకపకా నవ్వే వాడు. అంతట్లో ఆ వచ్చిన వ్యక్తి ఏదయినా కొంచెం కోపం గీపం తెచ్చుకున్నట్లు కనిపిస్తే, బావగారు భార్యవేపు తిరిగి, కళ్ళు మిటకరించి. చిరునవ్వులోకి ఒదిగిపోయేవాడు. ఒకరోజున ఏదో పనిమీద దామూ రావడం తటస్థించింది జగన్నాధం కోసం.

"దయచెయ్యండి గురువుగారూ !" అని స్వాగతం పలికారు బావ గారు. ఆ వూరికి మార్గ దర్శకులలో ఒకడుగా వ్యవహరిస్తూండడాన్ని వేళాకోళం చేయాలని బావగారి ప్రయత్నం. కాని దామూ అతి జమాయి కుడిలా జవాబు చెబుతూ "బావగారూ ! నాకింకా అంతటి పదవి రాలే దండి !" అన్నాడు.

"అయితే ఎప్పుడు వస్తుందేమిటి ?"

"ఏదో నేనుకూడా మా అత్తగారింటికి వెళ్ళి, బావమరిది నెత్తిని చేయిపెట్టి, వాళ్ళ అరుగుమీద బైఠాయించి, పెత్తనం మొదలెడితేనేగాని రాదనుకుంటాను !" దామూ మాట్లాడ్డం అయితే బహుమెత్తగానే మాట్లా డాడుగాని, అతని మాటలు ఒక్కొక్కటి విసిరివేసిన కంకరరాళ్ళలాగే తగిలాయి బావగారికి. అంచేత తక్షణం చేతిలోవున్న బీడీముక్క అవ తలకి గిరాటేసి, అరుగుదిగి, గదిలోకి చక్కాపోయాడు. సావిట్లోంచి వింటూన్న జగన్నాధానికి భలేపని జరిగిం దనిపించింది. వత్సలకేసి చూశాడు. ఆవిడ ముఖంలోనూ ఒక తృప్తి కలిగినట్లు కళ్ళు మెరుస్తూం డడం కనిపించింది.

ఆరోజు సాయంత్రం బావగారు వసారాలో సభ తీర్చారు. ముక్కు స్వరంతో మాట్లాడుతూ, ఎడమ అరచేతిలో కుడి గుప్పిడితో గుద్దుతూ "నేను నా అత్తవారింటి కొస్తే ఈ ఊళ్ళో వాళ్ళ బాబు సొమ్మేం ఖర్చయింది అంట ?" అని సవాలు చేసేసరికి, ప్రక్కని కూర్చునివున్న భార్యామణి "కళ్ళు కుడుతున్నాయి గాబోలు దరిద్రులకి !" అంటూ పోకచెక్కలు తరుగుతున్న అడకత్తెర వేగం హెచ్చించింది.

"ఎవళ్ళిష్ట మొచ్చినట్లు వాళ్ళు వాగుతారు. వాళ్ళ మాటలు లెక్క చెయ్యడమెందుకు మనం ?" అని ఊరడింపుగా, గోమయంవేసి అలి కేసినట్లు పులిమేయడానికి ప్రయత్నించింది ఆపేక్షగల అత్తగారు.

ఆ తరువాత ఇంట్లోవున్న ముగ్గురు పెద్దమనుషులూ, అంటే అత్తగారూ, కూతురూ, అల్లుడుగారూ ఇంటి బాధ్యతలు పంచుకున్నారు. అంటే, అత్తగారూ, ఆడబిడ్డా కలిసి కోడలు వత్సలని తిన్నని మార్గం లోకి తీసుకువచ్చే బాధ్యతనీ; అక్కగారూ, బావగారూ కలిసి జగన్నాథాన్ని మంచి మార్గంలో పెట్టే బాధ్యతనీ వహించారు. పొలంమీదా, తోటలోనూ పని ముగించిన తర్వాత జగన్నాథం తిన్నగా ఇంటికి వచ్చేయాలని బావగారు నిశ్చయించారు. జగన్నాథానికి ఆ స్నేహితులతో తిరగటం, వాళ్ళతో కులాసా కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవటం చాలా అనవసరం. అంచేత అతను తిన్నగా ఇంటికి వచ్చి, కాస్సేపు బావగారి కాళ్ళు తొక్కి, నడుం దిగదీసి, వీపు గోకి, సాయంత్రపు సమయమంతా వెళ్ళబుచ్చటమే శ్రేష్ఠమనీ, అదే జగన్నాథంయొక్క భౌతిక దేహానికి వున్న ప్రయోజనమని బావగారి సిద్ధాంతం. జగన్నాథాన్ని ఎల్లప్పుడూ తన కళ్ళ ఎదుటే వుంచుకుని అతన్ని తిన్నని మార్గంలో నడిపించటం బావగారయిన తనకి ముఖ్య కర్తవ్యమని కూడా స్పష్టంచేశాడు. ఏద యినా ఒకనాడు తను విధించిన ఈ కార్యక్రమాన్ని జగన్నాథం ఎగ వేసినట్లూ, చుట్టుపక్కల ఎవరింటోనో పేకాడుతున్నట్లూ వాసన తగి లిందంటే బావగారు అరుగుమీంచి లేచి అంగణంలోకి వచ్చి నుంచుని, "జగన్నాధమ్ మ్మ్మ్...." అని ఒక్క పొలికేక పెట్టేవాడు.

దాంతో చేతిలోవున్న పేక క్రిందపడేసి, ఇంటికి పరుగెత్తుకు వచ్చేసేవాడు జగన్నాథం. ఇంతట్లో మళ్ళా అరుగెక్కి కూర్చున్న బావ గారు నేరస్తుడయిన బావని ఎదుట నుంచోపెట్టుకుని, ఎడమ అరిచేతిలో కుడి పిడికిలి దబాయిస్తూ "అక్కడ కూచుని పేకాడితే, ఏమిటోయ్ నీకొచ్చిన లాభం ? అహఁ, ఏమిటంట నువ్వు సంపాయించిన ఎస్టేటు? తెలివితక్కువ పనులు ! నా ఎదురుగుండా కూచుని విష్ణు సహస్ర నామాలు వల్లించు !"

నిత్యకృత్యమయిపోయిన ఈ అధికారమూ, అవమానమూ సహించలేక ఒకరోజున జగన్నాధం తిన్నగా తల్లి దగ్గిరికి వెళ్ళి, "అమ్మా! బావగార్ని వాళ్ళ వూరు దయచెయ్యమని చెప్పు. చెప్పడం నీకు కష్టమయితే నేనే చెబుతాను" అన్నాడు.

తల్లి మాత్రం పత్తికాయలంత గుడ్లు చేసుకుని అతనిమీదే కోపం తెచ్చుకుంది.

"శుద్ధ శుంఠవు లాగున్నావు! వాళ్ళింట్లో అన్నం కరువయి మన ఇంటికి వచ్చాడనుకున్నావా ఏమిటి? నీకు ఈరోజున అండగా తండ్రిలేడు, సహాయంగా సోదరులూ లేరు. అటువంటి తరుణంలో అన్నివిధాలా ఆదుకునేందుకు అతను రావడం ఎంత మంచిదయింది! చింతామణి రత్నాన్ని రాయనుకుని కాలితో తన్ని పారేసేలాగున్నావు. అతనికి కోర్టుల్లోనూ, కచేరీల్లోనూ ఎంత పరపతీ, పలుకుబడీ వున్నాయో తెలుసా నీకు? అక్కగారంటే నీకుండే అపేక్ష ఇంతేనా అయితే? అందుకే ఒకత్తే, ఒక్క అక్కగారితో సరిపెట్టాడు భగవంతుడు. నువ్వేదయినా అవక తవకగా ఆయనని అన్నావంటే, నేను నీ ఎదటే ముక్కు మూసేసుకుని ఊపిరి వదిలేస్తాను...."

జగన్నాధానికి ఎంతో కోపం వచ్చింది. కాని తల్లిని ఏమీ అనలేక పోయాడు. అంచేత అమాంతం అక్కడినుంచి లేచి, తోటలోకి వెళ్ళి పోయాడు. ఆ వనవృక్షాల చల్లటి నీడకింద, పారుతూన్న కాలవల మధ్యనా వున్నా అతని మనసులోవున్న మంట చల్లారలేదు. అంతట్లో అతనికి వత్సల కనిపించింది. ఆవిడ అక్కడే కాలవలో వుతికిన బట్టలని పోకచెట్లకి కట్టిన దండెంమీద ఆరవేస్తూంది. ఒకవేపు ముడివేసి తడిపంచని రెండో కొంగు పట్టుకు బిగుతుగా లాగేటప్పటికి దండెం కింద పడిపోయింది. ఇంతట్లో ఆవిడకి భర్త అంతదూరంలో కనిపిం

చాడు; పిలిచింది. దగ్గరకి వచ్చాక దండెం కాస్త కట్టిపెట్టమంది. ఆవిడ కా సహాయం చేయడానికి బదులు "ఉత్త తెలివితక్కువ దానివి! గాడిదవి! బుద్ధిలేనిదానివి!" అని తిట్టడం సాగించాడు జగన్నాధం. నిష్కారణంగా తన నెత్తిన ఇన్ని తిట్లు వర్షిస్తూంటే విని ఊరుకోలేకపోయింది.

"యీ గుడ్డలమేటి చూడండి! మీ అక్కగారివి, బావగారివీని. ఇవన్నీ వుతికేటప్పటికి నాదండ పడిపోయింది. అయినా మీరు కూడా నన్నే తిడుతున్నారు. నే నొక్కదాన్నే బుద్ధి తక్కువదాన్ని కాదు. మా అమ్మకీ, నాన్నకీ కూడా బుద్ధి తక్కువ గనుకనే మీఇంట్లో పడేశారు నన్ను. మీఇంట్లో యావన్మందీ చెప్పుదెబ్బలు కొడుతున్నా ఇన్నాళ్ళూ భరిస్తూనే వచ్చాను. కనీసం మీరయినా దయగా వుంటారనే ఆశతో— ఆఖరికి మీరుకూడా ఇట్లా చేయడం మొదలెట్టే ..." అని ఇక మాట్లాడలేక, రక్తంలేని అరచేతుల్తో మొఖం కప్పుకుని వెక్కివెక్కి ఏడ్వటం ప్రారంభించింది వత్సల. జగన్నాధం చిరాకు మాయమైపోయింది. ఇంత చాకిరీ చేస్తూ నలిగిపోతూన్న దాన్ని తను మాటలతోకూడా నొప్పించినందుకు బాధ కలిగింది. ఇంట్లో పరిబరిపోయిన ఆ భయంకర వాతావరణంలో, ఈఆవిడ ఒక్కత్తే తనకి రక్షగావుంది. అంచేత మళ్ళా మాట్లాడకుండా దణ్ణెం గట్టిగా కట్టేశాడు జగన్నాధం. ఆ తర్వాత ఆవిడ కళ్ళు తుడిచి, ఆవిడ ముఖంమీద విచారానికి బదులు చిరునవ్వు మొలిచేట్టు కూడా చేశాడు.

ఈ ఊళ్ళో వుండి బావగారు చేస్తూన్న ఘనకార్యం ఏమిటంటే, అప్పుడప్పుడు డిచోడీ బస్తీకి వెళ్ళి వస్తూండడం. డిచోడీ ఆ తాలూకాకి కోర్టు కచేరీలున్న వూరు. అక్కడి కోర్టులోనే బావగారు తన అన్నదమ్ములమీద దావాలు వేశాడు. కోర్టు వాయిదాకి డిచోడీ వెళ్ళిననాడు తిరిగి వచ్చి భోజనం దగ్గిర కూచుని బావగారు ఆ కోర్టు సంగతులు అనర్గళంగా మాట్లాడేసేవాడు. కోర్టులో జరిగిన మహాయుద్ధంలో తన

మాటకారితనం ఎంత వీరోచితంగా వుపయోగించాడో భార్యకీ, అత్త గారికీ వినిపించేవాడు. ఆ పరాక్రమంయొక్క వర్ణన అంతా విని విని అత్తగారు "అసలు ప్లీడర్లు ఏం చాలతారు అల్లుడుగారికి ?" అని మెచ్చు కునేది.

గిల్లి కజ్జా పెట్టుకోవడం, లేకపోతే యెవళ్ళెవళ్ళ మధ్యనో తంపులుపెట్టి తగాదా లేవదియ్యడం, రాజుతూన్న చోట కొంచెం నూనె పొయ్యడం, ఆ తరువాత తమాషా చూడ్డం బావగారి అసలు నైజం. ఆ తగాదాలని దావాలలోకి దింపి, ఏమాత్రం వీలున్నా తన రొట్టెమీదకి నెయ్యి సంపాయించుకోవడం బావగారికి పుట్టుకతో పుట్టిన నేర్పు. గ్రామంలో వుంటూన్న ఐక్యత తన విద్యకి ప్రయోజనం లేకుండా చేసేసిందని అతనికి మనస్సులో ఎంతో కష్టంగా వుంది. అంచేత ఎక్కడో ఒకచోట కాస్త నిప్పురవ్వ రేగి, అది ఎంచక్కా మండి, ఆ వ్యవహారం కోర్టుకి వెళ్ళాలనీ, ఆ కోర్టు వ్యవహారాలు చూసిపెట్టే బాధ్యత తనకి వప్పచెప్పాలనీ ఆశపడుతూండేవాడు. అంచేత అతని కాకి చూపు ఆ వూళ్ళో వాళ్ళందరిమీదా సంచరిస్తూ వుండేది. ఉపయోగపడే వాడెవడా అని వెతుకుతూనే వుండేది.

ఆ ఊళ్ళో చింతోబా, రామనాథం అని ఇద్దరు అన్నతమ్ములు. వాళ్ళిద్దరూ ఏనాడో ఆస్తులు పంచేసుకున్నారు. అయినా ఒకరంటే ఒకరు ఆపేక్షగానే వుండేవారు. ఈ బావగారి విషపుదృష్టి వాళ్ళమీద పడింది. వాళ్ళిద్దర్లోనూ రామనాథం కాస్త మెత్తనివాడు. బావగారు వాడిమీద వేశారు వల. తన గొప్పతనమూ, తెలివి తేటలూ ఎంత అసాధారణ మయినవో ఆతనికి నచ్చచెప్పారు కొన్నాళ్ళు. అతనికి తనమీద బాగా గురి కుదిరిందని తోచిన తర్వాత, ఓ రోజున మెల్లిగా సదుపదేశం ప్రారంభించారు :

"ఇవునూ, ఆ కాలువ వద్దునవున్న కొబ్బరిచెట్టు పంట మీవాడు

వాడుకుంటున్నాడేమిటి ? అది నిష్కర్షగా నీ వాటాలోవున్న చెట్టు. నువ్వమాయకుడవు కాబట్టి, నీకు పంగనామాలుపెట్టి అతను ఇల్లు నింపు కుంటున్నాడు. నీ నైజమే వుత్త తుకారామ్ నైజం మరి. ఒక కొబ్బరి చెట్టు పంట అంటే ఏమిటి ? చులాగ్గా 10, 15 రూపాయలు సాలీనాను. నువ్వెందుకు నష్టపడాలి ? నువ్వోపని చెయ్యి: ఈ మాటు వినాయక చవితికి, ఆ చెట్టు కాయ నువ్వు దింపుకో. కావలిస్తే మీవాణ్ని కోర్టు కెళ్ళనీ. నీ తరపున నే చూసిపెడతాను ఆ వ్యవహార మంతా !"

ఒకటికి రెండుసార్లూ, రెండుకి మూడుసార్లూ బావగారు ఈ పల్లవే పాడినకొద్దీ రామనాథానికి కూడా స్వార్థం తలెత్తింది. ఆ తర్వాత ఓ రోజున ఆ కొబ్బరిచెట్టు కాపు దింపించేశాడు. బావగారు మహదానంద పడ్డారు. ఆఖరికి ఒక్క చేప పడ్డదన్నమాట వలలో అనుకున్నారు. చింతోబా ఈ వృత్తాంతం విని రోషం తెచ్చుకున్నాడు. అన్నదమ్ముల మధ్య ఘర్షణ జరిగింది. రామనాథం చెప్పిన జవాబులు వినేటప్పటికి చింతోబాకి కక్ష పుట్టుకొచ్చింది. అతను తక్షణం డిచోడీ కోర్టుకి ప్రయాణం కట్టాడు.

కాని దోవలో దామూ ఎదురయ్యాడు. దామూ అంటే ఆ ఊరికి ఎన్నుకోకుండానే ఏర్పడిన పెద్ద. అతనొక్కడే పంచాయతీకి సమానం. అతను చింతోబాని వెనక్కి తీసుకొచ్చాడు. ఆ మర్నాడు ఊళ్ళో వాళ్ళం దరినీ పిలిపించాడు. అన్నదమ్ము లిద్దర్నీ ఒకచోటికి తెచ్చాడు. ఆ తర్వాత రెండు ముక్కలు చెప్పాడు, ముఖ్యంగా రామనాథాన్నే ఉద్దేశిస్తూ.

"నిరర్థకంగా మాట్టాడ్డం అనవసరం. ఆ చెట్టు చింతోబా హక్కు భుక్తములో వుంటూన్నట్టు వూరందరికీ తెలుసు; నీకూ తెలుసు. నల చక్రవర్తిలో కలిదేవత ప్రవేశించినట్లు, ఈనాడు నీలోకూడా ఒక శని ప్రవేశించింది. అది అసలు నాలుగు నెలలనుంచీ ఈ ఊళ్ళో తిష్టవేసు

కుని కూచుంది. ఈ రోజుకి నిన్ను పట్టుకుంది. ఫరవాలేదు. ఇదుగో, నే నీ కొబ్బరికాయ ఈ తులసి చెట్టుకిర్రింద పెడుతున్నాను. 'ఆ చెట్టు నాకే స్వంతం' అని వీరందరి ఎదుట్ట చెబుతూ ఆ కొబ్బరికాయ తెచ్చుకో. చింతోబా చేత్త నీకే చెట్టు స్వాధీనం చేయిస్తాను. నీ ఒక్కడికేకాదు, నీ వంశ పారంపర్యా నీకు స్వంతమని ఒప్పిస్తాను"

ఆ తర్వాత దామూ లేచి, తులసి చెట్టు దగ్గిర దీపారాధన చేసి, ఆ ప్రక్కన ఒక కొబ్బరి బొండం పెట్టాడు. "లేవోయ్ రామనాధం లే!" అన్నాడు. కాని రామనాధం కూచున్న చోటినుంచి కదలలేదు. కూచున్న వాడు కూచున్నచోటే వణకటం మొదలెట్టాడు. ముఖం వాడిపోయింది. తన తప్పు ఒప్పుకున్నాడు. దామూ చేసిన ప్రియత్నం ఫలించింది.

"రామనాధం! దీన్ని గురించి నువ్వు బాధపడకు;ఇది నీకు పుట్టిన బుద్ధికాదు; అది నాకు తెలుసు. దుష్టులనీడ మీద పడ్డప్పుడు ఇలాగే బుద్ధి గడ్డితింటూంటుంది. ఒక్క సంగతి గుర్తుంచుకో. 'హరహరా' అనే వాళ్లు ఎంతమందయినా వుంటారు. కాని నిప్పుల్లో దూకవలసింది సహ గమనం చేసే ఆడదిమట్టుకే. జరిగిందేదో జరిగిపోయింది. నీలో మంచి తనమూ, నిజాయితీ ఇంకా నశించలేదు. ఇది మా అందరికీ తృప్తి గలి గించే విషయం. ఇంటికి వెళ్ళి నువ్వు దింపుకున్న కొబ్బరికాయలు చింతోబా ఇంటికి పంపించేయి" అని ముగించాడు దామూ.

తక్షణమే చింతోబా లేచి ముందరికి వచ్చి "అక్కర్లేదు. ఈ ఏటి కాపు వాడి పిల్లల్ని తిన్నట్టయింది! వాడి బుద్ధి మళ్ళీ మంచిమార్గంలోకి వచ్చింది. నాకంతే చాలు!" అన్నాడు.

అంతటితో ఆ ఘట్టం ముగిసింది. చేరినవాళ్ళంతా కండువాలు దులుపుకుని లేవబోతున్నారు. అంతట్లో దామూ లేచి మరో విషయం మాట్లాడ్డం ఆరంభించాడు :

"ఆగండి. ఈ సభ ఇంతటితో సమాప్తమవలేదు. ఇవాళ మనం ఇంకొక ముఖ్యమయిన అంశాన్ని గురించి ఆలోచించి, ఒక నిర్ణయానికి రావలసిన అవసరం వుంది. మన ఊళ్ళోకి ఒక విషప్రాణి వచ్చి కూచుంది. జగన్నాథం తల్లి ఆశ్రియం ఇచ్చి పోషిస్తోంది. జగన్నాథం బావగారు తమ ఊళ్ళో ఒక చిచ్చుపెట్టి ఇక్కడికి దయచేశారు. ఈ ఊళ్లోకూడా నాలుగు మంటలు పెట్టి దానిమీద తన రొట్టె కాల్చుకోవా లనే ఆయన ప్రయత్నం. వీణ్ణి గురించి వాడిదగ్గిరా, వాణ్ణి గురించి వీడి దగ్గిరా లేనిపోనివి చెప్పి తగాదాలు పెట్టడమే ఆయనకి విందు భోజనం లాటిది. ఒకడికి 'ముం' అనీ, ఒకడికి 'ద' అనీ ఉపదేశం చేసి, వాళ్ళి ద్దరూ దగ్గిర చేరినప్పుడు ఏ మాత్రం రాజుకుంటుందో చూస్తూ ఆనం దించటమే అతనికి కోరిక. ఈ ఊళ్లో ఐక్యత నాశనం చెయ్యగలిగి న్నాడు అతని పంట పండించన్నమాట. దీనికి విరుగుడుగా ఒక్కటే వుపాయం వుంది. అదేమిటంటే, ఈరోజునుంచీ మన మందరం జగ న్నాథం ఇంటి విషయం పట్టించుకోకపోవటం. జగన్నాథం తల్లి, ఆవిడ గారి అల్లుణ్ణి ఈ ఊళ్ళొంచి వెళ్ళగొట్టేవరకూ మనం వాళ్ళింట్లో పచ్చి మంచినీళ్ళయినా పుచ్చుకోవద్దు. ఆ గడప తొక్కనేవద్దు. మీ అందరికీ సమ్మతమేనా ?"

అందరూ ఏకగ్రీవంగా సరేనన్నారు. పదిమంది నోటా పర మేశ్వరుడు పలికాడు. ఇటువంటి బహిష్కారమే అనాదినుండీ ఊరివారి కున్న నారాయణాస్త్రం. వెలివేయబడిన వాళ్ళు ఆ ఊళ్ళో లేనివాళ్ళ కిందే లెక్క. అటువంటప్పుడు వాళ్ళగతి కుక్కలకీ, నక్కలకీ కూడా పట్టదన్నమాట. ఈ అస్త్రానికి భయపడే ప్రతి మనిషీ తన హద్దుల్లో తను మెలగుతుంటాడు పల్లెటూళ్ళల్లో. అంచేతనే గ్రామంలోని ఐక్యత చెడిపోకుండా వుంటుంది. 90 పాళ్ళు విచారణలు అసలు ఈ పంచాయతీ మూలంగానే పరిష్కారం అవుతుంటాయి. ఎవరయినా పొగరెక్కి

పోకిరీ తనం చేసినా, కోపంవచ్చి అత్యాచారం చేసినా,ఈ పంచాయతీయే వాడి కళ్ళకి కలికంవేసి, ముక్కుకి తాడువేసేది.

ఈ పంచాయతీ నిర్ణయం బావగారి చెవిని పడింది. మనసులో చాలా బాధకలిగింది. నుదుటిమీద ముడతలు పడ్డాయి. బహిష్కారం చేశారు కదా అనికాదు; తన బోనులోపడ్డ రామనాధం అనే కుందేలిని విడిపించేశారు గదా అని. చక్కగా, లాభసాటిగా కోర్టుకి వెళ్ళవలసిన వ్యవహారాన్ని వాళ్ళు అడ్డంకొట్టి అక్కడి కక్కడ తేల్చేశారు గదా అనీ, తనకి కొంతకాలం లాభమూ, కాలక్షేపమూ కలిగించే వ్యాపకాన్ని వేళ్ళతో పీకేశారు గదా అనీ, అతనికి కోపమూ, దుఃఖమూ కలిగాయి.

కాని, హృదయంలో అమితంగా దుఃఖపడినవాడు జగన్నాధం. సంఘంలో తనకిక స్థానం లేదనీ,అంటే ఆ వూరి జనాభాలో తను చచ్చిపోయినట్టే లెక్కఅనీ, తలుచుకుని తలుచుకుని తల్లడిల్లిపోయాడు జగన్నాధం. ఇంటికి వచ్చి రచ్చబండ దగ్గిర జరిగిన వృత్తాంతమంతా తల్లికి చెప్పాడు. ఒక్కక్షణం ఆవిడా ఆందోళన చెందింది. అల్లుడుగారి తెలివిణీ వల్ల వచ్చినదే ఈ ఆపద అని గుర్తించలేనంత మూర్ఖురాలు కాదావిడ. బహిష్కరణ అంటే ఎంతటి శిక్షో,దానివల్లకలిగే ఇబ్బందు లేమిటో ఆవిడకి బాగానే తెలుసు. చూచాయగా సూచిద్దామని ఆ విషయం అంతా అల్లుడిగారితో చెప్పింది. తక్షణం ఆయన ఉగ్రుడైపోయి, ఎడమ అరచేతిలో కుడి గుప్పిడి బాదుతూ—

"మీరేం గాభరా పడకండి! వాళ్ళు అప్పళంగా తింటూండే పప్పూ, బియ్యమూ మిగుల్తాయి; కాఫీ ఫలహారాలు మనకే లాభం. ఈ ఊరి వాళ్ళు మనకు చేస్తూన్న ఉపకారమేమీలేదు. వాళ్ళు వెలివేసి నందువల్ల మనకి పోయేదీలేదు. నమ్మకంగా వుండేవాణ్ని నే నున్నాను మీకు అండదండగా. ప్రతి ఒక్కడికీ బుద్ధి చెబుతాను చూస్తూవుండండి.

బహిష్కారం చేస్తారేం ? ఇక్కడంత సగం చచ్చిన వాళ్ళెవళ్ళూ లేరు అని చెప్పండి !"

అల్లుడుగారి వాక్శౌర్యంవల్ల కొంత ఊరడిల్లింది అత్తగారు. కాని, ఆ మర్నాటినుంచే ఈ బహిష్కరణయొక్క ఫలితం కనిపించ సాగింది. ఒక్కడుకూడా వాళ్ళ గుమ్మం ముందరికి రాలేదు. వినాయక చవితినాడు చంద్రుణ్ణి చూడగూడదనీ, జనం ముఖం మరో పక్కకి తిప్పుకునీ, లేకపోతే నేల చూస్తూనూ ఎలా నడుస్తారో, ఆ పద్ధతిని నడవటం మొదలెట్టారు. ఈ ఇంటి మనుషులు ఏ వీధిని కనుపించినా కూడాను. ఇరుగు పొరుగు ఇళ్ళవాళ్ళు కూడా అసలు ఈ ఇంటివేపు చూడడమే పాపం అన్నట్లు, ఇంకో పక్కకి చూస్తూ వీధిలోకి వచ్చే వాడు. జగన్నాథం కొంపలో ఎవడో కుష్టురోగి వున్నట్టు ప్రవర్తించారు జనం అందరూ.

ఆ రోజునుంచీ జగన్నాథం ఖిన్నుడయిపోయాడు. సగం చచ్చి పోయాడు. అతనికి తిండిమీదా, పనిమీదా కూడా రుచి చచ్చిపోయింది. ఏ విషయంమీదా ఆసక్తిలేకుండా పోయింది. సరీగా భోజనం చేసేవాడు కాదు; ఎవరితోనూ మనసిచ్చి మాట్లాడేవాడు కాదు. ఏ పనిచేసినా తన కిక సుఖం కలగదనే నిశ్చయానికి వచ్చాడు. అకారణంగా పొలంలోంచి ఇంటికి వచ్చేసేవాడు, లేకపోతే రోజురోజంతా తోటలో ఏ చెట్టునీడనో, గడ్డిమీదనో పడుకుని ఈ లోకంమీద ధ్యాసే లేనివాడిలా వుండేవాడు.

ఈ వాలకం చూసి వత్సలకి కడుపు చెరువయిపోయేది. ఆవిడ ఇంట్లో వాళ్ళకి తెలియకుండా బయల్దేరి తోటలోకి వచ్చి చూసేది. అతని దగ్గిర కూచుని కంటతడి పెట్టుకునేది. మనసొస్తే పలకరించేవాడు. లేక పోతే కసిరికొట్టేవాడు. అప్పుడావిడ అతనికి వినిపించేలాగ స్వగతం మాట్లాడుకునేది. "ఇంట్లో మీ అందరికీ కోపాలుంటాయి; తాపాలుం

టాయి; కష్టాలుంటాయి; సుఖాలుంటాయి; సంతోషమూ.దుఃఖమూ మీకే వుంటాయి. నేను మట్టుకు నల్లరాయిని.మీరంతా నరమానవులూను.నన్ను గురించి ఎవరుమట్టుకు ఎందుకు ఆలోచించాలి ? ఎవరుమట్టుకు నన్ను పరామర్శించాలి ? నా బాధ ఎవరికీ కనిపించదూ. కనీసం ఆ భగవంతుడయినా గమనిస్తే అంతేచాలు...."

ప్రతి సంవత్సరమూ వచ్చినట్లే ఆ సంవత్సరమూ భాద్రపద మాసం వచ్చింది. ఇంటింటా విఘ్నేశ్వరుణ్ణి పెట్టుకున్నారు. కాని జగన్నాధం ఇంటికి ధూప దీపాలప్పుడూ, ఉద్వాసనప్పుడూ కూడా ఎవరూ రాలేదు. పంచఖాద్యాలలో గుప్పెడుకూడా ఖర్చుకాలేదు. ప్రతి సంవత్సరమూ జగన్నాధం ఎంతో చక్కటి మండపం కట్టేవాడు. ఈ సంవత్సరం నాలుగు మామిడాకులు గుచ్చి తోరణం కట్టడంకంటే ఇంకేం చెయ్యలేదు. ఒక్క టపాకాయ కాల్చలేదు. బావగారు మంత్రాలు చదువుతుంటే తను పూజచేశాడు. ఆ పూజ అంతఃకరణ పూర్వకంగా లేదు. ఆ పూజవల్ల ఆనందం కలగలేదు. ఆ మర్నాడు ఉద్వాసన చెప్పి ఏదో దొంగపని చేస్తున్నట్టు తానొక్కడే గణపతిని మోసుకువెళ్ళి ఏటిలో ముంచేసి వచ్చాడు.

ఆ రాత్రి ఊళ్ళో బ్రహ్మాండమయిన ఉత్సవం జరుగుతోంది. ధిమధిమమని మృదంగం పలుకుతోంది. తాళాలు మోగుతున్నాయి.పిల్లంగోవి పిలుస్తోంది; టపాకాయలు మోగుతున్నాయి. హారతిచ్చినప్పుడు చదివే మంత్రపుష్పం తారస్థాయి అందుకుంది. ముసురు పడుతూన్న ఆ చీకటి రాత్రిలో కూడా సంగీతమూ, సంతోషమూ పెల్లుబికిపోతున్నాయి. ఇంటింటినుంచీ తెచ్చిన వినాయక విగ్రహాలు ఏటిలో మునుగుతున్నాయి. అరటిపళ్ళూ, నారింజపళ్ళూ, వెలగపళ్ళూ పందిళ్ళనుంచి విడి పడుతున్నాయి పంచఖాద్యాలు, ప్రసాదము ప్రతివాడు పప్పరిస్తున్నాడు.

ఉత్సవున్న జనం అంతా పిన్నా పెద్దా అనే తేడాలేకుండా, ఒక్కచోట చేరి పండుగ చేసుకుని ఆనందపడుతున్నారు.

కాని, వాస్తవంగా చూస్తే గ్రామంలో జనానికి కూడా అంతటి మహదానందం ఏమీ కలగలేదు. ఆ రాత్రి కనీసం వందసార్లయినా జగన్నాధాన్ని జ్ఞాపకం తెచ్చుకున్నారు. ఈ పర్వదినం రోజున జగన్నాధాన్ని ఒక బెడ్డ ముక్కలాగా దూరంగా పారేశామనే దుఃఖం వాళ్ళల్లో ప్రతి మనిషినీ బాధిస్తోంది. జగన్నాధం అంటే ఆ వూరి మొత్తంమీద ఉత్సాహంవున్న మనిషిగా వుండేవాడు. ప్రతి విషయంలోనూ అతనిదే ప్రాముఖ్యత. ఉద్వాసన రోజున ప్రతి ఇంట్లోనూ గణపతిని అతనే మొదట లేవదీసేవాడు. ఉత్సవంనాటి రాత్రి భజనలో అతని చేతుల్లో కనీసం ఒక కంజీరయినా వాయిస్తూ వాయిస్తూండగానే బీటపడేది."రాజాధి రాజాయ" పాడటం మొదలుపెట్టినప్పుడు అతని గొంతుక ఖంగుమంటూ అందరి గొంతుకల్నీ ముంచేసేది. పేకాడటానికి కూచుంటే, అతని చేతి ముక్కే పెద్ధనమోగేది. ఎక్కడవున్నా నవ్వుతూ వుండేది ఆ ముఖం. అందుచేతనే ఈ సంవత్సరం ప్రతి ఇంటా అతనులేని లోపం గుర్తు కొచ్చింది. అతనిమీద ఎవరికీ ద్వేషంలేదు. అయినా అతను మాత్రం అందరికీ దూరంగా వుండవలసి వచ్చింది.

చాలామంది ఇళ్ళల్లో రోజున్నర అయాక గణపతికి ఉద్వాసన చెప్పారు. కొందరు ఐదవ రోజునా, కొందరు పదోరోజునా చెప్పారు. ఇహ ఆ తర్వాత పదిహేను రోజులు ఇంటింటా మహాలయ పక్షం పాటించారు.ఆఖరిరోజున పిండివంటలతో భోజనం వుంటుంది. "ఇష్టైః సహ భుజ్యతామ్" అనే శృతి వాక్య ప్రకారం ప్రతి ఇంట్లోనూ ఇరుగు పొరుగు వారిని పిలిచి పంక్తి తీర్చుకుని భోజనం చేయటం విధిగా పాటించే ఆచారం. జగన్నాధం ఇదంతా చూస్తూనే వున్నాడు. కాని

సందర్భంలోనూ అతనికి వంచనే జరిగింది. ఎవరింట్లో ఈ పబ్బం జరుపుకుంటున్నారో ఆ ఇంటికి, పెరట్లో కూరగాయలూ, ఒక ముంతెడు పెరుగూ పంపించటం ఆ ఊళ్ళో ఒక ఆచారం. జగన్నాధం ఇంట్లో పాడి ఆవు వుంది. పందిరిని దొండకాయాలూ, కాకరకాయలూ వేళ్ళాడు తున్నాయి. కాని వాటిని పంచుకోవడానికి మాత్రం ఎవరూ రాలేదు. ఇచ్చి పుచ్చుకునే ఆనందం జగన్నాధానికి ప్రాప్తి లేదు. ఇదంతా అతనికి దుర్భరమనిపించింది. రోజు చెల్లగా రోజు మరింత పొడుగయినట్లూ, మరింత కంటకావృతమయినట్టూ కనపడింది.

ఆపైన ఒకరోజున తనకేదో ఆలోచనవచ్చి, తిన్నగా దామూ ఇంటికి వెళ్ళాడు జగన్నాధం. దామూ ఎంతో ఆదరంగా "దా, కూచో" అని పిలిచాడు. కాస్సేపు మూగవాడిలాగే కూచున్నాడు. ఆ తర్వాత మట్టుకు నట్టుతూ, మెల్లిగా మాట్లాడాడు జగన్నాధం:

"దామూ అన్నయ్యా, మీరంతా నన్ను వెలేశారు. వెయ్యాల్సిం దేలే నన్ను. నిజానికి నేనే వింక ఈ గ్రామంలో బతకలేను. అంచేత ఈ ఊరు వదిలి వెళ్ళిపోతున్నాను. చెప్పకుండా వెళ్ళిపోయాడంటారని నీ చెవిని వేస్తున్నాను. ఇంట్లో ఎవరికీ తెలియకుండా,రాత్రికి రాత్రి చీకటిలో...."

ఆ తర్వాత మాటలు వెక్కిళ్ళలో మునిగిపోయాయి. అతనికి ఊరు వదిలి తను వెళ్ళటం అంటే, బొంది వదిలేసి ప్రాణాలు వెళ్ళిపోతూ న్నంత బాధగా వుంది. అది చూసి దామూ కూడా చాలా కలవరపడి పోయాడు. జగన్నాధం దగ్గిరికెళ్ళి అతని బుజంమీద చేయి వేశాడు దామూ —

"జగ్గూ! నువ్వట్లాంటి పని ఏదీ చెయ్యకు. ఈ వెలి నీమీద మేం వేసింది కాదు. మామీదే మేం వేసుకున్నాం. ప్రతి సంవత్సరమూ గణ పతి నవరాత్రిళ్ళయ్యాక నేను గ్రామ సమారాధన చేసేవాణ్ణి; నీకు తెలు

సుగా ! ఈ సంవత్సరం చెయ్యలేము నేను. ఎంచేత ? చెప్పు చూద్దాం? నిన్ను పిలవడానికి వీలులేదుగదా అని. నామాట నమ్ము జగన్నాధం ! నేను మోడుతోపాటు చిగురుగూడా కాల్చేశాను. నాకు తెలుసు. కాని విధి లేకపోయింది. కాని నువ్వు మాత్రం తొందరపడి అకార్యం ఏదీ చెయ్యకు. ఇంకా కొద్దికాలం ఓపికపట్టి ఓర్చుకో ! ఆ తర్వాత అంతా సర్దుకుంటుంది. నేనూ వెయ్యి కళ్ళతో గమనిస్తున్నాను...."

"నావల్లకాదు దామూ. ఇంకొక రోజుకూడా ఓర్చుకోలేను. వినాయక చవితి ఇల్లాగే వెళ్ళిపోయింది. దీపావళి వెళ్ళిపోతుంది ఇలాగే. మీరంతా ఒకచోట చేరతారు. ఇంటింటికి వెళ్ళి తీపి తింటారు. నన్ను ఎడం చేస్తారు. నాయిల్లు ఎడంచేస్తారు. మీరు పేకాడుకుంటారు. ఆనందంగా గడుపుతారు. నేను మాత్రం ముఖం చాటేసుకుని కూచోవలసి వస్తుంది. కుష్టువాడిలాగా దూరంగా వుండాల్సి వస్తుంది. గ్రామస్తులచేత బహిష్కరించబడినవాడు గ్రామంలో వుండడమే తప్పు. నా నిశ్చయం మార్చుకోలేను దామూ !"

దామూని పెద్ద చిక్కులోనే పడేశాడు జగన్నాధం. నిజానికి ఆ బహిష్కరణ జగన్నాధంమీద కానేకాదు. అయినా బాధపడేవాడు మాత్రం జగన్నాధం. దామూకి ఆ సంగతి బాగా తెలుసు. ఇప్పుడితను గ్రామం వదిలిపెట్టి వెళ్ళిపోతే.ఇక పరిస్థితులు అసలు దోవకి రానేరావు. తన ఎత్తు వ్యర్థమయిపోతుంది. అంచేత దామూ గట్టిగా ఆలోచించడం మొదలెట్టాడు. కాస్సేపటికి ఒక ఊహ తట్టింది.అప్పుడు మళ్ళీ ఒకసారి జగన్నాధాన్ని అడిగాడు :

"అయితే నీ నిశ్చయం అంతే అన్నమాట !"

"అవును"

"అయితే నతో కూడా రా !"

"ఎక్కడికి ?"

"నే తీసుకెళ్ళిన చోటికి !"

"పదే. అయితే పద"

ఇద్దరూ బయలుదేరారు. దుర్గాదేవి గుడిదాటి, తోటల్లో ప్రవేశిం చారు. అక్కడినుంచి చింతోబా ఇంటి ప్రాంతానికి వచ్చారు. ఆ తర్వాత ఎక్కడి కెళ్ళారో ఎవరికీ తెలియదు. కొంచెంసేపయ్యాక దామూ ఒక్కడే ఊళ్లోకి తన ఇంటికి వచ్చేశాడు. అతనివెంట జగన్నాథం లేడు. పొద్దెక్కిపోయింది. దక్షిణాయనపు సూర్యుడు నడినెత్తి కొచ్చాడు. ఇంటింటా నైవేద్యాలూ, వైశ్యదేవమూ జరిగిపోతున్నాయి. కాకులు కాకబలికోసం గుంపులు గుంపులుగా కూడుతున్నాయి. అయినా జగన్నా థం ఇంటికి చేరుకోలేదు. ఎదురుచూసి, ఎదురుచూసి అతని తల్లి అలిసి పోయింది. లేచి ఇంటి ముంగిట్లోకి వచ్చి నిలబడి "జగన్నాథమ్....!" అని కేకవేసి, పిలవటం మొదలెట్టింది.

బావగారికి పైత్యపుమంట రేగుతోంది. వైశ్వానరుడు ఆకలిగా వున్నాడు. ఇంట్లో విస్తళ్ళువేసి వడ్డనకి తయారుగా వున్నాయి. ఈ జగ న్నాథం ఇంకా ఇంటికి రాలేదు గనక తనకి కడుపు మాడుతోంది. విప రీతమయిన కోపం వచ్చింది బావగారికి. తన ముక్కుమాటతో తనలో తనే గొణుక్కోవటం మొదలెట్టాడు : "లంజకొడుకులకి మధ్యాహ్నం లేదు, సాయంత్రింలేదు. మోర ఎత్తి పెట్టుకుని ఎక్కడ తిరుగుతున్నాడో దేముడికి తెలియాలి !" మరుక్షణంలో పెళ్ళాన్ని పిలిచి తన విస్తట్లో వడ్డన చేయమని ఆజ్ఞాపించాడు. అతని మాట అనసూయ విన్నట్టు ఆవిడ ఆ ఆజ్ఞ పాలించింది. బావగారు ఓపోసనబట్టి ఆరగించటం మొదలు పెట్టాడు.

జగన్నాథం తల్లి పొలికేకలు వేస్తూ ముంగిలీ పెరడూ అంతా తిరుగుతోంది. కాని ఆవిడ కేకల్లో ఒక్కదానికీ "ఓయ్" అని ప్రత్యుత్త

రం రాలేదు. ఆవిడకి గుండె దడదడలాడింది. వత్సల కంగారుపడి పోయింది. బావగారు చేతులు కడుక్కుని, పొట్ట నిమురుకుంటూ బయటికి వచ్చాడు. బీడీ ముట్టించి రెండు దమ్ములు లాగి, బావమరిదిని స్తోత్రం చెయ్యడం మొదలుపెట్టాడు : "ఉత్త గాడిదలా వున్నాడు! అసలు తెలివేలేదు! అడివిమృగం బొత్తిగా"

అప్పుడుమట్టుకు జగన్నాథం తల్లికి అల్లుడిమీద కాస్త కోపమే వచ్చింది. అంచేత మందలించటానికి వెనకాడలేదు. "అరుగుమీద కూచుని తిట్టిపోస్తే ఏం వుపయోగం ? మొదట లేచి వెతికి తీసుకొస్తే, తర్వాత ఆ తిట్లేవో చదవ్వచ్చు!"

"ఎవ్వరూ వెతికి తీసుకు రానక్కరలేదు. పాలుతాగే పిల్లాడా ఏమిటి ? సాయంకాలం వేళకి రానేవస్తాడు. మీరెళ్ళి భోంచెయ్యండి"

కాని అది తల్లిపేగు మరి! ఇటువంటి శుష్క వుపదేశం ఎందుకు లెక్కచేస్తుంది ? కోడలిని పిల్చి ఒకవేపు ఇళ్ళు వెతికిరమ్మంది. రెండో వేపు ఇళ్ళు చూడటానికి తను బయలుదేరింది. "మా కృష్ణుడు కనిపించాడా ?" అని అడుగుతూ రేపల్లె అంతా తిరిగిన యశోదలాగా వ్యాకులంతో ఊరంతా తిరిగింది. కాని ఎదురయిన వాళ్ళందరూ చెవుల్లో వేళ్ళు పెట్టుకుని కిక్కురుమనలేదు. ఆవిడ తిరిగి తిరిగి ఇంటి కొచ్చేటప్పటికి, కోడలు తులిసికోట దగ్గిర కూచుని లోపల్లోపల ఏడుస్తుంది. అంటే ఆవిడకీ ఎక్కడా కనిపించలేదన్నమాట!

పిల్లాడు ఎక్కడికి వెళ్ళాడనేది అర్థమేకాలేదు తల్లికి. ఏదయినా చెట్టూ గిట్టూ ఎక్కి పడిపోలేదుగదా! నదిలోదిగి కొట్టుకు పోలేదుగదా! ఏదయినా దెయ్యం పిశాచం ఎత్తుకుపోయి ఎక్కడయినా దాచేసి వుంచేనో....? ఆవిడలో రకరకాల కుశంకలు ఉద్భవించాయి. ఆవిడ మనసు బెంబేలు పడిపోయింది. వీధి అరుగుమీద వెల్లకిలా పడుకుని

అల్లుడుగారు గురక పెడుతున్నారు. ఇక విధిలేక ఆయన్ని నిద్రలేపింది. అతను లేచీ లేస్తూనే ఒక అరిచేతిలో ఇంకో పిడికిలి గుద్దుతూ, నుదుటి మీద ముడతలు తెచ్చుకుంటూ :

"నే నెక్కడ అని వెతకను అతన్ని ? పారిపోయేవాడికి పది దార్లుంటాయి. ఛ ఛ ! ఇదెక్కడి గొడవ ?"

"కాస్త ఊళ్లోకి వెళ్ళి, వాళ్ళనీ వీళ్ళనీ పోగుచెయ్యి. వాళ్ళ సహాయం అడుగు. ఇప్పుడింట్లో నువ్వొక్కడివే మగదిక్కు. అయినా ఇలా సాచుక్కూచుంటే ఎలా ?"

"నే నీ వూరివాళ్ళ మొఖాలు చూడను ఏమయినా సరే !"

ఆ సమయంలో తులసికోట దగ్గిర కూచున్న వత్సల ఇతనివేపు మెటికలు విరిచింది. ముసిలిదానికి అల్లుడుగారి తత్వం అర్థమయింది. అంచేత లేచి దామూ దగ్గిరకి పరుగెత్తింది. అసలు సంగతేమిటో ఎవరి కయినా తెలిసివుంటే, ఒక్క దామూకే తెలిసి వుంటుందని ఆవిడకి తోచింది. ఆవిడ దామూ ఇంటికి వెళ్ళేటప్పటికి వీధి వసారాలో గణపన్నా, మల్లయ్యా, రామనాథమూ అందరూ కూచుని జగన్నాధం కనిపించకపోవడం విషయమే మాట్టాడుకుంటున్నారు. దామూ వాళ్ళతో తనకి తెలిసిన విషయాలు చెబుతున్నాడు. "పొద్దు పొడవకముందె మా ఇంటి కొచ్చాడు జగన్నాధం. వచ్చి నాతో 'నేను వూరు వదిలిపెట్టి వెళ్ళిపోతున్నా' నన్నాడు. నేనేమో వెళ్ళితే వెళ్ళు. మీ ఇంట్లో నువ్వేమయిపోతే ఎవరికొక్కవాలి ? అత్తగారి గురి అంతా అల్లుడుగారి సామర్థ్యం మీదే ఆయెను !"

జగన్నాధం తల్లి ఈ మాటలు వింది. ఒకవేళ ఆవిడ వినాలనే దామూ ఇలా మాట్టాదేమో కూడాను! ఆవిడకి బల్లెం గుచ్చుకున్నట్టయింది. ఆవిడ చటుక్కున వచ్చి వాళ్ళ ఎదట చతికిలబడి ...

"లోగడ సంగతులు ఎత్తకు బాబూ ! ముందర మా అబ్బాయిని వెతికి తీసుకురా !"

"ఏం, మీ అల్లుడినే అడగరాదూ ? అతను అవసరమయితే వంద మంది మనుషులని తీసుకొస్తాడుగా మీకు సహాయం చెయ్యడానికి ? నీకు ఊరివాళ్ళతో ఏం లెక్క ?"

"అట్లా అనకురా నాయనా !"

"అట్లా అనక ఎట్లా అనాలేమిటి ? మేం అంతా ఇన్నాళ్ళనుంచీ మీ ఇంటికి రావడమూ, మీతో ఇచ్చి పుచ్చుకోవడమూ మానేశాంగదా ! ఒక్కరోజైనా వచ్చి 'బాబుల్లారా, మామీద ఎందుకయ్యా ఈ బహిష్కారం ?' అని అడిగావా నువ్వు ? అలా అడగటం నీ బాధ్యత అవునంటావా కాదంటావా ? కాని నీకు నీ అల్లుడిగారి మీద భక్తి తలకెక్కిపోయింది. అవునా ? మీ అల్లుడుగారు మహా తెలివయినవాడు, కోర్టులూ, చట్టాలూ క్షుణ్ణంగా తెలిసినవాడూను. మాటల్లో బృహస్పతి మరి. అతనుండగా మనకేం తక్కువ, మనమీద కే ఆపదా రానివ్వడు అని నమ్ముకున్నావు. గ్రామస్థులంతా పెడమొఖం పెట్టుతున్నప్పుడు నీ కొడుక్కి ఎంత యాతనగా వుంటుందో నువ్వాలోచించనైనా లేదు. మీ అబ్బాయి ఎందుకు పారిపోడు మరి? నన్నడుగుతే మంచిపనే చేశాడంటాను. వెళ్ళిన చోటన్నా పదిమందితో కలిసికట్టుగా వుండి, హాయిగా వుంటాడు"

దామూ ప్రయోగించిన మందలింపు ఆవిడలో అల్లకల్లోలం లేవదీసింది. ఆవిడ గొల్లున్న ఏడుపు ఆరంభించింది. "నా అపరాధం మన్నించు ! నా బాబును తీసుకురా !" అని ఏడుస్తూనే ప్రార్థించింది.

"ఒక్కమాట చెబుతున్నా విను. నలుగురి మధ్యా వైషమ్యం నాటుతూ, గిల్లికజ్జాలు కల్పిస్తూ వుండడమే సహజ నైజంగావున్న నీ కర్కోటకపు టల్లుడికి నువ్వు ఆశ్రియం ఇచ్చినన్నాళ్ళూ మేం ఎవ

ళ్ళమూ నీ విషయం ఏ మాత్రిమూ పట్టించుకోము: పూచిక పుల్లంత సహాయం చెయ్యము, ఇది ఖచ్చితం"

"కాని, నా నోటితో నేను అతన్ని ఎలా వెళ్ళిపొమ్మని చెపుతాను చెప్పండి ?"

"పోనీ మేం చెబుతాం. చెప్పడమేమిటి ? సాగనంపుతాం; నీ కుమారుణ్ణి కూడా వెతికి ఇంటికి తీసుకొస్తాం. నీకు సమ్మతమేనా ?"

"సమ్మతమే నాయనా ! మీకేది మంచిదనితోస్తే అట్లాగే చెయ్యండి. కాని ఇంటికివున్న ఒంటి స్తంభం నిలబెట్టండి"

తక్షణం దామూ అక్కడి వాళ్ళవేపు తిరిగాడు. "ఒరేయ్ ! గణి పిగా, మల్లాయ్, రామనాధం పదండిరా !" అన్నాడు. అందరూ లేచి నుంచున్నారు ఒక్క ఉదుటున. దామూ వెనకాలే జగన్నాధం ఇంటి ముందుకి వచ్చారు. అల్లుడుగారు జందెం పూలమాలలాగా మెళ్లో వేళ్ళా దేసుకుని బీడీ కాలుస్తూ సుఖంగా, శాంతంగా కూచుని వున్నాడు. దామూయే సంభాషణ ప్రారంభించాడు :

"ఏం బావగారూ, ఇలా బీడీ పీలుస్తూ కూర్చోడానికేనా మీరు ? అంత పెద్ద బావమరిది కనిపించకుండా పోయాడుగదా మరి ! అతన్ని వెతకడమూ, అదీ...."

"మరి మీరంతా వున్నదెందుకోయ్? ఇంతమంది ఇరుగూ పొరుగూ మీరున్న దెందుకూ అంట ?"

"మేమా ? మే మున్నది నిన్ను వెళ్ళగొట్టడానికి"

"ఆ సంగతి నాకేనాడో తెలుసు. కాని ఈ ఇల్లు మా అత్తగారిది. మీ రెవ్వరోయ్ నన్ను వెళ్ళగొట్టడానికి ?"

"అది ఆ తర్వాత తీరికగా ఆలోచిద్దాం. ముందర అక్కడనుంచి లేచి చాక్కా తొడుక్కో ! మా ముఖతా నిన్ను వెళ్ళమని చెబుతున్నది మీ అత్తగారే అనుకో !"

"అంత చూలాగ్గా వెళ్ళేవాణ్ణే నేను? ఇక్కడి సగం ఆస్తిమీద నా భార్యకి అంపే తత్కారణంగా నాకు హక్కు వున్నది. ఈ ఇంట్లో సగభాగం నాదే అన్నమాట. అర్థమయిందా ?"

"ఏమమ్మోవ్ ? జగన్నాధాన్ని కన్నతల్లీ! వింటున్నావా ? బుద్ధికి బృహస్పతి అయిన మీ గారాబు టల్లుడిగారిది ఎలాటి బుద్ధో అర్థమయిందా ? మా అల్లుడు మేలిమి బంగారం అంటూండేవానివిగా ఇన్నాళ్ళూ ? కాని దృష్టి అంతా మీ ఆస్తిమీద వున్నట్టు ఇప్పటికయినా బోధపడిందా ? చెప్పవమ్మా! చెప్పు మరి !"

"ఆవిడ చెప్పేదేముందోయ్? చట్టం చెబుతోంది సగం ఆస్తి నాకు చెందుతుందని" అన్నాడు బావగారు నిర్లక్ష్యంగా.

"చట్టం సంగతి కోర్టులో తేల్చుకో! కాని నువ్వు తక్షణం ఇక్కడినుంచి కదులు. గణపన్నా, మల్లయ్యా మీ తడాఖా ఏమిటో కాస్త చూపించం డివ్వాళ. యీ మరమరాల బస్తాలాటి బావగార్ని ఎత్తి పొలిమేర అవతల పారేసి రండి"

"క్షణంలో పని అది" అన్నారు వాళ్ళు నడుం కడుతూ.

బావగారికి పరిస్థితి పక్కానికొచ్చినట్లు బాగా అర్థమయింది. చేతిలో వున్న బీడీ విసిరి పారేసి, గదిలోకి వెళ్ళి చొక్కా తొడుక్కున్నాడు. అతనితోపాటే భార్యకూడా గంగా యమునా కారుస్తూ, మూటా ముల్లె కట్టింది. జగన్నాధం తల్లి ఇదంతా నిస్సహాయురాలిగా చూస్తూనే వుంది. కూతురిమీది ఆపేక్ష, జాలీ ముంచేస్తున్నాయి. కాని అల్లుడిమీది ఆదరం మాత్రం ఈ గడిచిన రెండుగంటల తాపంలో పూర్తిగా ఎండిపోయింది. ఇంతకీ ఇప్పుడిక తన చేతిలో ఏమీలేదు.

బావగారు ముంగిలి గడిచి నాలుగడుగులు వెళ్ళాక మాత్రం వెనక్కి తిరిగి ఇంటివేపు చూస్తూ "ఇది వడ్డీతో సహా ముట్టచెప్పకపోతే

నాపేరు మార్చుకుంటాను ఏమనుకున్నారో!" అని ఒకసారి బెదిరించాడు గ్రామస్తులలో ఎవ్వరూ ఒక్కక్షణం ఏ జవాబూ చెప్పలేను. ఆ తర్వాత అందరూ విరగబడి నవ్వారు. కూతుర్ని నాలుగడుగులు సాగనంపి, తల్లి వెనక్కి వచ్చేసింది. తన కన్నకూతురు తనకి దూరమయిపోయింది. కాని తన కన్నకొడుకు ఇంకా కంటబడలేదు.

ఆ తర్వాత జనం తలోపక్కకి వెళ్ళిపోయారు. ఒక గంటసేప టిలో దామూ జగన్నాధాన్ని వెంట బెట్టుకు వచ్చాడు. ఇంకా వెతుకు తూన్న వాళ్ళందర్నీ వెనక్కి కేకవేసి పిలిచాడు. నాలుగు మూలలనుంచీ జనం పోగయ్యారు. మొక్కుకున్న దేవుళ్ళందరూ వత్సలకి వర మిచ్చారు.

"ఎక్కడ వున్నావురా నాయనా? ఎంత బండ పడేశావురా నా గుండెల్లో?" అంది తల్లి.

"ఏం చెప్పమన్నావమ్మా! మనవూరి గణాచారి ఎదురయ్యాడు. నన్ను అమాంతం ఎత్తుకు తీసుకెళ్ళిపోయాడు. అక్కడ పొలాలమధ్య పెద్ద రావిచెట్టు లేదూ? దాని చిటారి కొమ్మమీద కూచో పెట్టేశాడు. బావగారూ, అక్కయ్యా ఆ చెట్టుకింది నుంచి వెళ్ళిపోతూండడం కని పించింది నాకు. పిలుద్దామని నోరు తెరిచినా, మాట రానేలేదే అమ్మా! వాళ్ళిద్దరూ కాలిబాట వదిలి పెద్ద రోడ్డుమీది కెక్కాక మళ్ళా ఆ గణా చారే నన్ను కిందికి దింపేడు. ఎట్టా ఎక్కించాడో అట్టా దింపేశాడు సునాయాసంగా."

"ఎంత విచిత్రమో చూశావూ?" అన్నాడు గణపన్న.

"అందులో పెద్ద విచిత్రమేముందోయ్? గణాచారి తలుచుకుంటే చెయ్యలేని పనేముంది? అవలీలగా చేసేస్తాడు" అన్నాడు చింతోబా, తన కలాటి దృష్టాంతాలు చాలా తెలిసినట్టు.

"అంటే దాని అర్థం, బావగారు ఈ ఊళ్ళో వుండటం గణాచారి క్కూడా ఇష్టం లేదన్నమాట!" అన్నాడు రామనాథం.

"పోనీలెండోయ్. ఏదో అయిపోయిందిగా! చూడమ్మా, ఈ క్షణంనుంచీ మీ ఇంటిమీద బహిష్కారం రద్దయిపోయింది. ఇప్పుడు దీపావళి పండగకూడా దగ్గిరకి వచ్చేసింది. ఈ సంవత్సరం మరిన్ని బొబ్బట్లు చేయించవమ్మోయ్! ఈ సంవత్సరం మొట్టమొదటి విందు మీ ఇంట్లోనే, సరేనా?" అంటూ లేచాడు దాము.

కొంచెం సేపయాక, అత్తగారు అటు వెళ్ళాక వత్సల ఒక్క ప్రశ్న వేసింది జగన్నాథాన్ని....

"ఊఁ, ఏఁవిటీ! అయితే గణాచారి తీసుకెళ్ళి చెట్టు చిటారున కూచోపెట్టిందేం? పచ్చి అబద్ధాలూ మీరూను!"

"అబద్ధో నిబద్ధో! మొత్తంమీద మనిద్దరికీ కూడా మనసుల్లో కష్టాలు తెచ్చిపెట్టిన గ్రిహం వదిలిపోయింది"

"వదిలినమాట వాస్తవమేకాని, ఒక రూముసేపు నా గుండె తల్ల డిల్లిపోయింది"

"అదీ మంచికేలే. భర్తయొక్క విలువకాస్త తెలిసివస్తుంది"

"నిజమే అనుకోండి. కాని భార్యయొక్క విలువ తెలిసే దెప్పుడు?"

"ఇప్పుడే. ఈ క్షణమే!" అని జగన్నాథం రెండడుగులు ముందుకి వేశాడు.

అలాగా వత్సల మెల్లిగా తలుపుచాటుకి జారుకుని. ఓరవాకిలిగా వేసున్న గది తలుపు....

# విషమ పరీక్ష

కాళ్ళూ చేతులూ కడుక్కుని, ఉతికిన చీర కట్టుకుని, యశోద పూజామందిరం ప్రవేశించింది, సాయంకాలపు హారతి ఇవ్వడానికి. ఇష్ట దైవం ముందు సామగ్రి అంతా సేకరించుకుని కూచుంది. పొద్దు గుంకక ముందే కోసి సజ్జలో వేసిన మల్లెమొగ్గలు విచ్చుకుని సజ్జని నింపేశాయి. లేగదూడ తల్లి చుట్టూ తిరుగుతూ గంతులేసినట్లు ఆ పువ్వుల పరిమళం ఆ సజ్జను ఆవరించుకుని వుంది. ఆ పువ్వులతో గౌరికి పూజచేసింది యశోద. అగరువత్తులు వెలిగించి అరిటిపళ్ళల్లో గుచ్చింది. కర్పూరం వెలిగించి దేవికి చూపించింది. పంచహారతులు వెలిగించి హారతి తిప్పింది.

హారతిదే మాతా గౌరీ
కృపావతీ వరదాయినీ
నిను పూజించే వనితలకూ
ఏ వరమిచ్చే వీ తరుణమునా?
అఖండ సౌభాగ్య మ్మిచ్చేవా ?
అఖిల సిరులతో ఆశీర్వదించేవా ?
జన్మ సార్థకమగునట్లు జననీ చేసీ
పుత్రభిక్ష ప్రసాదించేవా ? జగజ్జననీ !

అని ప్రార్థనలోని ఆఖరి చరణం పాడుతున్నప్పుడు మాత్రం ఆవిడ కంఠం రుద్ధమయిపోయింది. ఆవిడ కళ్ళు చెమ్మగిలినట్లు కూడా ఆ దీపజ్యోతి చూసింది. కృశించిన తెల్లటి చేతులతో పంచహారతి కింద పెట్టింది. ఆ తర్వాత చాలాసేపు అలాగే ఆ గౌరీదేవి ఎదుట కూర్చుని

వుండిపోయింది. ఆ కర్పూరపు జ్యోతిలాగనే తేజోవంతమయినది యశోద ఆత్మజ్యోతి కూడాను.

కాని విపరీత పరిస్థితులు ఆ జ్యోతి చుట్టూ కూడా కాటిక కమ్ముకునేటట్టు చేశాయి. ఈనాడు యశోద గౌరీదేవిని ఏమీ కోరుకోవటమే లేదు. తన దుఃఖాలు ఏవీ చెప్పుకోవటమూ లేదు. ఇప్పుడు అసలు యశోద దుఃఖానికీ, సుఖానికీ కూడా అతీతురాలైపోయింది. ఇంతకు ముందు ఎన్నెన్నో సహించిన అనుభూతులవల్లా, ఇకముందు కూడా ఏమేమిటో సహించవలసి వుంటుందని తెలుసుకున్నందువల్లా, ఆవిడకి కష్టాలల్లోంచి గట్టెక్కించమని ప్రార్థించడం అనవసరమనిపించింది. ఆ పూజామందిరంలో వున్న కొన్ని క్షణాలపాటయినా నిర్భయంగా, శాంతంగా వుండడమే ఆవిడ కాంక్షించింది.

కొంచెం సేపయాక అక్కడినుంచి లేచింది. మరొక్కసారి పూర్తిగా వంగి గౌరికి ప్రణామం చేసింది. ఆ గదిలోంచి బయటికి వస్తూనే 'కోటమ్మా!' అని పనిమనిషిని పిలిచింది. పరిచారిక అనుకున్నా, చెలికత్తె అనుకున్నా స్నేహితురాలు అనుకున్నా 'కోటమ్మ' ఒక్కత్తే తన కిప్పుడు అండా దండాను. ఇతరత్రా ఏ దిక్కూలేని ఈ ముసలిదే యశోదకి సర్వమయిన సిబ్బందీని. యశోద పిలుపు విని ఎదటికి వచ్చింది. ఆ ముసిలి దానికి అన్నం వడ్డించి, తనొక చెంబెడు నీళ్ళు తాగి, వంట ఇల్లు సర్దింది యశోద. ఆ తర్వాత గొంగళీ పరుచుకుని, కప్పుకోవటానికి దుప్పటీ పెట్టుకుని గౌరీదేవి సమక్షంలోనే నడుం వాల్చింది. ఇవ్వాళ కటిక ఉపవాసం చెయ్యాలనుకుంది; నెరవేర్చుకుంది. పొద్దు గుంకినప్పటినుంచీ శోష వచ్చినట్లనిపించింది. ఇహ ఇప్పుడు కాస్త నిద్దరపోతే చాలనిపించింది.ప్రశాంతంగా నిద్ర పోగలిగితే అంతే చాలు ననిపించింది.

పొట్ట ఖాళీగా వుంచుకుంటే మాత్రం మనసు ఖాళీగా ఎందు

కుంటుంది? శరీరానికి విశ్రాంతిగా వుండటం కోసం పడకమీద వాలిందే గాని, మెదడు మోట తోలుతూనే వుంది. అనేకరకాల ఆలోచనలు వెనక్కూ ముందుకూ గుంజుతూనే వున్నాయి. ఇవాళ రోజు రోజంతా ఎంతో నిబ్బరంతో నిశ్చలంగా వుంది యశోద. తెల్లారి లేస్తే వినాయక చవితి. సంవత్సరానికి ఒక్కసారి వచ్చే ముఖ్యమయిన పండుగ. 'అసలు ఎందుకు చెయ్యాలి ఈ గణపతి పూజ ?' అనిపించింది ఆవిడకి. "విఘ్న హర్త' అంటారు వినాయకుణ్ణి. కాని ఆయన మాకు చేసిన ఉపకారం ఏముంది ? మానవునిలో వుండే సత్ప్రవర్తనకి ఇదేనా ఆ దైవం ఇచ్చే బహూమానం ? ఆయన ఏం తప్పు చేశారని ? ఏమయినా కుట్రలు చేశారా ? ద్రోహం తలపెట్టారా ? ఏంచేశా రాయన? ఏం ఎవరిదయినా సొత్తు అపహరించారా ? సొమ్ము దోచుకున్నారా ? ఉత్తపుణ్యానికి ఎందుకు మరి ఆయనమీద ఇంతటి నింద, ఇన్ని కష్టాలూను ? ఇప్పటికి ఆరునెల్లయిందే ! ఆయనను గురించి ఒక్క వార్తకూడా తెలియలేదే ! ఎక్కడ వుండి వుంటారు ? పోనీ ఎక్కడో అక్కడ క్షేమంగా వున్నట్టేనా ? ఇదేమిటిది ? ఇదీ ఒక రాజ్యమేనా ? లేక ఒక యమలోకమా ? ఈ పాలకుడి పేరు సిద్దీఫతేఖానా ? యమధర్మరాజా ? ఏదయినా, యమ దూతల్లాగా నల్లగా వుండే సిద్దీ వంశంలో * వాడుగాదూ మరి ?"

ఇంతలో బయట వర్షం పడటం మొదలెట్టింది. హోరుగాలి రేగి, చెట్ల కొమ్మలను మెలిపెట్టి "కిర్రు కిర్రు"మనేట్టు చేసింది. విడీ విరామంలేని గాలివాన రొద ఇంటిలోపలికి ఎడతెగకుండా జుయ్యిమని వినిపిస్తోంది. యశోద మనసులో గొలుసుకట్టుగా వస్తున్న ఆలోచనలు తున

* సిద్దీవంశం = భారతదేశం తురుష్కుల వశమైనప్పుడు ఆ తురుష్క చక్రవర్తులు కొంతమంది నీగ్రో ముస్లింలను బానిసలుగా తెచ్చుకున్నారు. మొగలాయి సామ్రాజ్యపు చివరి రోజుల్లో యీ సిద్దీలు కొన్ని ప్రాంతాలను తమ వశం చేసుకొని స్వతంత్ర పాలకులైనారు.

కలయి పోయాయి. బయటి వానవల్ల ఇంట్లో చలి ఎక్కువయిందని తెలుసుకుంది. అంచేత దుప్పటి కంఠంవరకూ లాక్కుని, కాళ్ళూ చేతులూ ముడుచుకుని పడుకుంది. ఒక అరగంట సేపటికి ఆరంభించి నంత హఠాత్తుగానే వర్షం వెలిసిపోయింది. అయినా చూరుమీంచి కారే నీళ్ళ శబ్దం వినిపిస్తూనే వుంది. అది ఆగిపోయిన తరువాత ఇంకా చెట్ల మీంచి నీళ్ళ చుక్కలు 'టప టపా' రాలుతూనేవున్నాయి. చాలాసేపటి వరకూ గాలి వీచినప్పుడల్లా. ఈ శబ్దాలన్నీ అణిగిపోయే లోపలే ఎప్పుడు పట్టిందో కాని యశోదకు కాస్త కునుకుపట్టింది. కోటమ్మకి అప్పటి కెంత సేపటి కిందటనో అర్ధరాత్రి అయిపోయింది.

ఆ తర్వాత కొంచెం సేపటికి పెరటి తలుపు దగ్గిర నెమ్మదిగా "టిక్ టిక్"మని శబ్దం పుట్టింది. కాని, అది యశోదకి వినిపించనేలేదు. నాలు గైదు నిమిషాలయిన తర్వాత ఇంకొంచెం గట్టిగానే ఆరంభ మయింది మళ్ళీ ఆ చప్పుడు. అప్పుడు మాత్రం యశోద దిగ్గున లేచి కూచుని, ఆలకించింది. ఎవరో దగ్గినట్లుగా కూడా ఆవిడకి వినిపించింది. మొత్తంమీద పెరటి తలుపుదగ్గిర ఎవరో వున్నట్టు నిశ్చయమయింది యశోదకి. కాని ఎవరయి వుంటారు ? ఎవరయినా దొంగేమో, దుర్మార్గు డేమో, దుష్టుడేమో ! "ఓయ్" అని బయలు పలకడమే కష్టమనిపిం చింది; తలుపు తియ్యడానికే ఇష్టం కలగలేదు. కాని ఏదో ఒక నిశ్చ యానికి రావటం మాత్రం తప్పదని తెలుసుకుంది.

ఇక అప్పుడు కోటమ్మని లేపింది. ఇద్దరూ కలిసి గుభాలు గుభాలు మని కొట్టుకుంటున్న గుండెలతో పెరటి ద్వారం దగ్గిరకి వెళ్ళారు. ఇంటి లోపలి అలికిడి బయటివ్యక్తి పసిగట్టాడు కాబోలు. "ఇదిగో, విని పిస్తోందా ? తలుపు తియ్యి. నేనేలే !" అని అణుచుకున్న స్వరంతో మాట్లాడాడు ఆ వ్యక్తి.

---

ఆ స్వరం యశోదకు పరిచయమయిన స్వరమే। కాని తనకంతటి అదృష్టం పట్టిందంటే నమ్మకం కుదరలేదు. తలుపు దగ్గిర ముఖంపెట్టి "మీరండీ ?" అని అడిగింది. తలుపుని చెవి ఆనించి విన్నది: "అవును. నేనేలే। తొందరగా తలుపు తియ్యి।" అని తక్షణం జవాబు వినిపించింది. యశోద ఒక్క పరుగున నడవలోకి వెళ్ళింది. కిమ్మాలోని వత్తి ఎగసన దోసి, దీపం పెద్దది చేసింది. మళ్ళీ తొందరగా వచ్చి, వణుకుతూన్న చేతుల్తో గడియ తీసింది. కిటికీలోంచి రంయ్యిమని ప్రవేశించిన గాలికి, దేవుడి ముందరి దీపజ్యోతి ఒకసారి రెపరెపలాడింది. తెరిచిన పెరటి తలుపులోంచి ఒక వ్యక్తి ఇంటి లోపలికి అడుగుపెట్టాడు. యశోద హృదయంలో అనేక భావనా పరంపరలు ఉరకలు పెట్టినయి.

ఇంట్లోకి ప్రవేశించిన ఆసామీ పేరు కెరోటాటికలే. ఆయనే ఆ ఇంటికి యజమాని, యశోద భర్త.

ఇందాకటి వర్షానికి పూర్తిగా తడిసిపోయాడు. ఆయనను చూసి ఉప్పొంగిపోయింది యశోద. ఆవిడకి స్వర్గం చేతికి అందినంత ఆనందం కలిగింది. కాని అదే సమయంలో ఆనందంతోపాటు అమితమయిన భీతీ పట్టుకుంది. పరిస్థితులు ఎంత విషమంగా వున్నాయో పూర్తిగా తెలుసుకున్న దయినందువల్ల సాధక బాధకాలన్నీ జ్ఞాపకం వచ్చి, వెయ్యి సూదులతో పొడుస్తూన్నట్లయింది. ముందుగా ఆయనకి పొడి బట్టలు అందిచ్చింది. వేడివేడిగా కాస్త టీ చేసి ఇచ్చింది. ఆపైన ఒక సిబ్బిలో ఎర్రటి నిప్పులు తోడితెచ్చి, కొంకరలు పోతున్న కాళ్ళూ చేతులూ కాచుకోడానికి ఆయన ముందు పెట్టింది. ఆ తర్వాత ఆయనకు ఎదురుగా గోడ నానుకుని నుంచునే వుండిపోయింది.

వారిద్దరి మధ్యనీ వున్న దీపజ్యోతి వారి చూపులను కలిపింది. ఇద్దరూ ఒకరివేపు ఒకరు చూస్తూ వుండిపోయారు కొన్నిక్షణాలు. గతిం

చిన సంఘటనల స్మరణల్లోంచి ఈ ఆరు నెలల వియోగ సముద్రాన్ని ఈదుకుంటూ ఒకరి కొకరు దగ్గర పడటానికి కొంతకాలం పట్టింది. వారిద్దరూ అలా ఒకరివేపు ఒకరు చూసుకుంటూ, చూపులలోనే గతంమీద ఒక వంతెన నిర్మించుకున్నారు. యశోద సంతోష సముద్రానికి మట్టుకు భయమనే చెలియలి కట్ట ఒకటి వుంది. కాని కెరోటాకి మాత్రం స్వర్గం అరిచేతిలోకి వచ్చినట్టు అనిపించింది. ప్రాణంలో ప్రాణంలా, తనతో కలిసి మెలిసి వుండి, ఇనే ళ్ళ కాపురం చేసిన తన భార్య, సద్గుణ సంపన్న అయిన అనుకూలవతి, ఆరు నెల్లకి మళ్ళీ ఈనాడు తనకి కనిపించింది! తను అకస్మాత్తుగా పారిపోవడం సంభవించాక ఆవిడ ఘోసాళ్గడ్ కోటమీంచి నివాసం మార్చి, రాజపురిలో తమ స్వంత ఇంట్లోకి వచ్చేసినట్లు తన పర్యటనలలో వుంటూనే తను విన్నాడు. ఆ వార్త నిజమే అయివుంటుందన్న నమ్మకంతోనే ఈవేళ ఇక్కడికి రావడానికి సాహసించాడు. భార్యను తప్పకుండా చూడాలన్న ఆశతోటే తమ ఇంటిలోకి—తమ ఇల్లనడంకంటె, ఇది సిద్ది ఫతేఖాను కత్తెరబోను అనడమే సమంజసం....ప్రవేశించడానికి ధైర్యం చేశాడు.

"నువ్వు చాలా కష్టాలు పడ్డావు కదూ?" అని అడిగాడు. కాని ఆవిడ ఏమీ ప్రత్యుత్తరం చెప్పలేదు. ఏమని చెప్పడం ఈయనతోటి? ఆయన ఎన్నెన్ని కష్టాలు పడ్డాడో ఊహించుకుంటూంటే ఆవిడకి గుండె చెరువయి పోతోంది.

"మాట్లాడవేం?"

"ఏం మాట్లాడమన్నారు? నాకు ప్రాణాలు గూట్లో వుండటం లేదు. మీ రసలు ఇప్పు డిక్కడికి ఎందుకొచ్చారో చెప్పండి ముందర?"

"అంటే? నేను ఇక నీకు కనిపించకూడదనే కోరుకుంటున్నావా ఏమిటి నీ మనసులో? నామీద నీకు నిజంగా అంతటి...." అని వాక్యం పూర్తి చెయ్యకుండానే తలవంచుకు కూర్చున్నాడు.

యశోద తన మనసులో ఏమనుకుందో ఆయనకు ఎలా తెలుస్తుంది గనక ! ఒక్క రూమునేపు కూడా కాలేదు యశోద గౌరీదేవికి ప్రార్థన సమర్పించుకుని. "గౌరీ మాతా ! నా పసుపు కుంకుమ కాపాడే భార మంతా నీదే ! మేం ఇద్దరం తొందరలో కలుసుకునేట్టు కటాక్షించు.... కాని ఆయన్ని మాత్రం ఇక్కడికి వచ్చే సాహసం చెయ్యనివ్వకు" అని మొరపెట్టుకుంది. ఇప్పుడేమో ఈయన వచ్చి "నే నసలు నీకు కనిపించ కుండా వుండాలనే కోరుకుంటున్నావా నీ మనసులో ?" అని అడుగు తున్నారు. ఆవిడ పొంగివస్తూన్న దుఃఖాన్నీ, వెక్కిళ్ళనీ దిగమింగింది. బయట చప్పుళ్ళ కోసం ఒకసారి ఆలకించింది.

"మీరు కొంచెం నెమ్మదిగా మాట్లాడండి. ఇక్కడ గోడలకి చెవు లున్నాయి; చెట్లకు కళ్ళు వున్నాయి. ఏ క్షణంలో ఏ ప్రమాదం సంభ విస్తుందో చెప్పలేం. సిద్దీఖ తేఖాను ఈ ఇంటిమీద కాపలా వేసే వుంచాడు. అతని ఉద్యోగస్తులు అడపాదడపా వచ్చి నన్ను ప్రశ్నలువేసి పీడిస్తూనే వుంటారు. 'నీ మొగుడు ఎక్కడికి వెళ్ళాడు ? నిజం చెప్పు!' అంటూం టారు. అటువంటి పరిస్థితుల్లో మీ రిక్కడికి...."

ఈ సంగతి వినేటప్పటికి కెరోబాకి గుండె గతుక్కుమంది. ఆవిడ మనసులో ఎంతగా భయపడుతోందో అప్పటికి అర్థమయింది అతనికి.

"నిజానికి నేను ఇక్కడికి రాకుండానే వుండాల్సింది. కాని వుండ బట్టలేకపోయాను. రేపే వినాయకచవితి. సంవత్సరానికి ఒకసారి వచ్చే అతి ముఖ్యమయిన పండుగ ! స్వహస్తంతో, సొంత ఇంట్లో పూజ చేద్దామనుకున్నాను. భార్యా సమేతంగా ఒక్కసారి ప్రార్థిద్దామనుకున్నాను. అదీగాక ఇంకో కారణంకూడా వుంది నే రావటానికి— నిజంగా చెబు న్నాను...."

కాని కెరోబా ఏమీ చెప్పలేకపోయాడు. కాని ఆయన ఏమీ చెప్పకపోయినా, ఆవిడకి సర్వమూ అర్థమయిపోయింది. యశోద మరీ అంత అమాయకురాలేం గాదు. ఇన్నేళ్ళు ఆయనతో మనసిచ్చి కాపరం చేసిన మనిషి. ఆయన జీవితానికి తను ఒక ఒర వంటిది. ఆయన హృదయంలోని ప్రతి స్పందనకూ ఆవిడకి అర్థం తెలుసు. ఈ వియోగంవల్ల ఆ అవగాహన శక్తి ఇంకా తీవ్రమయింది. ఈ ఆరు నెలలనుంచీ ఆయన భౌతికంగా ఆవిడకి కనుపించలేదు. కాని ఆయన సామర్థ్యాన్ని గురించీ, వైభవాన్ని గురించీ, ప్రేమను గురించీ, తేరుతీయలని గురించీ అనేకమయిన జ్ఞాపకాలూ, దృశ్యాలూ ఆవిడ మనసుకి రోజు రోజూ సాక్షాత్కరిస్తూనే వున్నాయి. ఈ రోజున యశోద వనవాసిని అయిన సీతలాగా వున్నా, ఒకప్పుడు వైకుంఠంలో లక్ష్మిలాగా వున్న రోజుల అనుభవాలు ఆవిడలో నాటుకుని వుండిపోయాయి.

ఘోసాళ్‌గడ్ కిల్లేదార్ (దుర్గ రక్షకుడు) యొక్క నవ వధువుగా మేనాలో కూచుని ఆ కోట ఎక్కింది ఆ రోజున. ముందు గుర్రంమీద వెళ్ళుతూన్న ఆయనగారి దర్బారు దుస్తులూ, సవతిలాగా ఆయనను అనుకునివున్న ఆ ఖడ్గమూ, అభిమన్యుడో, బభ్రువాహనుడో అనిపించేట్టు వున్న ఆయన ముఖ వర్చస్సూ చూస్తూంటే తనకి మనసులో ఏవేవో కల్పనలు ఉద్భవించాయి. ఆయనకి మంగళహారతి పడుతున్న పళ్ళెంలో జ్యోతిగా తనే అయిపోయి ఆయన ముఖం చుట్టూ పరిభ్రమిద్దామా అనిపించింది. పంచదార చిలకనయిపోయి ఆయన నోట్లో కరిగిపోదామా అనిపించింది. కోటలోని నౌకర్లూ, చాకర్లూ, సిపాయీలూ, హవల్దారులూ, పరివారికలూ, చెలికత్తెలూ తనని ఎంతో గౌరవంగా, ఆదరంగా చూచిన రోజులు ఇంకా జ్ఞాపకం వున్నాయి.

కాని ఈనాడు అవన్నీ అట్లాగే వున్నా, లేనట్టే అయింది. రాజుల కృప, వారాంగనల ప్రీతిలాగ అతి చంచలం అన్న సంగతి కెరోబాకి ఒక

రోజున అనుభవపూర్వకంగా తెలిసి వచ్చింది. ఆక్షణమే తప్పుకుని పారి పోయాడు కాబట్టి సరిపోయింది. కాని లేకపోతే మెడమీద తలకాయ వుండేదేకాదు. సిద్దీ ఫతేఖానులాంటి వాళ్ళ ప్రవృత్తులు క్షణానికి ఓ తీరుగా వుంటాయి. ఉన్నట్లుండి తన జాతివాళ్ళనే అనుమానించి తల కాయలు తీసెయ్యడం ఆరంభించాడు. సుమారు ఒక వందమంది తల కాయలు కొబ్బెర పుచ్చెల్లాగ వుడదీయిం చేశాడు. "వాడు ఏదో తంత్రం చేస్తున్నాడు; వీడు ఏదో మంత్రం పెడుతున్నాడు; ఒకడు పన్నాగాలు పన్నుతున్నాడు; ఇంకోడు ప్రయోగం చేస్తున్నాడు; ఒకడు కుట్ర చేస్తు న్నాడు; ఇంకోడు ద్రోహం తలపెట్టాడు" అని ఏదో ఒక కారణంగా తన చుట్టు ప్రక్కన వున్నవాళ్ళమీదే అనుమానాలు పెరిగిపోయాయి ఫతేఖానుకి. ప్రతి ఒక్కడూ తనని తుద ముట్టించడానికే ప్రయత్నిస్తు న్నాడనే సందేహం పట్టుకుంది. ఈ అనుమాలనీ, సందేహాలనీ ఊతంగా తీసుకుని, దగ్గిర వున్న వాళ్ళు తమకి కిట్టని వాళ్ళమీద సమయం చూసి చాడీలుచెప్పి చంపించటం ఆరంభించారు. జింజీర* కోటమీద తలారుల గొడ్డళ్ళు తరుచుగా మెరవటం మొదలయింది. రాజ్యంలో ప్రజ లందరి లోనూ అమితమయిన భయం నిలయం ఏర్పరుచుకుంది. ప్రతి మనిషికీ తన జీవితం ఏ క్షణంలో అంతమయిపోతుందో అనే భీతి పట్టుకుంది. ఫతేఖాన్ ప్రభుత్వం క్రిందవున్న ప్రజలందరికీ నిరాశ పరిపాటయి పోయింది.ప్రతివాడూ నోరు గట్టిగా మూసుకుని,చెవులుమట్టుకు పూర్తిగా తెరుచుకుని వుండడమే అలవాటయిపోయింది.ఏదో ఒక కారణంగా నిన్న ఫలానా వాడిని ఫిరంగికి కట్టి పేల్చేశారనీ,మొన్న ఒకణ్ణి గోనెలో కుక్క

---

* జింజీర = కొంకణ ప్రాంతంలో ముఖ్యమైన జల దుర్గం, మంచి ఓడరేవూను, భూభాగంమీంచి ముట్టడించడానికి కష్టమయిన దుర్గం. ఈ కొంకణ దేశంలో చాలా భాగం సిద్దీల క్రిందనే వుంది. మిగిలిన కోటలో సిద్దీఫతేఖాను ఆజ్ఞానువర్తులై ముస్లింలు,మహారాష్ట్రులు కూడా దుర్గ రక్షకులుగా వుండేవారు.

సముద్రంలో పారేయించేసనీ, కొందరికి ముక్కులూ చెవులూ కోసేశారనీ, ఇంకొందరికి తలకాయలు నరికించేశారనీ వార్తలు వింటూండడం నిత్యకృత్యమయి పోయింది.

కలబ్ అలీఖాన్ కూడా ఈ తరుణం వుపయోగించుకోడానికి అనేక ప్రయత్నాలు చేశాడు. తను ఘోసాళ్‌గడ్ కిల్లేదారు కావాలని అతనికి ఎన్నాళ్ళనుంచో మనసులోవున్న వాంఛ.కాని అది సూటిఅయిన మార్గంలో లభించదని కూడా అతనికి తెలుసు. అంచేత,సమయం చిక్కినప్పుడల్లా ఫతేఖాన్ చెవిలో అవీ ఇవీ ఊదటం సాగించాడు.

"ఆ కెరోబా అన్నవాడు నమ్మదగినవాడు కాదు. వాడేదో పన్నాగాలు పన్నుతున్నాట్ట" అని అనేకసార్లు ఫతేఖానుకి వుపదేశించాడు.కాని ఎన్నిచెప్పినా ఫతేఖాను ఆ మాటలని విశ్వసించడంలేదని తెలుసుకోగానే తన ఆఖరి అస్త్రం బయటికి తీశాడు.

"కేరోబా రాజద్రోహం తలపెట్టాడు. అతను ఆ శివాజీతో, ఆ కొండ ఎలుకతో సంప్రదింపులు సాగిస్తున్నాడు. ఇహనో ఇప్పుడో ఘోసాళ్‌గడ్ కోటని శివాజీకి స్వాధీనం చేసేస్తాట్ట. నే చెప్పినది మీకు అసత్యంగా కనుపిస్తే మీరింకా ఇతర సాక్షులను విచారించండి పోనీ !" అని; తను బోధించి తీసుకువచ్చిన నలుగురు మనుషులని ఫతేఖాను ఎదట నిలబెట్టారు. ఈ "చిత్తం మహాప్రభూ" గాళ్ళు తనకి వీలయిన సాక్ష్యం చెప్పారు. దాంతో ఫతేఖాన్ ఉగ్రుడయిపోయాడు. తక్షణం కెరోబాని పట్టి తీసుకు రమ్మని అస్త్రశస్త్రాలతో సిపాయిలని పంపించాడు. కాని కెరోబా అంతకంటె చురుకయినవాడు.సంగతీ సందర్భమూ అదనులోనే గ్రహించి, ఎవరి చేతికీ అందకుండా అంతర్ధానమయి పోయాడు.

ఇన్నాళ్ళకి మళ్ళీ ఇప్పుడిలా ప్రత్యక్ష్యమయాడు. ఈయన రాక ఈ క్షణంవరకూ ఎవరికీ తెలియదు. ఇకముందు కూడా తెలియనూ

కూడదు. తెలిస్తే కొంప మునిగిపోతుంది. ఈయన్నిక్కడ గుప్తంగా వుంచి, సంరక్షించే జవాబుదారీ అంతా ఇప్పుడు యశోదమీదే వుంది. అంచేతనే ఆవిడకి అంత పెద్ద భయం పట్టుకుంది.

ఇప్పు డా ఇంట్లో యశోదకాక ఇంకొక్క ప్రాణిమట్టుకే వున్నది. అది ఆ కోటమ్మ అనే ముసలి. సహచరి. అది వుత్త భోళా మనిషి. కల్లాకపటం ఎరగక వ్యవసాయం చేసుకుంటూ జీవితం వెళ్ళబుచ్చిన అమాయకురాలు. ఎంత కట్టుదిట్టంగా వున్నా. ఆయన దాని కళ్ళ పడ కుండా వుండటం అసంభవం. కాని దానిది వుత్త గొళ్ళెం; తాళం లేని నోరు; నూగింజ నానదు. ఊరందరికీ ఇదో వార్తాపత్రిక. ఊళ్ళో జరుగు తున్న చెప్పన్న సమాచారాలు పోగుచేసుకు వచ్చి ఇంట్లో రోజంతా ఏకరువు పెట్టే ఈ మనిషి ఇంట్లో సమాచారం ఊళ్ళో చెప్పకుండా ఎలా వుంటుంది? చెప్పనియ్యకుండా చెయ్యటం ఎలాగ? యశోదకి నిజంగా ఇంత భయం వేయడానికి కారణం దీని వాచాలత్వం. అంచేత తక్షణం దాన్ని ఒక ప్రక్కకి తీసుకువెళ్ళి వృత్తాంతమంతా వివరంగా చెప్పింది యశోద. ఈ సంగతుల్లో ఏదీ ఎక్కడా ఉచ్చరించనని ఆ ముసిలిదాని చేత ప్రమాణం చేయించుకుంది. వినాయకుడి మీద ఒట్టు వేయించింది.

కెరోజా పొద్దున్నే లేచి, విఘ్నేశ్వర పూజ చేశాడు. ఆ సాయం కాలం చీకటికొట్లోనే మహా నైవేద్యం సమర్పించాడు. ఆరోజు రోజంతా పరుపుచుట్టల వెనక ముసుగు వేసుకు పడుకున్నాడు. ఆ రోజు నిర్వి ఘ్నంగా గడిచిపోయింది. రెండవరోజు సాయంకాలం గణపతికి ఉద్వా సన చెప్పి, పూజా విధానం ముగించాడు. ఇక ఇప్పుడయినా ఆయన తొందరగా బయలుదేరి వెళ్ళిపోతే బాగుణ్ణనిపించింది యశోదకి. కాని ఆయనతో ఎట్లా చెప్పడం? 'నేను నీకు కనిపించకుండా వుండాలనే కోరుకుంటున్నావా?' అన్నా రిదివరకే ఆయన. కాని కెరోబాయే తక్షణం వెళ్ళిపోడానికి నిశ్చయించుకున్నాడు. కాస్త రాత్రిపడే వరకూ ఎదురు

చూస్తున్నాడంతే. బాగా రాత్రి అయి, చుట్టుపక్కలంతా నిశ్శబ్దంగా అయేవరకూ చూస్తున్నాడంతే. ఆయన చేతిలో పెరుగు వడ్డించేటప్పుడు యశోదకి అనివార్యమయిన ఏడుపు వచ్చింది ఆ తర్వాత ఒక నాలుగైదు క్షణాలు ఆ విపన్న ప్రాణులు రెండూ ఏకమయినాయి. ఆ సమయంలో కూడా యశోద గుండెల్లో దడ తగ్గలేదు.

ఆయన తెల్లవారే వెళ్ళిపోయారు. ఆకాశమంతా నల్లటి మబ్బులతో క్రిక్కిరిసిపోయింది. ఆ గాఢాంధకారంలోనే తన జీవన నౌకని ప్రపంచ సాగరంలోకి నెట్టుకుంది యశోద. నిర్భయంగా ఒక్క నిశ్వాసం వదిలిపెట్టింది. గాఢంగా అలుముకుంటూన్న ఆ చీకట్లని చీల్చుకుని ఆయనమూర్తివేపు చూడడానికి ప్రయత్నిస్తున్న ఆవిడ కళ్ళల్లో ఒకటి ఏడుస్తోంది; ఒకటి నవ్వుతోంది. సంయోగంకంటే వియోగమే ఈ పూట ఆవిడకి ఎక్కువ ప్రియతరంగా కనిపించింది. గడచిన రెండు రోజుల నుంచీ ఆవిడ మనసుని పీకించిన భయం ఆవిడ ముఖాన్ని కళాకాంతులు లేకుండా చేసేసింది. ఇకముందు ఎంతోకాలం ఆవిడ వియోగ బాధని సహించాలి. అయినాసరే, అదే నయమనిపించింది; ఈ గడచిన రెండు రోజులూ అనుభవించిన భయబాధకంటే.

కెరోబా వెళ్ళిపోయిన తరువాత యశోద చాలాసేపు మనసుకి తృప్తిగా ఏడుస్తూ పడుకుంది. ఆయన తన చెవులో చెప్పిన ప్రత్యేక వాక్యమూ పదేపదే స్మరణకు తెచ్చుకుంది. "ఇంక నా అజ్ఞాతవాసం త్వరలోనే ముగుస్తుందిలే. నేను మళ్ళా ఘోసాళ్‌గడ్ కిల్లేదార్ పదవిలోకి వస్తాను. కాని అది సిద్దీఫతేఖాను చేతికింద నౌకరీకాదు. స్వరాజ్యం సంపాయించిన శివాజీ తరఫున. ఈ జంజీరాకోట ఫతేఖాను స్వాధీనంలో వుండటం శివాజీ మహారాజుకి పక్కలో బల్లెం వున్నట్టుంది. ఆయన తొందర్లోనే ఈ ప్రాంతాలమీద ముట్టడి తలపెడుతున్నారు. నేను స్వయంగా శివాజీ ప్రభువుతో మాట్లాడాను. రాయ్‌గడ్ కోటలోకి వెళ్ళి

దర్శించాను. నువ్వెందుకలా భయపడతావు ? ఆయన సాక్షాత్తూ అవతార పురుషుడు. దుర్జనులపాలిటి యముడు. గో బ్రాహ్మణ రక్షకుడు. పతివ్రతల పాలిటి పరమ భక్తుడు. ఆ శివాజీ ప్రభువు ముందు ఈ ఫతేఖానెంత ? ఒక దోమతో సమానం. అభేద్యమయిన జంజీర జలదుర్గంలో వున్నాను కదా అని ఫతేఖాను కొంక పిచ్చి ధైర్యం. రెండు మూడు నెల్లయిన తర్వాత చూసుకో పరిస్థితులు ఎలా మారిపోతాయో! మహా అయితే మార్గశిర మాసంవరకు ఓపిక పట్టాలి అంతే. సిద్దీఫతేఖాను అధీనంలో వున్న రాజ్యం యావత్తూ పట్టుకునే ఏర్పాట్లు చేస్తున్నారు శివాజీప్రభువు. మొట్టమొదట ఘోసాళ్గడ్ పట్టుకుంటారు ఆ తర్వాత అక్కడినుంచి లోయల మార్గంగా జంజీరమీద పడతారు. ఆఖరి ముట్టడి జంజీరమీద"

కెనోబా ఊరినుంచి వెళ్ళుతూ వెళ్ళుతూ భార్యకు చేసిన ఉపకారం ఈ మాటల ఊరడింపు మట్టుకేకాదు. ఇంకొక అభీష్టవరం కూడా ఆవిడకి ప్రసాదించాడు. కాని ఆ వరం ఇచ్చినట్లు అతనికీ తెలియదు;పొందినట్లు ఆవిడకీ తెలియదు. రెండునెల్లన్నర వెళ్ళితేనేగాని ఆ సంగతి ఆవిడకర్థం గాలేదు. అప్పుడుకూడా ఆ విషయం యశోదకి అర్థమవడానికి ముందు కోటమ్మకి అర్థమయింది. ఓ రోజు పొద్దున్నే నోరువిప్పి అనేసింది కూడాను ఆ ముసలిది.

"నీకెందుకే తల్లీ ఈ అల్లపురసమూ, నిమ్మకాయలూను ? ఇది పైత్యంకాదే, మా అమ్మా!" అని నవ్వుతూనే పలికింది. కోటమ్మకి నవ్వుగావుందిగానీ యశోదకి సిగ్గువేసింది. ఆవిడకి ఇదివరలో అనుభవంలోకి రాని ఏవేవో మధురభావాలు స్ఫురించాయి. "ఆహా! ఇక ఇప్పుడు నేను దిక్కులేనిదానను గాను" అనిపించింది. "నా స్వామి నాచెంతనే వున్నాడు....కాదు—నాలోనే వున్నాడు. నాలో సర్వాంతర్యామి అయి వున్నాడు! వుంటాడు!!" ఈ ఆలోచనలతో సతమతమవుతూ.సంతోషపడుతూ వెళ్ళి ఏకాంతంగా ఒక దిక్కున కూచుంది. కాస్సేపు నవ్వు

కుంది. కొంచెంసేపు ఏడ్చింది. ఆ తర్వాత ఆ గర్భస్థ శిశువుతో మాట్లాడింది :

"నీ ఆగమనం నాకు తెలిసింది. కాని ఆయనకి తెలిసివుంటుందా? ఎట్లా తెలుస్తుంది ? పోనీ ఆయన మళ్ళా ఒక్కసారి ఇటు అకస్మాత్తుగా వచ్చి, నీకు స్వాగతం చెప్పి వెళ్ళతా రంటావా ? కాని....ఒద్దులేబాబూ ! ఆయన రావద్దులే; నాయనా...."

ఎన్ని ఆపదలనైనా ఎదుర్కొని, యశోద ఇప్పుడు వంశం నిలబెట్టే బాధ్యత నిర్వహించుకోవాలి. కాని పొట్టలో ఒక్క మెతుకుకూడా ఇమడకపోవడంచేత శరీరం శుష్కించి పోయింది. ఎంతో పొడుగ్గా వున్నట్టు కనిపించేది రవిక చేతుల్లోంచి ఆవిడ దండలు లేత దూటలాగా వదులుగా వేళ్ళాడుతుండేవి. బుగ్గలమీది ఎముకలు బయట పడడంచేత, పొడుగుపాటి రెప్పలతో అసలే బాదంకాయలులాగ వుండే ఆవిడ సోగ కన్నులు మరీ లోతుకిపోయినట్టు కనిపిస్తూండేవి. ఆవిడ తెల్లటి శరీరం మీద నీలపు రక్తనాళాలు పైకి ఉబికి వంకర టింకరులుగా పందిరిమీది తీగల్లాగా కనిపించేవి. ఆవిడవేపు చూస్తే జాలివేసేది.కాని ఆవిడ హృదయంలో ఏవేవో మధుర స్మృతులూ, తలపులూ దోబూచులాడేవి. కాని ఆ సౌఖ్య సంవేదన ఎవరితో చెప్పుకుంటుంది ? వాడిపోతున్న తన శరీరాన్ని ఎవరిమీద నిర్భయంగా వాల్చి ఆసరా తీసుకుంటుంది ? కోటమ్మ ఆవిడకి సర్వవిధాలా సంరక్షణలు చేసేది నిజమే ! కాని యశోదయొక్క భావానాసృష్టిలో ప్రవేశించలేదు గదా ! కోటమ్మకి, యశోదకి మధ్య సాంస్కృతిక సన్నిహితత్వం ఎక్కడ వుంది ? వారిద్దరి మనఃప్రవృత్తులూ, సంచరించే పరిధుల్లోనే ఎంతో అంతరం వున్నది. అంచేత యశోద తనలోతనే తబ్బిబ్బుపడేది; తలక్రిందులయ్యేది; చివరకి ఏమీ తోచక తలగడాలో తల దూర్చి భర్తను తలచుకుని పరిదేవించేది.

"మీకు నామీద ఎంత దయ కలిగింది! సంవత్సరాల తరబడి నేను ఏది కాంక్షించానో అది అకస్మాత్తుగా వచ్చి ప్రసాదించి వెళ్ళి పోయారు. కాని మీ రిచ్చిన దానం తీసుకునే వాళ్ళకి ఛర్జిస్తుందో లేదో ఆలోచించారా? నాకు పుట్టింట తల్లిలేదు; ఈ ఇంట అత్తగారులేరు. నే నెవరి ఆధారంతో మీ వంశాంకురాన్ని వృద్ధి చేసుకోను చెప్పండి! ఇటు వంటి సమయంలో మీరయినా నాకు చేరువగా వుంటే బాగుండేది. మీ సాన్నిహిత్యం నాకెంతో అవసరం; నాకూ నా బిడ్డకీ కూడా ఎంతో అవ సరం"

యశోదకి నాలుగోనెల ప్రవేశించేటప్పటికి గర్భవతి చిహ్నాలు పూర్తిగా కనపడటం మొదలుపెట్టాయి. అంచేత ఇరుగు పొరుగునా, ఊళ్ళో వాళ్ళలోనూ కూడా గుసగుసలు ప్రారంభమయాయి. నీలాటి రేవులో ఆడిపోసుకోడానికి ఆడవాళ్ళందరికీ ఒక క్రొత్త విషయం దొరి కింది. కుచ్చితమయిన వాళ్ళు గుసగుసలాడుకోవటం మానేసి, బహిరం గంగానే సూటిపోటీగా మాటలు ప్రారంభించారు. కోటమ్మ ఊళ్ళో ఎక్క డయినా కనిపిస్తేచాలు, దాన్ని ప్రశ్నలతోనూ, పరాచకాలతోనూ వేధిం చటం మొదలుపెట్టారు. ఊళ్లోవున్న పుణ్యవతులయిన ఇల్లాళ్ళందరి మధ్యా యశోద ఒక పాపపు మనిషి అనీ, ఆవిడ చేసిన పాపం రోజు రోజుకీ ఎదుగుతూందనీ ఆరోపణలు సాగించారు. ఇట్లాటి దుష్ట ప్రచా రం వినిపించినప్పుడు కోటమ్మకి వంటిమీద బొబ్బలు లేస్తున్నట్టనిపిం చేది. ఆ మాటలు చెప్పుకుంటూన్న ఇల్లాళ్ళ మధ్యకి దూకి, వాళ్ళచెవులు మెలిపెట్టి గద్దించాలని ఆవేశం పుట్టుకొచ్చేది.

"పాడు పీనుగుల్లారా! మీనోళ్ళు పడిపోతాయి. మీరంతా పురుగులు పడి చస్తారు! మా అమ్మగారు నిర్మలమయినది. మా అయ్యగారు ఒక సారి ఇంటికొచ్చారు తెలుసా? రెండు రోజులున్నారు. వినాయక పూజ

ఆయనే స్వయంగా చేశారు ఈ సంవత్సరం. నా కళ్ళతో నే చూశాను" అని చెడామడా చీవాట్లు పెట్టాలనిపించేది.

కాని అంతట్లో తను చేసిన ప్రమాణం జ్ఞాపకం వచ్చేది. వినాయ కుడిమీద ఒట్టు పెట్టుకున్నట్టు జ్ఞాపకం వచ్చేది. అంచేత బలవంతాన్న నోరు నొక్కుకుని పారిపోయి వచ్చేది.

యశోద ఇంటిమీద కాపలా వేసిన జాసూద్ కూడా అప్పుడప్పుడు కోటమ్మని అటకాయిస్తూ వుండేవాడు. లేనిపోని ప్రశ్నలు అడుగుతూ వుండేవాడు. ఆ ముసిలిదానికి వాణ్ణి చూస్తేనే భయం. వాడితో మాట్లాడ వలసి వచ్చేటప్పటికి మాట తడబడిపోయేది. నోరు ఎండిపోయేది. ఎట్లాగో తప్పించుకుని వచ్చి యశోదతో చెప్పేది. ఊళ్ళోవాళ్ళన్న మాటలన్నీ ఏకరువు పెట్టేది. అది విన్నప్పుడు యశోదకి ఆ అమ్మ లక్కలందరిమీదా అమితమయిన కోపం వచ్చేది. కాని మరుక్షణంలో తనలోతనే ఆలోచించుకునేది. వాళ్ళని నిందించటంలో ఏం న్యాయం వుంది? వాళ్ళకి తెలిసినది నా మొగుడు ఎక్కడికో దేశాంతరం వెళ్ళి పోయాడని. అదయినా ఎనిమిది, పది నెలల క్రితం. ఆ తర్వాత జరిగిన సంఘటనలు పరాయివాళ్ళ కేం తెలుసు గనుక?

చివరికి ఈ పరిస్థితుల పరిణామం ఏమయిందంటే, యశోద ఇంట్లోంచి బయటకు రావడం మానుకుంది. సర్వకాల సర్వావస్థల యందూ ఇంట్లోనే గుప్తంగా పడివుండేది. కోటమ్మమట్టుకు ఊళ్లో తిరిగి పనులు చూసుకుంటూ, చెవిని సోకిన వర్తమానాలు పోగుచేసి తీసుకు వచ్చేది. తీరికగా కూచుని యశోదకి వినిపించేది—"ఏవమ్మోవ్! ఆ సిద్దీ ఫతేఖా నికీ, శివాజీకీ మధ్య బాగానే రాజుకుంటోందట. శివాజీ అప్పుడే ఘోసాళ్‌గడ్ కోట స్వాధీనం చేసుకున్నాట్ట. ఆ లోయల్లోంచి సైన్యంతో సహా ప్రయాణం చేస్తున్నాట్ట కూడాను. 'తళే' కోటకూడా ఆయన ఇది వరకే పట్టుకున్నాట్ట. ఇహ ఇప్పుడు ఆయన నిగా అంతా రాజపురిమీద

వుందిట. అదయిన తరవాత ఒకవేళ శ్రీవర్ధన్ కోటమీదకి వెళ్ళతారో, లేక జంజీరమీదకే వెళ్తారో ఇంకా తెలియదట"

ఈ వార్తలు వింటూన్నకొద్దీ యశోదకి ఆలోచనలు పరిపరివిధాల పరుగులెత్తేవి. అయితే శివాజీ మహారాజు ఘోసాళ్గడ్ పట్టుకున్నారన్న మాట! ఇంక యీయనే అక్కడ కిల్లేదార్ అయివుంటారు! అయితే మరి ఇంకా నన్ను తీసుకు వెళ్ళటానికి రాలేదేం మరి? ఏమో, ఒకవేళ శివాజీ మహారాజు "ముందు ముట్టడిలో కూడా నువ్వు నావెంట వుండ" మని తీసుకు వెళ్ళారేమో! రాజపురి పట్టుకోవడానికి ఈయనే సైన్యాన్ని నడిపించుకు వస్తారేమో? వచ్చినా రావచ్చు. రాజపురి జయించి, కోట మీద శివాజీ జెండా ప్రతిష్ఠించి విజయోత్సాహంతో ఆయన ఇంటికి వస్తే గుమ్మం ముందరే నిలబెడతాను. "ఒక్కక్షణం ఆగండి; నేను హారతి పట్టుకొస్తాను" అని చెప్పి ఆపుచేస్తాను. అప్పుడాయన నావేపు పరకాయించి చూస్తారు. నా దేహంలో వచ్చిన మార్పు ఇట్టే పోల్చుకుంటారు. "ఓహోహో! అదా సంగతి! ఏమిటే, భగవంతుడు మనల్ని కృప చూశాడన్నమాట!" అంటారు. అప్పుడిక సిగ్గుతో చచ్చిపోతాను నేను. ఆ తర్వాత ఊళ్ళో అమ్మలక్కలందర్నీ పట్టుకు దూదిస్తాను. "ఇప్పుడు చూడండే మీకళ్ళు రాలిపోయేలాగ. ఇహనైనా నమ్ముతారా నేను మంచి దాన్నేనని? ఇంకా నోటికి వచ్చినట్లు మాట్లాడే ధైర్యం వుందా మీకు?"

నాలుగోనెల గడచినకొద్దీ కాస్త అన్నం వంటపట్టడం ఆరంభమయింది. ఆరోగ్యం అతి శీఘ్రంగా కోలుకోవటం మొదలుపెట్టింది. మొట్టమొదట లోతుగాపోయిన కళ్ళు కొంచెం పూడుకున్నాయి. ఆ తర్వాత మొఖంమీద పాలిపోయిన వర్ణంపోయి కొంచెం నిగనిగ వచ్చింది. శివాజీ మహారాజా విజయాలని గురించి విన్ననాటినుంచీ ఆవిడకి మానసికంగా కూడా ఎంతో బలం కలిగింది. ఆవిడ తన మనస్సుతో నేనే మాట్లాడుకునేది: "ఏదో, మొత్తంమీద ఎక్కువ కష్టాలు లేకుండా

ఒడ్డున పడుతున్నాం. మనం కష్టసముద్రంలో పడిపోయాం; తడిసిపోయాం; బుటకలు వేశాం. కాని ఇంకో నాలుగు బారలు ఈదితే ఒడ్డెక్కుతాం. మొత్తానికి మునిగిపోకుండా బ్రతికి బయటపడుతున్నాం. ఇదంతా ఆ వినాయకుడి కృపే!"

ఆరోజున ఉదయాన్నుంచీ ఇలాటి ఆలోచనలతోటే ఎంతో ఉత్సాహంగా వుంది యశోద. కొంచెం సేపట్లో ఎవరూ పిలవకుండానే కొబ్బరినూనె సీసా తీసుకుని కోటమ్మ తల దువ్వడానికి వచ్చి కూచుంది. యశోదకి ఎదురుగా కూచుని, మొదట కుదుళ్ళల్లో వేళ్ళు పోనిచ్చి నూనె మర్దించింది. ఆ తర్వాత సూటిగా, శ్రద్ధగా పాపిడితీసింది. ఆ తర్వాత యశోద పనిమనిషి వేపు వీపుతిప్పి ఇటు తిరిగి కూచుంది; మోకాళ్ళు కౌగిలించుకుని ఏమేమిటో-ఆలోచిస్తూ తలకట్టు ముసిలిదానికి వప్పచెప్పి పరధ్యాన్నంగా కూచుంది. కోటమ్మ ఆ మెత్తటి జుట్టు దువ్వుతూ, పాయలు తీస్తూ శ్రద్ధగా జడవేస్తోంది. గట్టిగా ఒక్కొక్కపాయి దువ్వినప్పుడల్లా, యశోద ముఖం పైకి లేస్తోంది. ఆ ముఖంమీద లోపలనుంచి నెత్తురు చిమ్మి కళకళలాడుతూండేది. శివుడి జటాజూటంలో వున్న గంగాదేవి ముఖంలా మెరిసిపోయింది యశోద ముఖం. జడవేసి, చుట్టచుట్టి, యశోదని తనవేపు తిప్పుకుని ఒక్కసారి పరీక్షగా చూసింది కోటమ్మ. ఆ ముఖం మీద కళాకాంతులు చూసి నివ్వెరపోయింది.

"ఇవ్వాళ ఎంత అందంగా కనిపిస్తూన్నవేమే అమ్మాయి! ఏదో నక్షత్రం భూమిమీదకి రాలినట్టున్నావు" అంది సంతోషం పట్టలేక.

"నీ పాదాలమీద ఆ మసేమిటి చూసుకో!" అంది యశోద.

"అర్థమయింది లేమ్మా! దృష్టి తగలమనే నీకు. ప్రేమించిన వాళ్ళ చూపుల్లో దోషం వుండదులేమ్మా! ఎవరయినా పాపిష్టి వాళ్ళు చూస్తే అప్పుడూ దృష్టి దోషం!"

, కాని మరుక్షణంలోనే వాతావరణంలో ఒక మార్పు వచ్చింది. సిద్దీఫతేఖాను సిపాయిలు నలుగురు గుమ్మం ముందరకి వచ్చి నుంచున్నారు. వాళ్ళని చూడగానే ముసలిదానికి నోటమాట రాలేదు. యశోదకి రక్తం గడ్డకట్టి పోయినట్టనిపించింది. కళ్ళు పెద్దవి చేసుకుని, నోరు తెరుచుకుని అలా చూస్తూ వుండిపోయింది. దూడల పాకలోకి పెద్దపులి ప్రవేశించిందనుకుంది కోటమ్మ.

"ముందు బయటికి రండి. నిన్ను ఖైదుచేసి తీసుకురమ్మని సర్కార్ హుకుం ఇచ్చారు" అన్నాడు కోపంగా వాళ్ళలో పెద్దవాడు.

యశోదకి ఈ మాటలు బాగానే వినిపించాయిగాని, అవి మనసులో ఇంకి అర్థమవటానికి కొంచెంసేపు పట్టింది. వాటిఅర్థం వూహించుకునే టప్పటికి యశోదకి తన గుండె ఒక్క పట్టి కొట్టినట్టనిపించింది. ఇదేదో విపరీతమే సంభవించి వుంటుందని ఆవిడకి అనుమానం వేసింది. ఒక మహా భయంకరమయిన సందేహం తలఎత్తింది ఆవిడ మనసులో :

"బహుశా ఆయన్ని పట్టుకున్నారేమో ? ఆయన ద్రోహం చేశాడని శిక్ష విధించారేమో ? ఆయన్ని ఫిరంగికట్టి పేల్పించడానికో, గోనెలోకట్టి సముద్రంలో పారెయ్యడానికో నిశ్చయించారేమో, నాకళ్ళ ఎదుటే ఆ శిక్ష అమలుజరిపించి, మా శోకం చూచి ఆనందించాలని ఫతేఖాను ఉద్దేశ్యమేమో ?"

యశోద లేచి సహచరిని ఒక్కసారి కౌగిలించుకుంది. ఇద్దరూ చెంపకి చెంప చేర్చుకుని కొంచెంసేపు ఏడ్చారు. కాని వాళ్ళకి అంత మాత్రం వ్యవధి కూడా ఎక్కడిది ? ఆ రాక్షసులు బయటనుంచి కళ్ళు ఎర్రగా చేసుకుని కోపంగా చూస్తున్నారు. ఒక్కక్షణంలో యశోద తన శోకాన్నంతా దిగమింగుకుని, బయటికి వచ్చి నిలబడింది. తక్షణం ఆ సిపాయిలు ఆవిడచుట్టూ నిలబడ్డారు. ఆవిడ స్మారకంలేని దానిలాగా

వాళ్ళతో నడిచి వెళ్ళిపోయింది. చిన్నప్పుడు వాళ్ళ అమ్మ పదేపదే పాడు కునే పాటలో చరణం చటుక్కున జ్ఞాపకం వచ్చింది :

"అనాథల ఆర్తిని తీర్చేవాడా !
ద్రౌపదిని కాపాడినవాడా !"

అని తనలో తనే వల్లించుకుంటూ ఆ సిపాయిలతో నడిచింది. ఇహ ఇప్పుడు ఆవిడ కాళ్ళల్లో తడబడడం తగ్గి, ముఖంలో గంభీరత వచ్చింది. అలాగే ధైర్యంగా నడిచి వెళ్ళిపోయింది.

సరాసరి వెళ్ళి పడవలో ఎక్కింది సిపాయిలతోపాటు. పడవ నడుస్తూంటే ఎదురుగా ఆ నల్లటి జంజీరకోట మృత్యుదేవతలాగా నెమ్మ దిగా దగ్గరకు వస్తోంది. "రా, తొందరగా రా ! నాకెంతో ఆకలిగా వుంది. నిన్ను ఒక్క గుటకలో మింగేస్తా" నంటోంది ఆ నల్లటికోట. ఆ కోటలోకి వెళ్ళే మెట్లని ఆనుకునే ఆగింది పడవ. కాని పడవనిండా మనుష్యులుండటంవల్ల పడవ ఊగిసలాడుతూనే వుంది. ఆ సిపాయిలు మాత్రం చకచకా నేలమీదకి ఉరికారు. అందేత పడవ ఇంకా ఊగిస లాడింది. యశోద దిగేందుకు ఆధారంగా సిపాయిలు చేతులందిచ్చారు. కాని వాళ్ళ చేతుల స్పర్శ తగలడంకంటె పడవకీ ఒడ్డుకీ మధ్యని పడి చచ్చిపోయినా నయమే ననిపించింది యశోదకి. అందేత ఆ చేతులని నిర్లక్ష్యంచేసి, తనంతట తనే ఒడ్డుమీదికి దూకింది. చరచరా మెట్లెక్క డం ప్రారంభించింది. ఆవిడకేసి ఆశ్చర్యంగా చూస్తూ ఆ సిపాయిలు మాత్రం పొగడ్తగానూ, పోకిరీగానూ మాట్లాడారు : "చూశావురా భాయీ ! నిజంగా స్వర్గంలోంచి దిగివచ్చిన అప్సరసేకదూ !" అన్నాడు ఒకడు నోరు చప్పరిస్తూ.

ఫతేఖాను ఆ సమయంలో ఆలోచనా మందిరంలో వున్నాడు. ఆయన పక్కని దివానుగారూ, సేనాధిపతీ ఏమేమిటో బోధలు చేస్తు న్నారు.

"....పరిస్థితులు రోజురోజుకీ ప్రమాదిస్తున్నాయి. ఆ శివాజీ మన రాజ్యంలోకి లోతుగా చొచ్చుకుని వస్తున్నాడు. మన సైన్యాలని తరిమి కొట్టి, అతను మన కోటలనీ, పట్టణాలనీ స్వాధీనం చేసుకుంటున్నాడు. అతనిదృష్టి అంతా ఈ జంజీర దుర్గంమీదనే వుంది. ఇది బలమయిన కోటే అనుకోండి; కానీ దీన్ని ముట్టడించడమూ సాధ్యమే. ఆలీబాగ్ కోటదగ్గిర అతను సైన్యం అంతా సమకూర్చుకుంటున్నాడట. అతని పడవాలూ, నావలూ ఈ ప్రాంతపు సముద్రంలో తెగ తిరుగుతున్నాయట. ఈ కోటకి కనక ఆయన ముట్టడి వేశాడంటే, మనకి మిగిలిన రాజ్యంతో సంబంధం తెగిపోతుంది"

ఈ వుదంతం అంతా వింటూంటే ఫతేఖానుకి తనచుట్టూ అరణ్యం పెరిగినట్లనిపించింది. విలాస పురుషుడుగా జీవితం వెళ్ళబుచ్చటానికి అలవాటుపడిన అతనికి ఈ గొడవలన్నీ దుర్భరంగా కనుపించాయి. తినడం, తాగడం తోచినదానితో నిద్ర చెయ్యడంతప్ప ఇంకే పురుషార్థం జోలికి పోయినవాడుకాడు ఫతేఖాను. ఇంకే విషయమూ, విద్యా తెలిసినవాడూకాదు. అంచేత పరిస్థితుల ప్రమాదాలు ఎంత వర్ణించిచెప్పినా, ఇప్పుడుకూడా ఒక్క హుకుం జారీ చేసేవాడు. "అన్ని ఏర్పాట్లూ సక్రమంగా చెయ్యండి ! ఆ శివాజీ రాజపురీ లోయలోంచి ఇటు రాకూడదు; అంతే !" దాంతో తన కర్తృత్వం అయిపోయిందని తృప్తిపడి, ఆ ఆలోచనా మందిరం వదిలి చక్కాపోయాడు.

న్యాయస్థానంలో ప్రవేశించగానే,సిపాయిలు యశోదని తీసుకొచ్చి ఎదుట నుంచోబెట్టారు. ఆవిడ ముఖం చూడగానే ఫతేఖాను నుదుటిమీది చిట్లింపు ముడతలు మాయమయిపోయాయి. ఆ చొంగ కారుతున్న పెదిమలతో ఆ నల్లటి పొట్టుగాటి బక్క పల్చటి ఫతేఖాను ఆవిడని కళ్ళతోటే పీల్చేసేలాగ చూస్తూ వుండిపోయాడు. అప్రయత్నంగానే యశోద తలవంచుకుంది. ఈవిడ ఇంత అందగత్తె అని ముందరే తెలిసివుంటే,

కెరోబా పారిపోయిన మరుక్షణంలోనే కోటలోకి పిలిపించుకునేవాణ్ణిగదా అని ఫతేఖాను పశ్చాత్తాపపడ్డాడు. ఆవిడవేపు మళ్ళీ ఒకసారి ఆపాద మస్తకమూ పరీక్షగా చూశాడు. కాస్త ఎత్తుగా కనిపిస్తూన్న ఆవిడ పొట్ట కేసి ఇంకొక్కసారి నిగాగా చూశాడు.

"నిన్ను ఖైదు చేయించి ఎందుకు పిలిపించామో తెలుసా ?"

అతని క్రూరమయిన కంఠస్వరం ఆవిడ హృదయంలో బల్లెం లాగా గుచ్చుకుంది. ఏమీ మాట్లాడకుండానే వుండిపోయింది.

"నీ మొగుడెక్కడున్నాడు ?"

"నాకు తెలియదు" అంది తనలోతను గొణుక్కున్నట్టు.

"నీకు తెలియదూ, నిజమే చెబుతున్నావా ?"

"అవును"

"అయితే నీమీద ఇంకోనేరం ఋజువయిందన్నమాట !"

"నేరమా ? ఏమిటది ? నేనేం తప్పు చేశాను ?"

"ఏం తప్పు చేశావా, హుఁ ! నీ పొట్టకేసి చూసుకో: నువ్వు వ్యభిచారం చేశావన్నమాట. నీ గర్భంలో పాపం పెరుగుతోందన్న మాట"

ఈ ఘోరమయిన ఆరోపణ చెవిని పడేటప్పటికి యశోద శరీరం, గర్భస్థ శిశువుతో సహా ఒక్కసారి ఉలిక్కిపడింది. ఇటువంటి నింద ఆవిడకి కల్పనాతీతంగా కనిపించింది. తనవంటి కులస్త్రీకి దుర్భర మనికూడా అనిపించింది. కాని అంతటి అవమానంలోనూ, అంతటి కోపంలోనూ ఆవిడకి మరొక్క సంగతి బోధపడింది. తనభర్త పట్టు బడలేదు. తనకి ఇంటిదగ్గిర తోచిన భయాలన్నీ నిరాధారమయినవే. అది ఊహించుకునేటప్పటికి ఆవిడికి మళ్ళా కాస్త ధైర్యం వచ్చింది. అంచేత ఖంగుమనే స్వరంతో జవాబు చెప్పింది.

"కాదు. సుతరామూ కాదు. అటువంటి పాపం నే కలలోకూడా చేసే మనిషినికాను.నామీద ఇట్లాటి అభాండాలు వెయ్యడం అన్యాయం!"

ఈ మాటలు అంటూన్నప్పుడు యశోద తెల్లటి శరీరం ఎర్రబడింది. కణకణలాడే నిప్పులాటి మెరుపు ఆవిడనుంచి వెలువడింది. ఫతేఖాను ఆవిడవేపు చూడలేకపోయాడు. అంచేత ఒక్క-క్షణం తబ్బిబ్బుపడ్డాడు. ఆవిడ వ్యభిచారిణి కాదని అతనికి మనసులో దృఢమయిపోయింది. అదే ఇంకెవరయినా కురూపి. నల్లటిదీ అయిన స్త్రీ అయితే అంతటితోనే విడిచిపెట్టి వుండేవాడు.కాని ఈ యశోద అందంగావుంది: తెల్లగావుంది: కమల పుష్పంలాగా కోమలంగా వుంది. ఫతేఖాను నల్లగా భ్రమరంలాగా కోపిడీకి అలవాటుపడిన మనిషి. గట్టిగా పట్టుకుని వాసన చూస్తేనేగాని పువ్వుయొక్క- అందాన్ని అనుభవించలేని వ్యక్తి అతను.

ఫతేఖాను పూర్వీకులు జంజీర రాజ్యంలో ఒక రివాజు ఏర్పాటు చేశారు. ఏ స్త్రీ అయినా పాపంచేసి గర్భవతి అయినట్లు ఋజువయితే, ఆ స్త్రీని తమమతంలో నిక్కా- కట్టేసుకోవచ్చు. ఆ స్త్రీ అందంగావుంటే పెద్ద ఉద్యోగుల జనానాలో జమ అయిపోయేది. లేకపోతే ఏ సిపాయీ ఇంటికో రవాణా అయిపోయేది. ఈ విధంగా వారి జాతిని వారు వృద్ధి చేసుకుంటూ వుండేవారు. "తండ్రినయినా చూపించు. తద్దినమయినా పెట్టు!" అనే సామెతగా తటస్థించింది ఇప్పుడు యశోద పరిస్థితి. "కెరోబా ఎక్క-డున్నాడో చెప్పనయినా చెప్పు: లేకపోతే వ్యభిచారం చేసినట్లయినా ఒప్పుకో!" అంటున్నారు.

యశోదకి ఇప్పుడు ఈ రెండూ చేతకానిపనులే. కెరోబా ఎక్క-డున్నాడో. ఒకవేళ తనకి తెలిసివున్నా చెప్పేదేకాదుగదా! తన చేతులతోనే తన గాజులు పగలకొట్టుకునే పుణ్యస్త్రీ ఎవరైవుంటుంది? కాని భర్త ఎక్క-డున్నదీ చెప్పలేనంత మాత్రాన వ్యభిచారం ఒప్పుకోవటం

మాత్రం ఎలా సాధ్యమవుతుంది? పవిత్రమయిన దీపజ్యోతి సాక్షిగా, పరస్పరమూవున్న ప్రేమ ఫలితంగా అంకురించిన గర్భోత్పత్తిని పాప మని ఏ తల్లి అంటుంది? అంచేత పొంగివస్తూన్న దుఃఖాన్ని మ్రింగుతూ, మాట్లాడకుండా నుంచోడంకంటే యశోదకి ఇంకేమీ చేత కాలేదు. ఆవిడ మౌనం అపార్థం చేసుకుని ఫతేఖాను ఏదో పెద్ద విజ యం సాధించినవాడిలాగా గర్జించటం ఆరంభించాడు:

"నీ మీద ఆరోపించిన నేరాన్ని నువ్వు కాదనలేకపోతున్నావు. అంచేత ఆ నేరానికి పరిపాటి అయిన శిక్ష నువ్వు అనుభవించక తప్పదు. అయినా నువ్వు పరువు ప్రతిష్ఠలున్న కుటుంబానికి చెందిన స్త్రీవి. అంచేత నీకు తగినంత న్యాయం జరగడంకోసం నేనే నిన్ను నిక్కా కట్టుకుంటాను. నువ్వు ఆనందంగా వుండటమే నేను వాంఛించేది. మంచిరోజు చూసి నిన్ను మా వైభవానికీ, సుఖానికీ భాగస్తురాలుగా చేసు కుంటాం!"

ఒక కులస్త్రీకి ఈ శిక్ష అమానుష మనిపిస్తుంది. ఇంతకంటె గొడ్డ లితో ఒక్కవేటున గొంతుక తెగవేసినా మెరుగేననిపిస్తూంది; బస్తాలో కుక్కి సముద్రంలో పారేసినా సుఖమేననిపిస్తూంది. కాని ఆవిడకి బ్రతికి వుండడమనే శిక్ష విధించాడు ఫతేఖాను. అతని ఆజ్ఞ ప్రకారం ఆవిడని ఒకకొట్లో నిర్బంధించి వుంచేశారు. అక్కడ తన విధిని తిట్టు కుంటూ కూచుంది యశోద. తన సుకుమారమయిన దేహమే భారమని పించింది ఆ సమయంలో. తన గర్భంలో మెసులుతూన్న శిశువు తన నాశనానికి కారణమయిన రణ మనిపించింది. ఒక్క క్షణంలో ఆవిడ ఆలోచనలూ, భావనలూ అస్తవ్యస్థమయి పోయాయి.

మధ్యాహ్నమయేటప్పటికి ఒక పరిచారిక పళ్లెంలో అన్నం పట్టుకు వచ్చి ఆ గదిలో పెట్టింది. కాని యశోద దానివంక చూడనయినా లేదు.

ఆ రాత్రి ఇంకో పరిచారిక మిణుకు మిణుకుమనే దీపం ఒకటి తెచ్చి అక్కడపెట్టి వెళ్ళింది. కాని యశోద ఆ మరుక్షణంలోనే ఆ దీపం ఆర్పి వేసింది. తన హృదయంలో కమ్ముకున్న చీకటికి తగినట్లుగా బయట గది అంతాకూడా చీకటి చేసేసింది. చీకటిఅంటే ఆవిడకి ఏ విధమయిన భయమూ కలగలేదు. పైగా ఈ చీకటి ఇలాగే దట్టమయిపోయి తన శరీరంలో వున్న ప్రతికణమూ చీకటిలో కలసిపోయి ఎవరికీ కనుపించకుండా పోవాలని కోరుకుంది.

యశోద ఆ కటిక చీకటిలో ఒకమూలచేరి, గోడనానుకుని పిడచ కట్టుకుపోయినట్లు కూచుంది. బయట అలికిడి అంతా ఆగిపోయిన తరువాత ఏ మధ్యరాత్రికో ఆ కూచున్నచోటే ఒక్క రవ్వ దేహం వాల్చేదేమో: అలుపుకొద్దీ నిద్ర ఎలాగూ పట్టేదికాదుకాని, ఒక విధమయిన మైకమయినా సాధ్యమయేదేమో! కాని అంతట్లో తలుపు గడియ తీసినట్లు శబ్దమయింది.తలుపు తెరుచుకుని ఫతేఖాను లోపలకి ప్రవేశించాడు. అతను తన స్వరంలో వీలయినంత మార్దవం తెచ్చి పెట్టుకుని "ప్యారీ" అని సంబోధించాడు.

నాగుపాముకి వున్న విషమంతా, కోరవెనకవున్న ఒక్క చిన్న సంచిలో పోగయివుంటుంది. అట్లాగే ఫతేఖానులోవున్న దుష్టత్వమంతా ఆ "ప్యారీ" అన్న పదం పలకడంలో కేంద్రీకరించుకున్నట్లు అర్థమయింది.ఇక ముందు తన కెటువంటి గతిపడుతుందో యశోదకి పూర్తిగా అర్థమయిపోయింది. అంచేత ఆవిడ అమాంతం లేచివచ్చి, అతని కాళ్ళ దగ్గిర మోకరించి, అతి దీనంగా ప్రార్థించడం మొదలుపెట్టింది.

"నా జీవితాన్ని ఇట్లా వెటకారం చెయ్యకు. ఆయన ఎక్కడున్నాడో నాకు నిజంగా తెలియదు. ఆయనమీద ఒట్టేసుకు చెబుతున్నాను. అదీగాక నేను, నేను....నిజంగా ఎటువంటి దుష్కార్యమూ

చెయ్యలేదు. నువ్వు నన్ను ఒదిలిపెట్టు. నువ్వు నా అన్నగారి వనుకుంటాను. నాకు ధర్మప్రకారం ఏర్పడిన అన్నగారి వనుకుంటాను"

కంఠం గాద్గదికమయి నందువల్ల ఆ తర్వాత ఆవిడ ఇంకేమీ మాట్లాడలేకపోయింది. కాని ఈ ప్రార్థనవల్ల ఫతేఖానులో అవగింజంత యినా మార్పురాలేదు. అతను పకపకా నవ్వాడు; ఒక్క వికట అట్టహాసం చేశాడు. ఆ క్షణంలో యశోదకి ఫతేఖానంటే ఏమిటో అర్థమయిపోయింది. ఆ కోటలోవున్న నల్లరాతి బండల్లాటివాడే అతను కూడాను. అతని దేహమూ, హృదయమూ కూడా నల్లటివే. ఈ జంజీర కోట పునాదులని ఎప్పుడో ఒక నూతన దంపతుల శవాలమీద కట్టారు. ఈ గోడల సున్నాన్ని మనుషుల రక్తంతో తడిపారు. ఇక్కడ దయకీ, ధర్మానికీ, నీతికీ, మానుషత్వానికీ ఏ విధమయిన ఆస్కారమూలేదు. ఇక్కడ నాలాటి వాళ్ళు బురదలో అయినా పొర్లాడాలి; లేకపోతే....లేకపోతే...."

ఆ మరుక్షణంలో యశోద తన వ్యూహం మార్చింది. "నా కిక్కడ ప్రాణం కడంటి పోయినట్లుంది. శుభ్రమయిన గాలి అయినా తగలకుండా ప్రొద్దున్ననుంచీ ఈ గదిలో బంధించారు. నన్ను మొదట బయటకురానీ, కాస్సేపు చల్లగాలిలో తిరగనీ" అంది.

"బహూత్ అచ్ఛా। నాతో పద।"

రోషంగల మృగం ఇప్పుడే కాస్త మచ్చికవుతోందని సంతోషించాడు ఫతేఖాను. తర్వాత తన ఇచ్ఛతీరే పనయితే ఆవిడకి కాస్సేపు గాలిలో తిరగడమనే బహుమతి ముందే ఇవ్వడంలో తనకేమీ అభ్యంతరంలేదు. అంచేత యశోదను ముందు నడవమని కోట పై భాగానికి వచ్చాడు ఫతేఖాను. ఆవిడ అలా తిరుగుతూ తిరుగుతూ ఒక బురుజు దగ్గరకి వచ్చింది. ఆ బురుజుకి నాలుగు కమానులున్నాయి. ఒక్కొక్క

దాంట్లోను ఒక్కొక్క ఫిరంగి వుంది. యశోద ఒక్క ఫిరంగిని అను కుని నుంచుంది. ఫతేఖాను ఇంకో ఫిరంగిమీద జారగిలబడి ఆవిడవేపే చూస్తున్నాడు. యశోద ఒక్క నిట్టూర్పు విడిచి, నాలుగువేపులా కలియ చూచింది.

గంభీరమయిన రాత్రి గడియలు గాఢాంధకారాన్ని పెనవయిచు కుని ఎటో తర్లిపోతున్నాయి. గాలి హోరుమని శబ్దంచేస్తూ వీస్తోంది. మార్గశీర్ష మాసపు చలి ఎముకలని కొరకటానికి ప్రయత్నిస్తోంది. పై నుంచి మంచు కురుస్తోంది. నేలా, ఆకాశమూ తేడా తెలియనంతగా చీకట్లు గడ్డకట్టుకు పోయినాయి. చీకట్లో రూపం తెలియదు కాని ఆకృతి తెలుస్తుంది. ఏదో ఒక భయంకరమయిన ఆకృతిలాగా కనిపిస్తున్నాడు ఫతేఖాను. అతని కళ్ళల్లో మదపుకైపు ఎక్కువవుతున్నట్లు, పెదిమలు కంపిస్తున్నట్లు, శరీరం కామాగ్నితో కాగిపోతున్నట్లు కొంత స్పష్టం గానూ, కొంత అస్పష్టంగానూ యశోదకు పొడగట్టినయి.

ఆవిడ కంగారు పడింది. పైకి చూసింది. నక్షత్రాలు పొదిగిన నల్లటిచీర గట్టుకుని, ఆకాశ గంగ వడ్డాణంగా పెట్టుకుని వయ్యారంగా నడుస్తున్న ఆ రాత్రిని చూస్తే ఆవిడకి చిరాకు వేసింది. కొమ్మల చిగు ళ్ళను ఊపుతూ, పెద్ద పెద్ద చెట్లను వంచుతూ, రాజపురి లోయలోని అడ వులలో తరంగాలను లేపుతూ, తన గొడవే తను చూసుకుంటూ దూసుకు పోతూన్న ఆ గాలిని చూస్తే ఆవిడకి కోపం వచ్చింది. ప్రతి కెరటం మీదా నురగలు ప్రదర్శిస్తూ, పకపకా నవ్వుతూన్న సముద్రాన్ని చూస్తే ఆవిడకి ద్వేషం పుట్టుకొచ్చింది.

ఒక నిష్కల్మషమయిన కులస్త్రీకి అత్యాచారం జరిగే సమయంలో పంచమహాభూతాలు ప్రకోపించి ఆవిడని రక్షించాలి నిజానికి. ప్రకృతి శక్తులు పరుగునవచ్చి ఆ ఫతేఖానునయినా స్మారకం లేకుండా పడి

పోయేట్టు చెయ్యాలి. లేక తననయినా అవలీలగా ఆకాశంలోకి ఎత్తుకు తీసుకుపోవాలి.

కాని అటువంటి రక్షణ సంఘటన ఏదీ జరగలేదు. ప్రత్యక్షంగా జరిగిన దేమిటంటే ఆ ఫతేఖాను ఒక్కొక్క అడుగు ముందుకు వేసుకుంటూ తనవేపు వస్తున్నాడు. తన చెయ్యి చాచి ఆవిడ నడుముమీద వేసి తనవేపు లాక్కున్నాడు. కరుకు గడ్డంగల అతని ముఖం క్రిందికి వంగుతోంది. దేవుని కిరీటంమీద పడవలసిన పూజాపుష్పం ఒక దైత్యుడి పాదాలక్రింద నలిగిపోయే క్షణం వచ్చింది.

ఆ క్షణంలో యశోద ఒంట్లో ఏదో ఒక అపూర్వమయిన బలం మెరుపులా ప్రవేశించింది. అది ఎదటివాళ్ళని కాల్చేసే మెరుపుకాదు; స్వనాశం చెయ్యగలిగిన శక్తి. దైవమూ, ధర్మమూ, స్వజనమూ, ఆప్తులూ, ఎవ్వరూ—ఏ ఒక్కళ్ళూ కూడా తన రక్షణకిక రాలేరని యశోదకి ఋజువయిపోయింది. అంచేత తన ప్రయత్నంమీదే తను ఆధారపడి ముక్తురాలవడానికి నిశ్చయించుకుంది. తన జీవిత నాటకంమీద తెర దించెయ్యడానికి తీర్మానించుకుంది. ఇంకొక్క క్షణముంటే తను మలినమయిపోతుంది. ఆ క్షణంలో ఆవిడకి అంతటి బలం ఎక్కడినుంచి వచ్చిందో ఎవరికి తెలుస్తుంది? తన వక్షస్థలానికి అదుముకునేందుకు యశోదను దగ్గిరగా లాక్కుంటున్న ఫతేఖానుని ఒక్కతోపు త్రోసింది. మరుక్షణంలో అటుతిరిగి, తన పవిత్రత భంగం కాకముందే ఉదరస్థ శిశువుతో సహా సముద్రంలోకి దూకేసింది.

'ఢప్పు'మని చప్పుడయింది.

"ఎవరా పడినవారు?" అనుకుంటూ కెరటాలు పరుగెత్తుకుంటూ పచ్చి పట్టూ మూగినయి. సముద్రుడు ఆవిడ తలమీద నురగల రూపంలో మల్లెపూల కిరీటం పెట్టాడు.

ఫతేఖాను "మోసం మోసం" అని కేకలు వేశాడు. ఆ కేకలకి జంజీర కోటలో వున్న పేగులుకూడా దద్దరిల్లిపోయాయి. సిపాయిలూ, ఫారావాళ్ళూ కాగడాలు పట్టుకుని పరుగెత్తుకు వచ్చారు. ఇంతట్లో సప్తమి చంద్రుడుకూడా సహ్యాద్రి పర్వత శ్రేణిమీద ఉదయించాడు. రాజపురి లోయలమీదా, సముద్రంమీదా కూడా స్వచ్ఛమయిన ధవళకాంతి ప్రస రించింది. ఫారావాళ్ళల్లో ఎవడో ఒకడు అటు పడమటి దిక్కును చూసి "అదిగో, అదిగో అటుచూడండి !" అన్నాడు.

తెల్లటి తెరచాపనిండా గాలి పూరించుకుని రయ్యిమని వెళ్ళి పోతోంది ఒక పడవ. ఆ పడవ సరంగు శివాజీ ఆజ్ఞ ప్రకారం, ప్రాణా లకి తెగించి, శత్రుతీరంలో గూఢచారిగా వచ్చి కోటను ముట్టడించ డానికీ, శత్రువుల నౌకలలో మిత్రభేదం పెట్టడానికీ చీకటి సమయంలో వచ్చి ఆ కోట నీడలో నక్కి వున్నాడు ఎంతసేపటినుంచో. తగిన సమయంకోసం, మంచి ఆలోచన తట్టటంకోసం నిరీక్షిస్తూ వున్నాడతను. ఆ ఆలోచనల్లో వుండగా చటుక్కున ఏదో సముద్రంలో అంత ఎత్తు నించి పడిపోయింది. నిండు ప్రాణం మూడుసార్లు తేలింది పైకి. అంచేత ఆ ప్రాణిని రక్షించటమే అతనికి ప్రథమ కర్తవ్యమయిపోయింది. తన ఇద్దరు సహచరుల సహాయంతోటి క్షణంలో పడవ దగ్గిరకి నడిపించి మునిగిపోతూన్న ప్రాణిని పడవలోకి లాగించాడు. ఆపాదమస్తకం తడిసిపోయి, వణికిపోతున్న యశోద "మళ్ళీ మీరెవ్వరు తటస్థించారు నాకు అడ్డుగా? నేనొక ఆపదలోంచి బయటపడ్డాను; ఇప్పుడింకా ఏమి [illegible]ఖాన్ని రాసివున్నాయి? ఎవరు మీరు?" అని [illegible]



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B138 |
| పుస్తకం పేరు | బంగరు పంజరం |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 168 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 168 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thas Haseena |
| | |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |